ఆంధ్రసచిత్ర వారపత్రిక

29, నవంబర్-
5, డిసెంబర్, '85
రూ. 2-50

మనుష్యుల్ని
పీడించే జంతు
పరాన్నజీవులు

విశృంఖలంగా సాగే
వేటకు బలైపోతున్న
వన్య ప్రాణులు

# పల్లవ శిల్పకళా వైభవం



ప్రప్రథమంగా పండరాపురం పాండురంగని దేవాలయంలో చిత్రీకరించిన మొదటి చిత్రం
పండరాపురంలో వైభవంగా జరిగే బ్రహ్మోత్సవాలను కన్నుల పండుగగా చిత్రించిన మొదటి చిత్రం
పండరాపురం చూడని పాండురంగని భక్తులకు పండరాపురం వైభవాన్ని అత్యంత అద్భుతంగా
చిత్రీకరించిన

గంగాధర్

# శ్రీ పాండురంగ లీల

నిర్మాత: ఎ.ఆర్.రాజు * స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: ఎస్.ఎస్.ధనంజయ

సహనిర్మాతలు: ఎ.రాధాకృష్ణరాజు - వి.ఎల్.ఎస్.మూర్తి

CONTACT FOR TERRITORIAL RIGHTS :-
AJANTA COMBINES, GANDHINAGAR
BANGALORE - 560 009 - PHONES : 75334/70904
MADRAS OFFICE :
'C' BLOCK, 6th FLOOR, ROOM NO: 5, GEMINI PARSN.

సమృద్ధ పరిమళము
సరియైన ధరతో




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

"గులాబి మరియు ఆకుపచ్చ రంగులలో లభించును"



జయలక్ష్మి
గుంటూరు వారి
తయారీ

Imageads-2107 Tel




## దసరా సంచిక

18–24 అక్టోబర్ 85 పత్రిక 'శ్రీదుర్గ' ముఖచిత్రంతో అనంత శోభాయమానంగా వెలసింది. సీరియల్ "త్రివేణీ సంగమం" బాగుంది.

నవులూరి ఉమాప్రసాద్, కపిలేశ్వరపురం

* * *

శ్రీదుర్గ ముఖచిత్రముతో వెలువడిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" మమ్మెంతగానో ఆనందింప చేసింది. "మలుపు" కథ చాలా బాగుంది రచయిత్రి ఆదూరి సావిత్రిగార్కి నా హృదయ పూర్వక అభినందనలు.

యస్. చిన్నమల్లికార్జుననాయుడు
యర్రగొండపాలెం.

## ధర్మపథం

నటి కుమారి మంజు ముఖచిత్రంతో వెలువడిన 25-31 అక్టోబరు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో

"ధర్మపథం" శీర్షికలో సంస్కృత భాషాభివృద్ధి వ్యాప్తికి తీసుకోవలసిన చర్యలు, ప్రభుత్వము, సంస్కృత భాషాభివృద్ధికి తోడ్పడే సంస్థలకు శ్రీ బులుసు వేంకట రమణయ్య గారు చక్కగా వివరించారు.

జిట్టా రమణిమోహన్, కడప

## గమనిక

దీపావళి సంచిక (8-14 నవంబరు 85), దాని తరువాతి సంచిక (15-21 నవంబరు 85) సంచికలో పడిన ఇ'వేమన' పద్యాలు శీర్షికకి సంబంధించిన బొమ్మలు తారుమారు అయినాయి. మొదటి సంచికలో పడిన బొమ్మ రెండవ సంచికలోని పద్యానికి, రెండవ సంచికలోని బొమ్మ మొదటి సంచికలోని పద్యానికి సంబంధించినదిగా పాఠకులు గమనించ కోరుతున్నాము.

పొరపాటుకి చింతిస్తున్నాము -సం





ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

29, నవంబరు – 5, డిసెంబరు, 1985
శ్రీ క్రోధన నామ సం. కార్తీక. బ. విదియ
సంపుటము 78 : సంచిక 12

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి : తులసి
(ఫొటో . కె.ఆర్.వి. భక్త)

# "10-15 సెం.మీ. లావు తగ్గించుకోండి"

## సౌనా సిస్టమ్ 900 వాడండి.

**రూ. 42/- ఆదా చేయండి.**

## మీ నడుము, తుంటి, తొడలు, లావెక్కకుండా జాగ్రత్త పడండి వెంటనే!

మీరు ఈ క్రింది కూపన్ పూర్తిచేసి మీ ఆర్డర్ ఇవాళే పంపండి. ఉచితంగా 14 రోజులపాటు వాడి చూడండి. ఖర్చేమీ లేకుండా మీ లావు ఒక్కొక్క సెంటీమీటరే ఎలా తగ్గిపోతుందో గమనించండి. వాడాక కూడా, ఏ కారణం చేతైనా మీకు సంతృప్తి కలగకపోతే దీన్ని మాకు తిప్పిపంపండి, మీ డబ్బు వాపసు చేస్తాం. ప్రపంచమంతటా 8,76 000 మందికి పైగా ఇది సంతృప్తి కల్గించింది. ఆ ధైర్యంతోనే మేము మీకు ఈ అద్భుతమైన గ్యారంటీ ఇస్తున్నాం!

ఈరోజే వాడి చూడండి!

సౌనా సిస్టమ్ 900 తనదైన ఓ సులభ వ్యాయామ కార్యక్రమంతో లభిస్తుంది, తొందరగా మీ లావు తగ్గిస్తుంది.

### మీ నడుము కొలత తగ్గించుకోవడం అతి సులభం




అ. ఈ రెండు సులభమైన వ్యాయామాలూ సౌనా సిస్టమ్‌తో రోజుకు 10 నిమిషాలపాటు చెయ్యండి.




ఆ. వ్యాయామం పూర్తయ్యాక, కనీసం 20 నిమిషాలపాటు సౌనా సిస్టమ్‌ను అలాగే వుంచుకొని విశ్రాంతి తీసుకోండి: ఆ సమయంలో మీరు చదువుకోవడం, సంగీతం వినడం మొదలైనవి చేయొచ్చు.




ఇ. సౌనా సిస్టమ్ తీసేసి ఫలితాలు ఎలా వున్నాయో చూసుకోండి మీ నడుము బిగువుగా, చదునుగా, దృఢంగా ఉంటుంది. మొదటిసారికే మీరు 3 సెం.మీ తగ్గవచ్చు.

### ఉచితం
- లావుకొలిచే ప్రత్యేక మెషరర్ ఒకటి
- వ్యాయామంపై 16 పేజీల పుస్తకం

బుల్‌వర్కర్ ప్రై లి., మెహతా మహల్, 15 మాథ్యూ రోడ్, బొంబాయి 400 004.

**శాస్త్రీయంగా సన్నబడండి, తిండి మానకండి!**

**అవును నిజమే!**

మొదటి రోజే మీరు 4-6 సెం.మీ. లావు తగ్గుతారు. ఏళ్ల నుంచీ తెలిసిన వైజ్ఞానిక సూత్రం ఇది. ఇప్పుడు ప్రపంచమంతటా ప్రముఖ క్రీడాకారులూ, సినిమా తారలూ తమ శరీరాన్ని తీరుగా ఉంచుకొనడానికి ఈ పద్ధతి అనుసరిస్తున్నారు. మరి మీరు కూడా ఉపయోగించండి. మీ నడుము ..తుంటి.. ఇంకే భాగమైనా ఎలా లావు తగ్గిపోతుందో గమనించండి.

**లావెక్కకండి...దాన్ని వదిలించుకోండి**

సౌనా సిస్టమ్ 900 కేవలం లావుని తగ్గించడం మాత్రమే కాదు, మీ శరీరాన్ని మీరు కోరుకున్నంత సన్నబరుస్తుంది. మీరు సన్నబడుతున్నకొద్దీ, సౌనా బెల్టుని కూడా తగినట్టుగా బిగించి కట్టుకొనే సదుపాయం దీనిలో ఉంది. సౌనా సిస్టమ్ ఉపయోగిస్తున్నకొద్దీ మీ నడుము, తుంటి, లావెక్కిన ఇతర శరీర భాగాలు తగ్గుతూపోతాయి. మీకు కావలసినప్పుడల్లా దీన్ని ఉపయోగించవచ్చు.

**నకిలీది కాదు, అసలైనది!**

**సౌనా సిస్టమ్ 900** అతి నాణ్యమైన వ్యాయామ సాధనం. ఇది అలసిపోయిన మీ నడుము కండరాలకు ఉపశమనాన్నీ, శక్తినీ ఇస్తూ, సులువుగా, సుఖమైన రీతిలో మిమ్మల్ని సన్నబరుస్తుంది. మా నడుము-బెల్టు వైపు ఒక్కసారి చూశారంటే తెలిసిపోతుంది. మీకు సరైన సాధనం ఇప్పుడు దొరికిందని, గుర్తుంచుకోండి, ఇలాస్టిక్కూ, నడుము కట్లూ పనలేని నకిలీలు. అవి లావుని కేవలం లోపలే అణిచి ఉంచుతాయి. కాని **సౌనా సిస్టమ్ 900** దాన్ని తీసేస్తుంది తొందరగా! ఈ రోజు, ఈ క్షణంలో కూడా వేలాది మంది దీన్నుంచి ప్రయోజనం పొందుతున్నారు. మరి మీరు మాత్రం ఎందుకు పొందకూడదు? వెంటనే ఆర్డరివ్వండి!

**బరువు తగ్గినవన్నబద్ధవారు**

**శ్రీ గుర్‌మీత్‌సింగ్—లూధియానా**

"నా నడుము, తుంటి మొత్తం 8 సెం మీ లావు తగ్గింది! సౌనా సిస్టమ్ అద్భుతంగా పనిచేసింది! కేవలం 6 నెల్లో! 10 పౌన్ల బరువు తగ్గాను!"

**శ్రీమతి మిల్‌డ్రెడ్ సి కేటుర్—లాండ్ ఓ లేక్స్, ఫ్లోరిడా.**

"సౌనా బెల్టుతో, వ్యాయామ కార్యక్రమంతో 32 పౌన్ల బరువు తగ్గాను! నా నడుము 8 సెం. మీ., తుంటి 11 సెం.మీ. లావు తగ్గాయి!"

ఇవి సౌనా సిస్టమ్ 900 వాడి అద్భుత ఫలితాలు సాధించినవాళ్లు అన్న మాటలు (ప్రమాణపూర్వకమైనవి, పూర్తిగా నిజమైనవి). అందరికీ ఇంత సాఫల్యం చేకూరకపోవచ్చు. కాని వీళ్లు ఇంతగా సాఫల్యం పొందారంటే, మీరు **సౌనా సిస్టమ్‌తో** 900 తొందరగా ఎన్ని పౌన్ల బరువు, ఎన్ని సెంటీమీటర్ల లావు తగ్గగలరో ఆలోచించండి మరి!

**"మీ పొట్ట కొలత మీ ఛాతీ కొలతకన్నా 15% ఎక్కువగా ఉంటే మీ జీవితకాలం 25% తగ్గిపోతుంది"**

**—అన్నారు ఒక ఇంగ్లీషు డాక్టర్**

### ఈ నష్టంలేని ఉచిత ఇంటి పరీక్ష కూపన్ పోస్టు చేయండి

బుల్‌వర్కర్ ప్రై. లి. డిపార్ట్‌మెంట్, ఎస్ ఎస్. 101—
55-101-Tel
మెహతా మహల్, 15 మాథ్యూ రోడ్, బొంబాయి-400 004

దయచేసి నాకు సౌనా సిస్టమ్‌ని 14 రోజుల ఉచిత ఇంటి పరీక్ష కోసం వెంటనే పంపండి ఫలితాలు నాకు పూర్తి సంతృప్తినివ్వకపోతే, నా పరీక్ష కాలం ముగియగానే నేను వస్తువులన్నిటినీ తిప్పి పంపి, వెంటనే డబ్బు (ప్యాకింగ్, పంపకం మొదలైన ఖర్చులు మినహాయించి) వాపసు చేయమని కోరవచ్చు. SW-43

**దయచేసి తగిన గడిలో ☑ టిక్కు పెట్టండి**

☐ రిజిస్టర్డ్ పోస్టు పార్సిల్‌లో పంపండి. నేను రూ. 196/- డ్రాఫ్టు/ఐ పి. ఓ /ఎమ్ ఓ ద్వారా పంపుతున్నాను. దాని నంబరు ........ తేదీ ........ (బుల్‌వర్కర్ ప్రై లి. వారికి చెల్లించవలసినది).

☐ వి పి.పి ద్వారా పంపండి సరుకు అందిన మీదట పోస్టుమన్‌కు నేను రూ 196/- చెల్లించగలనని మాట ఇస్తున్నాను

పేరు

చిరునామా

పిన్ కోడ్ సంతకం

# అణు రియాక్టర్లకి ఇండియా: మురికివాడలకి భారత్!

న్యూక్లీలేఖ



డా. జయదుబాషి

బొంబాయి నగరం అణుశక్తినే కాకుండా మురికి వాడలని కూడా ఉత్పత్తి చేస్తున్నది ఈ నగరం దేశంలోని అణుశక్తి వ్యవస్థకి ప్రధాన కేంద్రమే కాక మురిక వాడలకి కూడా ఆటపట్టుగా ఉన్నది చరిత్రాత్మకమైన గేట్‌వే ఆఫ్ ఇండియాకి ఆనుకునే ఉన్న అణుశక్తి సంఘం కార్యాలయంనించి అక్కడికి 25 మైళ్ల దూరంలో ఉన్న బాబా అణు పరిశోధన కేంద్రంవరకూ ఒకసారి మీరు వెళ్లివస్తే ఆ నగరంలోని పేదల బతుకు ఎలా ఉందో మీకు తెలుస్తుంది ఆధునిక ఇండియాకి ప్రాతినిధ్యం వహించే అణువులకి, భారత్‌కి ప్రాతినిధ్యం వహించే మురికివాడలకి సంఘర్షణ ఏర్పడే సమయం వస్తుందని నేనెప్పుడూ భయపడుతూ ఉంటాను ఇప్పుడారోజు దగ్గర పడినట్లు నాకు అనిపిస్తున్నది ఇది అచ్చులో కనిపించే సమయానికి బొంబాయి నగర పాలక సంఘం మురికి వాడల నిర్మూలన కార్యక్రమం చేపట్టి, మొదలుపెట్టి వేలాదిమంది గుడిసె వాసులని వీధులపాలు చేసినా చెయ్యవచ్చు

ఇప్పుడు నేను దానిని గురించి రాయటంలేదు మదరాసు సమీపంలో ఉన్న కాల్పాక్కంలో ఒక కొత్త రియాక్టరు ఈ మధ్యే ఉత్పత్తి ప్రారంభించింది మొట్టమొదట దాన్ని గురించే కొంత చెబుతాను అది ఒక ప్రత్యేక తరహాకి చెందిన ప్రయోగ సంబంధమైన రియాక్టరు దానికి సంబంధించిన సాంకేతిక విజ్ఞానాన్ని మనం ఫ్రాన్స్‌నించి దిగుమతి చేసుకున్నాం మన భారతీయ శాస్త్రవేత్తలు దానిపై చాలా పరిశోధనలు చేశారు ఎందుకంటే ఫ్రెంచి శాస్త్రవేత్తలకి ఎదురైన సమస్యలకన్నా మన సమస్యలు భిన్నమైనటువంటివి కాబట్టి ఫ్రెంచి వారికి శుద్ధి చేయబడిన యురేనియం ఉన్నది మనకి అదిలేదు కాబట్టి ఉన్న దానితోనే సరిపెట్టుకోవాల్సి ఉంటుంది అందువల్ల మనం యురేనియం ప్లూటోనియం కార్బయిడ్‌లని ఉపయోగించాము అలా ఉపయోగించడానికి ఆ రియాక్టర్‌లో మౌలికమైన కొన్ని మార్పులు అవసరం అయినాయి కాబట్టి ఒక విధంగా ఆ రియాక్టరు మన శాస్త్రవేత్తల కృషి ఫలితమనే చెప్పాల్సి ఉంటుంది అందులో పనిచేసే అందరూ కాకపోయినా చాలామంది బొంబాయిలోని మురికి వాడల సమీపంలో శిక్షణ పొందినవారే వారితో కలిసి పనిచేసిన కొంతమంది జవానులు, మెకానిక్‌లు ఇప్పటికి ఆ మురికి వాడలలోనే జీవిస్తున్నారు అయినా ఆ రియాక్టర్ కాల్పాక్కంలో చక్కగానే పని చేస్తున్నది

మనం అణువుతో అద్భుతాలని చేయగలుగుతున్నప్పుడు మరి మిగతా రంగాలలో అంటే గృహ నిర్మాణం, లేదా నగర నిర్మాణ పథకాలవంటి వాటి విషయంలో ఎందుకు విఫలం అవుతున్నామనే ప్రశ్న ఎదురవుతుంది అలా చెయ్యగలిగితే బొంబాయిలో మురికివాడలు లేకుండా చెయ్యలేకపోయినా కనీసం వాటిని అదుపులో పెట్టగలిగి ఉండేవాళ్లం విజ్ఞాన శాస్త్రాన్ని మనం అలాంటి వాటికి ఉపయోగిస్తామే కానీ సమాజంలో వాతావరణం, పరిసరాలు మెరుగు పరచడానికి వినియోగించడం లేదు భౌతిక ప్రపంచాన్ని, మానవ ప్రపంచాన్ని నిర్దేశించే న్యాయ సూత్రాలలో తేడా ఏమీ ఉండదు హిందువులు అలా భావించరు కానీ ఆ రెండు న్యాయ సూత్రాలనీ మనం ఒకటి చెయ్యలేకపోతున్నాము అందువల్లనే అణువుతో అద్భుతాలని చెయ్యగలుగుతున్న మనం మనుషులు నివసించడానికి తగని పరిస్థితులలో జీవిస్తున్నాము ఆ విధంగా మనకి ఇండియా ఒకవైపు భారత్ మరోపక్క ఉన్నాయి రెండూ మనం సృష్టించినవే రియాక్టర్లని రూపొందించి వాటిచేత పని చేయిస్తున్న భారతీయ మేధస్సు మురికి వాడలని కూడా సృష్టిస్తున్నది ఆ రెండిటినీ ఒకే త్రాటిమీదకి తెచ్చే వీలులేనట్లు మనం ప్రవర్తిస్తున్నాము

మిగిలిన దేశాలలో ఇలా జరగదు ఎన్నో సంపన్న దేశాలలో ఉన్న పేదరికమే జపాన్‌లోనూ ఉన్నది కానీ అక్కడ మురికివాడలు చాలాకొద్దిగా ఉన్నాయి టోక్యో ప్రపంచంలో అతి పెద్ద నగరం కోట్లాదిమంది అక్కడ నివసిస్తున్నారు అయినా కాలినడకన మీరు ఆ నగరంలో తిరిగి చూస్తే మీకు అలా అనిపించదు జపాన్‌లో కూడా అణు ఉత్పాదక రియాక్టర్లు ఉన్నాయి కానీ ఆ రియాక్టర్లు మురికివాడల మధ్యలేవు జపాన్‌వారు తమ సామాజిక పరిసరాలని అలక్ష్యం చెయ్యరు వాళ్లు తమ కార్లకోసం ఉపయోగించే సాంకేతిక విజ్ఞానాన్నే తమ గృహ నిర్మాణం మొదలైన సామాజిక అవసరాలకి కూడా వినియోగిస్తారు సాంకేతిక విజ్ఞానాన్ని విడివిడిగా చూడటం అన్నది సరైన పద్ధతికాదు దాని ప్రధానోద్దేశ్యం విజ్ఞాన శాస్త్రాన్ని పరిశ్రమకే పరిమితం చెయ్యకుండా మిగతా రంగాలకి కూడా



విస్తరింపచేయాలన్నది ఈ రెండు రకాలైన ఉపయోగాలని మనం కలపలేకపోతున్నాము అందువల్లనే మన శాస్త్రవేత్తలు అంతరిక్షంలోకి ఉపగ్రహాలని పంపిస్తున్నా మన ప్రాధమిక అవసరాలు మాత్రం తరటం లేదు

మనలో ఉన్న రుగ్మతలన్నిటికి ప్రభుత్వాన్ని నిందించడం సరైన పనికాదు ప్రభుత్వంలో రియాక్టర్‌లని రూపొందించి నడపేవారూ, మురికి వాడలలో నివసించేవాళ్లు ఉన్నారు వారంతా భారతీయులే నేనింతకుముందే చెప్పినట్లు మనకి ఇష్టం ఉన్నా లేకపోయినా అణు రియాక్టర్లు ఉంటాయి, అవసరం అని కాదు అవి మనకి ఉండి తీరాలి కాబట్టి కొన్ని సంవత్సరాలుగా మనం బాంబు తయారు చెయ్యకుండా ఉండగలమని మనకి మనమే చెప్పుకుంటున్నాము కాని ఇప్పుడా విషయాన్ని మరోసారి ఆలోచించాల్సిన సమయం వచ్చింది ప్రస్తుతం మనకి ఇష్టం ఉన్నా లేకపోయినా మనం బాంబుని తయారు చేసుకోక తప్పదు శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన మిగతా విషయాలూ అంతే దాని విషయంలో మనం చూపిస్తున్న ఆసక్తి, లక్ష్యసాధనకోసం చేస్తున్న కృషి సామాజిక సమస్యల పరిష్కారం విషయంలో కూడ ఎందుకు చూపలేక పోతున్నామన్నది నాకు అర్థంకాని విషయం సమాజానికి సంబంధించిన సమస్యలని, భౌతిక పరమైన వాటిని మనం విస్మరిస్తున్నాము మిగతా సమాజాలు ఈ సమస్యలని పరిష్కరించుకోగలిగాయి జపాన్‌లో నీళ్ల కరువు ఉన్న గ్రామాలు లేవు అలాగే ఇంగ్లాండులో కరెంటులేని గ్రామాలు కనిపించవు జపాన్‌వారు తమ కార్లకి ఉపయోగించే సాంకేతిక విజ్ఞానాన్నే నీటి సరఫరా కేంద్రాలకి, సమాజ వికాస పథకాలకి వినియోగిస్తారు మనం అలా కాకుండా రెండు ప్రపంచాలలో జీవిస్తుంటాము ఒకదానికి మరోదానికి ఏమాత్రం సంబంధం ఉండదు విజ్ఞాన శాస్త్రానికి సంబంధించినంతవరకూ మన ఆలోచనలు ఉన్నతంగా ఉంటాయి కాని సామాజిక పరమైన విషయాలకి వస్తే అందుకు పూర్తిగా వ్యతిరేకం అణు ఉత్పాదక రియాక్టర్‌ని మనం 60 కోట్ల రూపాయలు పెట్టి కొనగలుగుతున్నప్పుడు కొత్త బొంబాయి నగరాన్ని, లేదా ఎన్నో బొంబాయి వంటి నగరాల్ని రూపొందించుకోగలము అణువుతో మనం ఎన్నో అద్భుతాలు చెయ్యగలుగుతున్నప్పుడు మన ప్రజలతో ఎందుకు చెయ్యలేమో నాకు తెలియటం లేదు కదిలే అణువులకి మనుషులకి తేడా ఏముంటుంది? కాని ఆ రెండూ ఒకటి కాదని మనని నమ్మించడం జరుగుతున్నది అవి రెండూ వేరు వేరు న్యాయ సూత్రాలపైన నడుస్తున్నట్లు మనం అనుకునేటట్లు చెయ్యడంవల్లనే చిక్కులు ఏర్పడుతున్నాయి ఇండియా వేరు భారత్ వేరు అని మనం అనుకున్నంత కాలం మన కష్టాలు అలాగే ఉంటాయి □

# రాజ కయ్యాలు

—శంకు









సీరియల్

# నీడలు-నిజాలు

విన్నకోట సుశీలాదేవి

(గత సంచిక తరువాయి)

రవి ఒకరోజు యూనివర్శిటిలో – లైబ్రరి దిగి చకచకా క్రిందికి వస్తున్నాడు

"చూడండి! మిస్టర్! ఆఫీసు రూము ఎక్కడో చెప్పగలరా", సన్నటి గొంతు విని తలెత్తాడు రవి.

ఎదురుగా ఒక అసామాన్య అందగత్తె – మెరిసిపోతూ కన్పించింది. క్షణకాలం రవికి ఈ ప్రపంచం చీకటయినట్టు తోచింది మెల్లగా తేరుకుని–

"ఏమిటన్నారూ?" అనడిగాడు.

అతడి పరధ్యానానికి చిన్నగా నవ్వింది

ఆ నవ్వుకి పరవశించాడు రవి.

'ఆఫీసు రూము ఎక్కడ!"

"యూ మీన్. రిజిస్ట్రారాఫీసా"

"ఆ"

"రండి చూపిస్తాను.' అన్నాడు రవి. ఆ అమ్మాయి రవి వెంట నడిచింది. రవి ఆ అమ్మాయి ఆఫీసు పనయ్యే వరకూ అక్కడే నిలబడ్డాడు. ఆ అమ్మాయి పని పూర్తి చేసుకుని బయటికి వచ్చింది. ఇంకా అక్కడే తచ్చాడుతున్న రవిని చూసి–

థాంక్సండీ." అంది.

"చూడండి మిస్. "

"నాపేరు సునీత".

'లవ్‌లీ'నేమ్ అనుకున్నాడు.

"నేనింత సహాయం చేసినందుకు ఒట్టి థాంక్సేనా", అన్నాడు

సునీత అతడి మాటలకు ఆశ్చర్యంగా చూసింది. ఆ భంగిమలో మరింత అందంగా కనబడింది రవికి!

కాలేజిలో చదివేటప్పుడు ఎంతో మంది అమ్మాయిల్ని చూశాడు కానీ, ఇంత అందం ఎక్కడా చూడలేదు. నిన్నటి వరకూ శారదే అందగత్తె అనుకుంటూ వచ్చాడు. కానీ ఈ సునీత లాంటి సౌందర్యవతులు లోకంలో నే వుండరేమో? ఆమె సౌందర్యం రవి మనస్సుని సున్నితంగా కదల్చి.. అణువణువులో నూ స్పందన కలిగించసాగింది. ఈ అమ్మాయితో పరిచయాన్ని– స్నేహంగా మార్చుకోవాలి అనుకున్నాడు. అందుకే కావాలని చొరవ తీసుకుంటున్నాడు

జరిగిన కథ–1 : వెంకట్రామయ్య కూతురు శారద. తల్లి లేని శారదను తండ్రి అల్లారు ముద్దుగా పెంచుతాడు. వెంకట్రామయ్య చెల్లెలు లక్ష్మీదేవి కుమారుడు రవి. రవికి ఏక్సిడెంట్ అయ్యిందని తెలిసి చూసి రాను హైదరాబాదు వెళతానని పట్టు పట్టింది శారద. శారదను రైలెక్కిస్తాడు వెంకట్రామయ్య రైల్లో శారదకి గతం అంతా కళ్ల ముందు కదలాడింది. శారదకి, రవికి పెళ్లి చేయాలనుకుంటారు పెద్దలు. రవి దుడుకుతనం వల్ల, కాగే కాగే నూనె శారద ముఖంపై, చేతులపై చింది ఆమె శరీరం అంతా అందవికారమయిపోతుంది. అయినా రవికి శారదపై ప్రేమ తగ్గలేదు. రవి యూనివర్శిటీలో ఎమ్.కామ్.లో చేరుతాడు. అక్కడ జరిగిన ఒక సంఘటన అతని జీవితాన్ని ఒక కొత్త మలుపు తిప్పింది.

"మాట్లాడరేం?" సునీత అడిగింది!

"అంటే! మరేం లేదు! ఒక కప్పు కాఫీ ఇప్పిస్తారేమోనని", అన్నాడు కొద్దిగా జంకుతూనే!

"అంతేనా! పదండి," నవ్వేసింది

సునీత వెంటనే ఒప్పుకోవడంతో రవికి ఆనందం కలిగింది

"రండి."

ప్రక్క ప్రక్కనే నడుస్తూ క్యాంటీన్ వేపు దారి తీశారు.

"మీరు దేనిలో జాయిన్ అయ్యారు?" రవి అడిగాడు.

"ప్రీవియస్ ఎమ్. కామ్."

రవి ఎగిరి గంతేసినంత పని చేశాడు

"నేనూ ఎమ్. కామ్. ప్రీవియస్సే!" అన్నాడు.

'అలాగా"

ఇద్దరూ క్యాంటిన్‌లోకి వెళ్లి ఒక మూలగా కూర్చున్నారు రవి సునీత వేపే చూస్తున్నాడు. గులాబీరంగు చీర కట్టి అదేరంగు బ్లౌజు వేసుకుంది శరీరచ్ఛాయలో చీర కలిసి పోయింది. పగడాల కుప్ప పోసినట్టు మెరిసిపోయే బుల్లినోరు! మినాల్లే పరిహసించే నేత్రాలు! జుట్టుని వెనక్కి దువ్వి రబ్బరు బ్యాండ్ పెట్టింది. నుదుటి మీద కనబడీ కనబడనట్టుగా వున్న ఎర్రటి బొట్టు రవికి చూసిన కొద్దీ చూడాలన్పిస్తోంది సునీత.

"ఏమిటి ఆలోచిస్తున్నారు" అనడిగింది సునీత

"మీగురించే" అనేసి ఆమె కేదైనా కోపం వస్తుందేమోనని భయం కలిగింది

కానీ సునీత ఏమీ కోపగించుకోలేదు. పైగా నవ్వింది.

అది చూసి రవి – సునీతకి కూడా తనంటే ఇష్టమేమో? అనుకున్నాడు ఆ ఆలోచనతో అతడి శరీరం పులకించింది

తమది లవ్ ఎట్ ఫస్ట్ సైట్ ఏమో?

ఇంతలో సర్వర్ వచ్చి రెండు కాఫీలు తెచ్చాడు

ఇద్దరూ త్రాగారు. సునీత బిల్లు ఇవ్వబోతుంటే రవి వారించి తానే ఇచ్చాడు

'ఇది చాలా అన్యాయం." అంది సునీత.

'నెక్స్ట్ టైమ్ మీరు." 'మరోసారి మనం రావాలి సుమా' అన్నట్టు చెప్పాడు.

"సరే"

ఇద్దరూ బయటికి వచ్చారు

"క్లాసుకు వస్తారా!" రవి అడిగాడు "వూహు రేపటి నుండి వస్తాను ఇక ఇప్పుడు ఇంటికి వెళ్లిపోతాను" అంది సునీత

"అయితే పదండి, గేటు వరకూ వస్తాను" అన్నాడు

సునీత కాదనలేదు

గేటు దగ్గరకు వచ్చాక సునీత రోడ్డు మీద పోతున్న ఆటోని ఆపి ఎక్కి కూర్చుంది.

"రేపు కలుద్దాం గుడ్‌బై" అంది సునీత. రవి కూడా చెయ్యి వూపాడు.

ఆటో కనుమరుగయ్యే వరకూ చూసి, వెనుదిరిగాడు రవి!

* * * * *

ఆ మర్నాటి నుండే రవి పూర్తిగా మారిపోయాడు. సునీత పేరే అతనికి నిత్యస్మరణమైంది. సునీతతో సినిమాలు, షికార్లు. సునీతని చూడకుండా ఒక్క క్షణంకూడా వుండలేని స్థితికి వచ్చాడు రవి. సునీత కూడా రవి అందమైన రూపానికి, ఆకర్షణీయమైన మాటలకు పూర్తిగా లొబడిపోయింది.

ప్రస్తుతం రవి ఇంట్లో అయిదు నిముషాలు స్థిమితంగా వుండటం అపురూపమైంది.

రవిలో వచ్చిన ఈ మార్పుకు శారద కంగారుపడింది రవితో పూర్వంలా సరదాగా వుండటానికి ప్రయత్నించింది. కానీ రవి శారదని తప్పించుకుని తిరగసాగాడు.

"బావా! ఈ రోజు ఏం తోచడం లేదు సినిమాకు వెళదామా?" ఒకరోజు శారద అడిగింది

"సారీ! నాకు పని వుంది శారదా." అన్నాడు

శారద ముఖం చిన్నబోయింది

'బావా, కాస్సేపు నావగ్గర కూర్చుని కబుర్లు చెప్పవూ?' అనడిగింది మరోరోజు!

నాకు కుదరదు శారదా! అర్జంటుగా ఒక ఫ్రెండుని కలవాలి అన్నాడు

శారద అతి కష్టం మీద పైకి రాబోయే నిట్టూర్పుని అణచుకుంది! రవి మాటలు, చేతలు బాధ కలిగిస్తున్నా శారద తన బాధని తన మనసులోనే అణచుకుంది కాని ఎవ్వరికీ చెప్పలేదు




రవికి సునీత తప్ప ఇతర ప్రపంచం కనబడటం లేదు

ఒకరోజు లక్ష్మీదేవి రవికి భోజనం వడ్డిస్తూ అడిగింది

'రవీ! మాఘమాసం వస్తోంది కదరా! మావయ్యకి కబురు చెయ్యనా!'

"ఎందుకమ్మా!"

'అదేరా! నీ పెళ్ళికి ముహూర్తం పెట్టుకోడానికి"

'నా పెళ్ళికి ఇప్పుడేం తొందరమ్మా! చదువు పూర్తవనీ" "

'ఆ చదువుకేముందిలే! పెళ్ళయ్యాక చదువుకోవచ్చు! మావయ్య తొందరపడుతున్నాడు" అంది!

"మధ్యలో ఆయనకెందుకు తొందర?"

# నీడలు - నిజాలు

"శారదకి త్వరగా పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాడు! నాక్కూడా త్వరగా కోడల్ని తెచ్చుకోవాలని వుంది."

"అమ్మా! నేను శారదని చేసుకోను" అంటూ కంచంలో చెయ్యి కడుక్కుని వెళ్ళిపోయాడు.

ఆ మాటకి రవి కంచంలో పెరుగు వెయ్యబోతున్న లక్ష్మీదేవి -హాల్లో కూర్చున్న శారద- ఇద్దరూ వులిక్కిపడ్డారు!

శారద చటుక్కున అక్కడినుండి లేచి గదిలోకి వెళ్ళి మంచం మీద వాలిపోయింది

రవి అన్నమాటే ఆమె చెవిలో గింగురు మంటోంది. "శారదని చేసుకోను"

ఎంత మాటన్నాడు!బావలో ఏదో మార్పు వస్తోందని గ్రహించింది. కాని అది యూనివర్సిటీ వాతావరణపు ప్రభావం అనుకుంది కానీ ఆ మార్పుకు కారణం తన మీద అసహ్యమని గ్రహించుకోలేక పోయింది.

చిన్నప్పట్నించి తనంటే ప్రాణంగా వుండేవాడు. యూనివర్సిటీలో చేరకముందు కూడా ప్రేమగానే వుండేవాడు. యూనివర్సిటీలో చదువుకునే అందమైన అమ్మాయిల్ని చూడగానే- తన వికారరూపం అసహ్యాన్ని కలిగించి వుండచ్చు. సాధారణంగా యూనివర్సిటీలో చదివే యువతీ యువకులు చాలా స్వేచ్ఛగా వుంటారని పుస్తకాల్లో చదివింది. బహుశ బావకూడా అటువంటి ప్రలోభాలకు లోను కాలేదుగదా! ఆ వూహే శారద భరించలేకపోయింది.

బావే కనుక అందవిహీనంగా అయితే తనిలా అతడ్ని వదిలేదా? బావకి తన మీద ప్రేమలేదు. వున్నదల్లా ఆకర్షణ. అదే తను ప్రేమని భ్రమపడింది. అతడిని ప్రాణసమానంగా భావించింది ఇప్పుడు బావ లేకుండా ఎలా జీవించేది?

శారద మనస్సులోని ఆవేదన దుఃఖం రూపంలో పైకి వచ్చింది.

బావకి తనంటే ఇష్టం లేనప్పుడు తనిక్కడ వుండటం అనవసరం ఇక తను ఒక్కక్షణం కూడా వుండలేదు. రేపే వెళ్ళిపోవాలి.అనుకుంది.

మర్నాడు లక్ష్మీదేవితో-

"నాన్నని చూడాలని వుంది అత్తయ్యా!" అంది.

అసలే లక్ష్మీదేవి నిన్న రవి ఆ మాట అన్నదగ్గర్నించి శారద ముఖం చూడలేకుండా వుంది. శారదకి తను తీరని ద్రోహం చేసినట్లు బాధపడిపోతోంది. అందుకే శారద వూరు వెడతాననగానే అంగీకరించింది.

ఆఫీసు గుమస్తాతో శారదని వూరుకు పంపించింది.

హఠాత్తుగా వచ్చిన కూతురిని చూసి వెంకట్రామయ్య ఆశ్చర్యపోయాడు! కూతురి ముఖంలోకి పరిశీలనగా చూశాడు ముఖంలో దిగులు కనబడింది.

శారదా! అలావున్నావేమ్మా!" అనడిగాడు.

"ఏం లేదు నాన్నా!" అని వూరుకుంది.శారద మౌనాన్ని ఆయన వేరుగా అర్థం చేసుకున్నాడు

శారదకిప్పుడు పద్దెనిమిదేళ్ళు . ఆ వయసు వురకలు వేసే సెలయేరు లాంటిది ఆ వయసుకొక్క తోడూ, జోడూ అవసరం! తొందరలోనే రవితో పెళ్ళి జరిపిస్తే. మంచిది అనుకున్నాడు.

"శారదా నేను హైద్రాబాద్ వెళ్తున్నాను." అన్నాడు

ఎందుకో శారదకి అర్థమైంది శారద మనస్సులో చిన్న ఆశ తలెత్తింది తన తండ్రి అడిగితే రవి ఒప్పుకుంటాడేమో? ఆ ఆలోచనే మళ్ళీ ఆమెలో వుత్సాహాన్ని కలిగించింది. అందుకే తండ్రి వెడతానంటే మౌనంగా వుండి పోయింది

వెంకట్రామయ్య మరో నాలుగు రోజులకు హైద్రాబాద్ ప్రయాణమయ్యాడు

లక్ష్మీదేవి అన్నగారిని చూడగానే ఆయనెందుకింత హఠాత్తుగా వచ్చాడో వూహించుకుంది! కొద్దిగా భయపడింది. కానీ పైకి అదేమీ తెలియనీయకుండా- నవ్వుతూ ఆహ్వానించింది.

"రా! అన్నయ్యా! ఏమిటింత హఠాత్తుగా వచ్చావ్! వచ్చేటప్పుడు వుత్తరం ముక్క రాస్తే స్టేషన్‌కి ఎవరినైనా పంపించేదాన్నిగా!"

"ఆ! అనుకోకుండా పని తగిలిందిలే! ఇంతకీ బావ ఏడీ?" అనడిగాడు!

"బిజినెస్ పని మీద మద్రాసు వెళ్ళారు! రాత్రికి వచ్చేస్తారులే "

ఆ పూట భోజనాలయ్యాక అసలు విషయం బయట పెట్టాడు వెంకట్రామయ్య.

లక్ష్మీదేవి మనసులో బాధ పడుతున్నా పైకి నవ్వుతూ-

"నాదేముందన్నయ్యా! రవి పెద్దవాడయ్యాడు వాడినడగాలి!" అంది.

"వాడెప్పుడు వస్తాడు!"

"ఒక గంటలో రావచ్చు! నువ్వు కాస్సేపు విశ్రాంతితీసుకో" అంది

"కూతురి పెళ్ళయ్యాకే విశ్రాంతి" అన్నాడు నవ్వుతూ. లక్ష్మీదేవి మనస్సు విలవిలలాడింది. రవి చెప్పే మాట విని తన అన్నగారు తట్టుకోగలరా! అనుకుంది.

రవి రెండుగంటలకు వచ్చాడు. అతడు భోజనం చేసి మేడమీదికి వెళ్ళాక తనూ వెనకాలే వెళ్ళాడు. వెంకట్రామయ్యని చూడగానే-

"రా మావయ్యా!" అని పిలిచి కుర్చీ చూపాడు రవి.

ఆయన కుర్చీలో కూర్చుని రవి వేపు పరిశీలనగా చూశాడు రవిని చూసి దాదాపు ఆరు నెలలవుతోంది. ఈ ఆర్నెల్లలోనూ బాగా రంగు వచ్చాడు. కొద్దిగా పొడుగెదిగాడు. ఇదివరకంటే చాలా అందంగా వున్నాడు. రవిని చూస్తూ మనసులో ఆనందపడ్డాడు.

"ఏమిటి మావయ్యా విశేషాలు?" అనడిగాడు రవి. "అన్నీ బాగానే






# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి.
నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.
వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!**

వున్నాయిరా! శారద పెళ్ళి విషయంలో నీతో మాట్లాడాలని వచ్చాను!"

ఆ మాటతో రవి ముఖం నల్లబడింది. 'మళ్ళీ ఇక్కడింకో తుఫాను నెదుర్కోవాలన్న మాట! ఏం చేస్తాం తప్పదు" అ' ఒకున్నాడు.

"వచ్చే నెలలో మంచి ముహూర్తాలున్నాయి. ఏదో ఒకటి ఖాయం చేయాలనుకుంటున్నాను. నీతో కూడా ఒకమాట చెప్పిపోదామని వచ్చాను "

వెంకట్రామయ్య చెప్తున్నాడు

రవి నెమ్మదిగా మనసులో మాట బయట పెట్టాడు "మావయ్యా! నేను శారదని చేసుకోను."

వెంకట్రామయ్య పిడుగుపడ్డట్టు స్తంభించిపోయాడు. మెల్లగా తెప్పరిల్లి...

'చేసుకోవా! ఏం?" అనడిగాడు.

"నేను శారదని చేసుకోవాలని ఎప్పుడూ అనుకోలేదు!" అన్నాడు

ఆ మాటతో ఆయనకి వెర్రి కోపం వచ్చింది

"అనుకోలేదా! మేము ఎన్నో సార్లు మీ ఇద్దరికీ పెళ్ళి చేస్తామని నీ ముందరే అన్నాం! అప్పుడెప్పుడూ నువ్వీ విషయం ఎందుకు చెప్పలేదు?"

సూటిగా అడిగాడు

"అప్పుడు .. అప్పుడు. నాకు చెప్పాలని తోచలేదు. అయినా నన్ను సూటిగా అడగలేదుగా!"

"రవీ! నోరుంది గదాని ఇష్టం వచ్చినట్లు మాట్లాడకు! నువ్వు శారదని ఎందుకు కాదంటున్నావో నాకు తెలుసు అదిప్పుడు కురూపి కదూ? అందుకే వద్దంటున్నావు అవునా'

రవి మాట్లాడలేదు

"రవీ! అది ఎవరి వల్ల ఇలా అయిందో మర్చిపోయావా?"

"కానీ మావయ్యా 'నాకు అందమైన భార్య కావాలి'. మనసులో మాట స్పష్టంగా చెప్పాడు.

'రవి చెంప చెళ్ళుమంది'! వెంకట్రామయ్య కోపంగా పళ్ళు కొరికాడు.

"అందం ! అందం కాదురా కావలసింది మనస్సు! నీ అందం శాశ్వతంగా వుంటుందను కుంటున్నావేమో! రేపు ఏదో రోగమొచ్చి నువ్వు కురూపివయితే– అప్పుడు తెలిసొస్తుందిరా! ఏది ముఖ్యమో! చిన్నప్పట్నించి శారదకు ఎన్నో ఆశలు కల్పించావు. నువ్వే దాన్ని పొయ్యిలోకి నెట్టి దాని రూపాన్ని నాశనం చేశావు. ఈ నాడు దాని జీవితాన్నే పొయ్యిలోకి నెట్టి కాల్చి బూడిద చేస్తున్నావ్! ఈ నేరానికి శిక్ష తప్పకుండా అనుభవిస్తావురా! నా చిన్నారి శారద ఈ మాట వింటే ఎంత కుమిలిపోతుందో?. ..."

దుఃఖ పడుతూ క్రిందకు వెళ్ళిపోయాడాయన!

లక్ష్మీదేవి బ్రతిమాలుతున్నా వినకుండా సంచిపుచ్చుకుని అప్పటికప్పుడు బయలుదేరి తన వూరు వచ్చేశాడు!

తండ్రి ముఖం చూడగానే అక్కడ ఏం జరిగిందో గ్రహించుకుంది శారద! ఆయనని ఇంకేమీ ప్రశ్నించలేదు.

తన దురదృష్టానికి తనలో తనే కుమిలిపోసాగింది శారద! తను ఏడిస్తే తండ్రి మరింత బాధపడతాడని – ఆ దుఃఖాన్ని మనసులోనే దాచుకుని పైకి వుత్సాహంగా తిరిగేది.

వెంకట్రామయ్య శారదకి గొప్ప సంబంధం తెచ్చి రవి కళ్ళముందే ఆమెకు అత్యంత వైభవంగా పెళ్ళి జరిపించాలని ఆరాటపడుతున్నాడు. మంచి సంబంధం కోసం ఆంధ్రదేశమంతా గాలిస్తున్నాడు.

శారద కూడా ఇప్పుడిప్పుడే పాత గాయాల్ని మరుపనే మందు వేసుకుని మాన్పుకుంటోంది.

ఇటువంటి తరుణంలో ఈ ఏక్సిడెంట్ వార్త

మానవ జీవితంలో అనేక సంఘటనలు జరుగుతుంటాయి! మనిషి మనస్సు పై ఏ సంఘటన ఎంత ప్రభావాన్ని కలిగిస్తుందో? ఏ సంఘటన అతని జీవితాన్ని ఎలా మారుస్తుందో? ...! కాలమే నిర్ణయించాలి కానీ– మనిషి వూహించలేడు!

* * * * *

రైలు హైద్రాబాద్ చేరే సరికి తెల్లవారింది!

శారద రైలు దిగి సూట్‌కేస్ పుచ్చుకుని బయటకు వచ్చింది ఆటో మాట్లాడుకుని ఎక్కింది

ఆటో ఎక్కాక అన్పించింది- బావ తనని చూసి అసహ్యించుకుంటూ, మళ్ళా ఎందుకొచ్చావని తన ముఖం మీదే అడిగితే . ఏం చెయ్యాలి తను? ఆ అవమానాన్ని భరించగలదా తను ప్ప్! అనవసరంగా వచ్చానేమో అనుకుంది పోనీ తిరిగి వెళ్ళిపోతే. .. తీరా ఇంతదూరం వచ్చాక తిరిగివెళ్ళడ మేమిటి? కనీసం అత్తయ్యనైనా చూసి ఆమెకు ధైర్యం చెప్పి వెడతాను

తనంటే ప్రాణం పెట్టే అత్తయ్య పుట్టెడు దుఃఖంలో వుంటే, తను చూడకుండా వుండగలదా!

బావ ఏమన్నా అనుకోనీ. ..

తనకేం ఫర్వాలేదు.

"యేమ్మ్ సాబ్! ఎక్కడ ఆపాలి!" ఆటో వాడు అడిగాడు శారద తన ఆలోచన్లనుండి బయటపడి ఆటో నుండి బయటకు చూసింది

"అదుగో ఆ పచ్చమేడ దగ్గర ఆపు!" అంది.

ఆటో ఆపాడు.

శారద మీటర్ డబ్బులిచ్చేసి దిగింది గేటు తీసుకుని లోపలకు వెళ్ళింది

ఇంట్లో ఎక్కడా అలికిడి వున్నట్లు కనబడలేదు ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

శారద హాల్లోకి వచ్చి సూట్‌కేస్ క్రింద పెట్టింది.

"అత్తయ్యా!" అంటూ పిలుస్తూ ఇల్లంతా తిరిగింది లక్ష్మీదేవి ఎక్కడా కనబడలేదు.

చివరకు వంటిల్లు దాటి పూజగదిలోకి వచ్చింది లక్ష్మీదేవి దేవుడి ముందు దీపం వెలిగిస్తోంది!

"అత్తయ్యా! శారద మెల్లగా పిలిచింది. లక్ష్మీదేవి వెనుదిరిగి చూసింది. శారద కనబడింది.

ఆవిడకి ప్రాణం లేచొచ్చినట్లయింది.

"శారదా! వచ్చావా?' అంటూ దగ్గరికొచ్చి శారద చెయ్యి పట్టుకుంది.

"శారదా! నువ్వు వస్తావో! రావో ననుకున్నానే. నువ్వు వస్తే బాగుణ్ణనని వెయ్యిదేవుళ్ళకి మొక్కుకుంటున్నా. ఆ దేవుడి దయవల్ల వచ్చావ్. నిన్ను చూడగానే సగం బరువు దింపినట్లుంది నాన్న రాలేదా?"

లక్ష్మీదేవి గబగబా మాట్లాడేయ సాగింది.

"నాన్న రాలేదత్తయ్యా! కోతల సమయం కదా!"

"ముఖం కడుక్కున్నావా?'

# బురదనిండిన రోడ్డు

చదువుకుని, చచ్చిచెడి, చక్కని డిగ్రీ తెచ్చుకుని
ఏం చేసుకోవాలో ఎరక్క ఏళ్ళూ పూళ్ళూ వేచి
ఉద్యోగం కోసం ఊరూరా ఊరికే తిరిగి
చివరికి చేదు మింగినట్లు – చేవ దరిగినట్లు –
మొహం మొత్తుకుని, మొండిగా కూర్చున్న వాడి నడుగు!
బురద నిండిన రోడ్డుమీద నడిచే వాడి అడుగు!

– డాక్టర్ మిరియాల రామకృష్ణ

ఆ!

'సీతమ్మగారూ! శారదకి కాఫీ – టిఫిను తీసుకు రండి శారదా! రా! మనం హాల్లో కూర్చుందాం "

ఇద్దరూ హాల్లో కూర్చున్నారు

'శారదా వచ్చేముందు టెలిగ్రాం ఇవ్వక పోయావా! స్టేషన్‌కి ఎవరి నయినా పంపించేదాన్ని.'

'నిన్ననే వుత్తరం వచ్చిందత్తయ్యా. వెంటనే బయలుదేరి వచ్చేశాను అత్తయ్యా! నువ్వు చాలా చిక్కిపోయావు!' అంది శారద

"నాకేం రోగం తల్లీ నాది మొండి ప్రాణం ఇప్పుడిప్పుడే పోదులే!"

'ఇంతకీ బావకి ఏక్సిడెంట్ ఎలా జరిగింది అత్తయా?"

లక్ష్మీదేవి చిన్నగా నిట్టూర్చింది

"మీ బావ సంగతి నీకు తెలియనిదేముందే! ఆ పాడు స్కూటరొకటి కొన్నాడు స్కూటరెక్కితే ఇక వాడికి ఏదీ కనబడదు రాత్రిపూట సినిమా నుండి వస్తూ స్కూటర్‌ని లారికేసి కొట్టాడు ఆ విసురుకు వెళ్లి రోడ్డు ప్రక్క నున్న రాళ్లగుట్ట మీద పడ్డాడు ఒళ్లంతా దెబ్బలు తగిలాయి దానికితోడు లారి హెడ్‌లైట్లు పగిలి ఆ గాజు పెంకులు కళ్లలో గుచ్చుకున్నాయిట తల మీద ఒంటి మీద గాయాలు

శారద వంటావిడ చేత మరో ప్లేటు తెప్పించింది ఇద్దరూ టిఫిను తీసుకున్నారు ఇంతలో వంటావిడ ఒక ప్లాస్టిక్ బుట్ట తీసుకొచ్చింది!

'ఇవిగోండి! మీరు చెప్పిన విధంగా సర్దాను!"

"మావయ్య లేరా అత్తయ్యా!"

వుహూ! హాస్పిటల్లో వుంటున్నారు! రవి దగ్గర ఎవరో ఒకరు వుండాలిగా

"మనం కూడా హాస్పిటల్‌కి వెడదామా!"

"నువ్వు ఇప్పుడేగా వచ్చావు రెస్టు తీసుకో నేను వెళ్లి మీ మావయ్యకి కాఫీ ఇచ్చి వస్తాను!' అంది లక్ష్మీదేవి!

"విశ్రాంతి తర్వాత ! ముందు బావని చూడాలి", అంది శారద లేస్తూ

"అయితే పద "

ఇద్దరూ బయటికి వచ్చారు

★ ★ ★ ★ ★

పది గంటలకు రవి కళ్లకు కట్టిన కట్లు వూడదీశాడు డాక్టరు లక్ష్మీదేవి – శారద– రాఘవయ్య రవి వేపే కంగారుగా చూస్తున్నారు

డాక్టరు రవి రెండు కళ్లను లోషన్‌తో తడిసిన దూదితో తుడిచి–

'నెమ్మదిగా కళ్లు తెరవండి" అన్నాడు







నయమవుతాయంటున్నారు కాని కళ్లకు కట్టిన కట్లు మాత్రం ఇవ్వాళ వూడదీస్తారుట కట్లు విప్పదీస్తే గాని కళ్లు వస్తాయో? లేదో? చెప్పలేమన్నారు ఏమవుతుందో నమ్మా!"

లక్ష్మీదేవి కళ్లనుండి నీళ్లు జారి ఒళ్లో పడ్డాయి

లక్ష్మీదేవి కన్నీళ్లు చూడగానే శారదకి కూడా కళ్లల్లో నీళ్లు తిరిగాయి

"బాధపడకత్తయ్యా! బావకి తప్పకుండా కళ్లు వస్తాయి.'

"శారదా! నీకు చేసిన అన్యాయానికి భగవంతుడు మాకు తగిన శిక్ష వేశాడమ్మా!"

"ఛ! అలా అనకత్తయ్యా నాకేం అన్యాయం జరగలేదు బావ సుఖపడటమే నాకు కావలసింది.

లక్ష్మీదేవి శారదని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంది

'శారదా! నీలాంటి దేవతని కోడలుగా చేసుకునే అదృష్టం నాకు లేదు "

"టిఫిను తీసుకోండి" వంటావిడ మాటవిని ఇద్దరూ తల త్రిప్పి చూశారు

లక్ష్మీదేవి వంటావిడ చేతుల్లోంచి టిఫిను ప్లేటు అందుకుని శారదకిచ్చింది

"నువ్వు కూడా తీసుకో అత్తయ్యా" అంది

"నాకు తినాలని లేదు!"

"అలా అన్నావంటే నేనూరుకోను నువ్వు కూడా తినాలిసిందే '

రవి కళ్లు తెరిచాడు.

డాక్టర్! నాకేం కన్పించడం లేదండి" దాదాపుగా అరచినట్లు అన్నాడు

ఆ మాటకి అక్కడున్న వాళ్లతో పాటు డాక్టరు కూడా వులిక్కి పడ్డాడు

"ఒకసారి కళ్లు మూసుకోండి"

రవి కళ్లు మూసాడు మళ్లీ ఒకసారి కళ్లను తుడిచి–

"ఈ సారి నెమ్మదిగా తెరవండి' అన్నాడు డాక్టరు

రవి తెరిచాడు

'లేదు డాక్టర్! నాకేం కన్పించడంలేదు! అమ్మా! అమ్మా నాకేం కనిపించడంలేదమ్మా ' రవి బాధగా అరిచాడు.

అక్కడున్న వాళ్ళందరి మనస్సులు విలవిలలాడిపోయాయి లక్ష్మీదేవి దుఃఖం ఆపుకోలేక పోయింది.

'రవీ!" అంటూ దగ్గరికొచ్చి రవిని పట్టుకుంది. డాక్టర్ చిన్నగా నిట్టూరుస్తూ చేతిలోని దూది పక్కనే పడేశాడు.

"మీరు ఒక్కసారి నా రూముకు రండి!' అన్నాడు రాఘవయ్యతో

రవి నీరసంగా కళ్ళు మూసుకుని పడుకున్నాడు!

# నీడలు – నిజాలు

రాఘువయ్యతో పాటు లక్ష్మిదేవి, శారద కూడా డాక్టరు వెనకాల ఆయన గదిలోకి వచ్చారు

కూర్చోండి

డాక్టరుగారూ రవికింక కళ్ళు రావంటారా?" లక్ష్మిదేవి ఆరాటంగా అడిగింది

ఆపరేషన్ చెయ్యాలమ్మా!

చేస్తే, కళ్ళు వస్తాయంటారా?'

రావచ్చు! వచ్చే అవకాశం వుంది!

అయితే ఇప్పుడే చేసెయ్యండి!" లక్ష్మిదేవి అంది

డాక్టరు నవ్వాడు

'చెయ్యొచ్చు! కానీ మీ అబ్బాయి చాలా నీరసంగా వున్నాడు యాక్సిడెంట్‌లో రక్తం చాలా పోయింది అదిగాక శరీరంలోని గాయాలేమీ మానలేదు ఇంకా అతడా షాక్ నుండి తేరుకోలేదు ఇప్పుడతనికి పూర్తిగా విశ్రాంతి అవసరం అతడు ఆపరేషన్‌కి తట్టుకోలేడు కొన్ని రోజులు గడిచాక చేస్తాను' అన్నాడాయన ఆయన మాటలకు అందరికీ కొద్దిగా నిరుత్సాహం కలిగింది ఆ క్షణాన రవికి ఆపరేషన్ చేసి చూపు తెప్పించాలనేంత ఆరాటంలో వున్నారు రవికి కళ్ళు పోయాయి అతడిప్పుడు గ్రుడ్డివాడు అనే ఆలోచనే వారెవ్వరూ భరించలేకుండా వున్నారు!

అయితే ఎప్పుడు చేస్తానంటారు? రాఘువయ్య అడిగాడు

'అది మీ చేతుల్లో వుంది' అన్నాడు డాక్టరు

'అంటే

నేను చెప్పిన ప్రకారం అతడికి మందులిచ్చి, అతడిని ఆరోగ్యవంతుడిని చేస్తే వచ్చే నెలలోనే ఆపరేషన్ చేస్తాను '

ఓస్! ఇంతేనా! అదంతా నాకు వదిలెయ్యండి డాక్టరుగారూ లక్ష్మిదేవి తేలిగ్గా అనేసింది

డాక్టరు నవ్వాడు

కానీ అదంత తేలిగ్గాదమ్మా! కళ్ళు పోయాయని చాలా దిగులుగా వున్నాడు అతనికి ముందు మానసిక వుల్లాసాన్ని కలిగించాలి అతడు దిగులులేకుండా సంతోషంగా వుండేటట్లు చెయ్యాలి అప్పుడే మందులు పట్టిస్తాయి '

అలాగేనండి! నేను ప్రయత్నిస్తాగా!" లక్ష్మిదేవి హామీ ఇచ్చింది

'అయితే సరే " డాక్టరు మందులు రాసి చీటీ లక్ష్మిదేవికిచ్చి - ఏ మందు ఎలా వేయాలో చెప్పాడు

'డాక్టరుగారూ! మా బాబుకి తప్పకుండా కళ్ళు వచ్చేలా చెయ్యాలి మీరు ఎంత డబ్బు ఖర్చయినా ఫరవాలేదండి" రాఘువయ్య అన్నాడు.

'ష్యూర్! తప్పకుండా ప్రయత్నిస్తాను! వస్తాయనే నా నమ్మకం కూడా '

"ఇక మేం వెళ్ళొస్తామండీ "

"మంచిది! కానీ ఒక్క విషయం - మీరు అతడి ముందు బాధపడకండి అతడికి కళ్ళు వస్తాయనే నమ్మకాన్ని ముందు మీరు కలిగించుకుని ఆ తర్వాత అతడికి కలిగించండి "

"అలాగేనండి"

డాక్టరు దగ్గర శెలవు తీసుకుని ముగ్గురూ బయటికి వచ్చారు

(ఇంకా ఉంది)

## తాజాదనం రోజంతా నిలిచేలా ఉంచండి.

కొత్తది




అసలైన తాజాదనం! అదే రోజంతా నిలిచి వుండే తాజాదనం!
మీకు సాధారణ సబ్బులు ఇచ్చేలాంటి కొద్ది సేపట్లో
మాయమైపోయే తాజాదనం కాదు శరీర దుర్గంధం పోగొట్టి
మిమ్మల్ని రోజంతా హాయిగా వుంచగల తాజాదనం—
అదే కొత్త సింథాల్ మాత్రమే ఇవ్వగల వాగ్దానం.

**సింథాల్‌లో ఇప్పుడు మనమోహక కొత్త పరిమళం కలదు. దుర్గంధాన్ని పోగొట్టడానికి సింథాల్‌లో గల ప్రభావవంతమైన శక్తి చర్మ క్రిములను నాశనం చేసి, మిమ్ములను రోజంతా తాజాగా దుర్గంధ రహితంగా వుంచుతుంది.**




CHAITRA-B-G-330 TEL

## కేవలం సింథాల్

మాత్రమే మిమ్మల్ని దినమంతా తాజాగా దుర్గంధరహితంగా ఉంచగలదు.

Godrej ఉత్పాదన

# మనుష్యుల్ని పీడించే జంతు పరాన్న జీవులు

మనుష్యులని వ్యాధిగ్రస్థులుగా చేయడంలో బ్యాక్టీరియాలు, వైరస్‌లే కాక జంతుపరాన్నజీవులు కూడా దోహదపడుతున్నాయి. ఈ పరాన్నజీవులు కలిగిస్తున్న వ్యాధులు ఎంతో ప్రమాదకరమైనవి. జంతుజాలంలో దాదాపు ప్రతి వర్గంలోనూ మనిషిని వేధించే పరాన్నజీవులు ఉన్నాయి. శరీరావయవాల లోపల వ్రణంచేసి ప్రాణాపాయ పరిస్థితిని కలిగించే అంతర పరాన్నజీవులు కొన్నైతే, బాహ్య పరాన్న-జీవులుగా ఉండి మనిషినించి మనిషికి వ్యాధి క్రిములని, బ్యాక్టీరియాలని, వైరస్‌లని చేరవేసేవి మరికొన్ని!

కొన్ని వందల పరాన్నజీవులు మనుష్యులలో ఏదో ఒక విధమైన జబ్బుని కలుగజేస్తూనే ఉంటాయి అన్నింటినీ చర్చించడం సాధ్యంకాదు వాంతులు, విరేచనాల నించి అతి నిద్ర వ్యాధి షరకు, చలిజ్వరం మొదలుకొని నత్తజ్వరం వరకు, నారపుండు నించి ఏనుగుకాలు వరకు పలువిధాలైన వ్యాధులు పరాన్నజీవుల వల్ల సంప్రాప్తిస్తాయి బ్యాక్టీరియాలు, వైరస్‌లు కలిగించే వ్యాధులకి నల్లులు, దోమలు, పేనులు వంటి బాహ్య పరాన్నజీవులు బాధ్యత వహిస్తాయి!

ప్రోటోజోవా వర్గానికి చెందిన పరాన్నజీవులు ఎక్కువగా ఉన్నాయి. ఇవి కలిగించే వ్యాధులు కూడా ప్రాణాంతకమైనవే! "ఎంటమీబా హిస్టోలైటికా" అనే అమీబా జాతి పరాన్నజీవి మానవ అంత్రనాళాలలో నివసిస్తుంది. కలుషితమైన నీరు త్రాగడం వల్ల ఈ పరాన్నజీవులు మనిషి దేహాన్ని చేరుకొంటాయి. ఈ పరాన్న జీవుల వల్ల బంక విరేచనాలు కలుగుతాయి చీము, నెత్తురు విపరీతమై కడుపులో మంటపుడుతుంది. వ్యాధి నిర్ధారణ అయ్యాక తగిన చికిత్సని వెంటనే తీసుకోవాలి. అలాగే "ఎంటమీబా జింజివాలిస్" అనే పరాన్న జీవి వల్ల నోటిలో దుర్వాసన మొదలై చిగుర్లు వాచి చీము, నెత్తురు కారుతూ ఉంటుంది. ఈ పరాన్న జీవులు ఒకరినొకరు ముద్దు పెట్టుకొన్నప్పుడు అంటుకొంటాయి. అందుకే ఈ వ్యాధి వచ్చిన వారిని దూరంగా ఉంచి, నివారణ కోసం తగిన వైద్య సహాయాన్ని అందించాలి.

విశ్వ వ్యాప్తంగా నేటికి సవాలుగా నిలిచిన మలేరియా లేదా చలి జ్వరం అనేది ప్రోటోజోవా వర్గానికి చెందిన స్పోరోజోవా తరగతిలోని "ప్లాస్మోడియమ్" అనే పరాన్న జీవి వల్ల కలుగుతోంది. ఈ పరాన్న జీవులు ఆడ "అనాఫిలిస్" దోమల ద్వారా మనుష్యులకి అంటుకొంటాయి. చలి జ్వరం వచ్చినప్పుడు రక్త కణాలు క్షీణించి రోగి నీరసపడిపోతాడు సకాలంలో చికిత్స గనుక అందకపోతే ప్రాణాలు పోయే ప్రమాదం కూడా ఉంది! అందుకే మలేరియా నిర్మూలనా కార్య-క్రమానికి నేడు అత్యధిక ప్రాముఖ్యాన్ని ఇవ్వడం జరుగుతోంది.

"ట్రిపనోసోమా గాంబియెన్స్" అనే స్పోరోజవాయిడ్ వల్ల అతి దీర్ఘ నిద్ర వస్తుంది. దీనిని సాంకేతికంగా "ట్రిపనోసోమియాసిస్" అని పిలుస్తారు ఇది ఒక జాతికి చెందిన ఈగవల్ల (ట్సెట్సె ఈగ!) సంక్రమిస్తుంది సముద్రయానం చేసేవారిలో ఈ వ్యాధి తరుచూ వస్తూ ఉంటుంది. మనదేశంలో ఈ వ్యాధి శాతం తక్కువే! ఈజిప్ట్, ఇరాన్, ఇరాక్, సూడాన్, దక్షిణ ఆఫ్రికా ప్రాంతాలలో ఈ వ్యాధి గణనీయంగా ఉంది "లీష్మానియా డొనొవని" అనే మరో పరాన్నజీవి సాండ్ ఈగ ద్వారా మనిషికి సంక్రమిస్తుంది. ఈ పరాన్నజీవివల్ల కాలా అజార్ అనే వ్యాధి వస్తుంది శరీర ఉష్ణోగ్రత విపరీతంగా పెరగడం, వాంతులు అవడం, అపస్మారక స్థితి కమ్ముకోవడం ఈ వ్యాధి లక్షణాలుగా చెబుతారు. సాండ్ ఈగ ద్వారానే సంక్రమించే "లీష్మానియా ట్రాపికా" అనే పరాన్నజీవి వల్ల శరీర అవయవాలపై పచ్చిపుండ్లు ఏర్పడుతాయి. జీర్ణ వ్యవస్థలోపల ఒకటే మంట పుడుతుంది. ఈ వ్యాధి ఉష్ణమండల ప్రాంతాలలో బాగా వ్యాప్తి చెంది ఉంది

ఆస్క్ హెల్మింథిస్ వర్గానికి చెందిన "అస్కారిస్ లుంబ్రికయోడిస్" అనే పరాన్నజీవి వల్ల "అస్కారియాసిస్" అనే వ్యాధి వస్తుంది ఏలిక పాములు వల్ల మలబద్ధకము- ఆకలి తగ్గిపోవడం, కడుపు నొప్పి, విరేచనాలు, వాంతులు రావడం ఎంతోమంది చూచే ఉంటారు ఈ ఏలిక పాముల్లో పదివేల తెగలు ఉన్నాయి. స్త్రీపురుష జంతువులు విడివిడిగా ఉంటాయి 14 అంగుళాల నించి 40 అంగుళాల పొడవు వరకూ ఇవి ఎదుగుతాయి కలుషితమైన నీరు, కల్తీ తినుబండారాలు మొదలైనవి తినడం వల్ల ఈ ఏలిక పాములు కడుపులో చేరుకొని చిన్న ప్రేవులలో స్థిరనివాసం ఏర్పరచుకొంటాయి

ఉకరేరియా బాంక్రాఫ్టై" లేదా "ఫైలేరియా బాంక్రాఫ్టై" అనే నెమటోడ్ పరాన్న జీవి వల్ల "ఫైలేరియాసిస్" లేదా "ఎలిఫెంటాసిస్" వస్తుంది దీన్నే మనం వాడుక భాషలో బోదకాలు లేదా ఏనుగుకాలు అనిపిలుస్తూ ఉంటాము ఈ పరాన్న జీవి "క్యూలెక్స్" అని పిలువబడే దోమ ద్వారా మానవునికి సంక్రమిస్తుంది. లింఫ్ గ్రంధులలో కాని లింఫ్ నాళాలలో కాని ఈ పరాన్న జీవి చేరుకొంటుంది. రొమ్ములు, వరి బీజాలు, కాలు క్రింది భాగం మొదలైనవి ఈ వ్యాధి ఫలితంగా విపరీతంగా ఉబ్బి

## మనుషులలో వ్యాధులని కలిగించే కొన్ని పరాన్నజీవులు!



ఎంటమీబా



ప్లాస్మోడియమ్ స్పోరోసైట్స్

ట్రిపనోసోమా



సిస్టోజోమా స్త్రీ, పురుష జీవులు



అస్కారిస్ స్త్రీ, పురుష జీవులు



ఫైలేరియా

పోతాయి. రక్త క్షీణత, నీరసం, తరచూ ఆకలి మందగించడం, జ్వరం రావడం, కళ్ళు తిరగడం, వాంతులు చేసుకోవడం ఈ వ్యాధి లక్షణాలుగా చెప్పుకోవచ్చును ఈ వ్యాధి ముదిరిపోతే నయం కావడం కష్టమనే నేడు ఎక్కువ మంది భావిస్తున్నారు!

'నెమటోడా' తరగతికి చెందిన 'డ్రాకంకులస్ మెడినెన్సిస్" అనే పరాన్నజీవి వల్ల నారపుండు ఏర్పడుతుంది అందువల్లే దీనిని నారపురుగు అని పిలుస్తారు. గినీ పురుగు అనికూడా దీనిని పిలవడం కద్దు ఆసియా, ఆఫ్రికా, వెస్ట్ ఇండీస్, దక్షిణ అమెరికా ప్రాంతాలలో ఈ వ్యాధి బాగా ప్రబలి వుంది స్త్రీ పురుష జంతువులు వేరు వేరుగా ఉంటాయి పురుష జంతువులు 12 నించి 29 మిల్లీ మీటర్ల పొడవు ఉంటే, స్త్రీ జంతువులు 50 నించి 120 సెంటి మీటర్ల పొడవు ఉంటాయి! విభిన్న అంగాలకి చెందిన బంధన కణజాలాలలో ఈ పరాన్నజీవులు పబ్బం గడుపుకొంటాయి స్త్రీజీవి మణికాలుకి కొంచెం పై భాగంలో స్థిరనివాస మేర్పరుచుకొంటుంది ఆ భాగంలో దేహంపైన చిన్న బుడిపె ఏర్పడి అది పగులుతుంది అందులోనించి లక్షల సంఖ్యలో లార్వాలు విడుదల అవుతాయి! ఇవి నీటి లోపలికి పోయినప్పుడు "సైక్లాప్స్" అనబడే క్రస్టేషియన్‌లు (ఇవి కంటికి తేలికగా ఆనవు. సూక్ష్మ పరిమాణంలో ఉంటాయి!) వాటిని మ్రింగివేస్తాయి 'డ్రాకంకులస్' లార్వాలు సైక్లాప్స్‌ల దేహంలోపల ఎదిగి రూపాంతరం చెందుతాయి సైక్లాప్స్‌లు ఉన్న నీటిని మనిషి త్రాగినప్పుడు ఈ లార్వాలు మనిషి దేహంలోపలికి ప్రవేశించి స్త్రీ, పురుష జంతువులుగా ఎదిగి జీవిత చక్రాన్ని మళ్లీ కొనసాగిస్తాయి! నారపుండు నయం కావడం చాల కష్టం! ముందు జాగ్రత్తలు తీసుకొని ఫిల్టర్ చేసి క్లోరిన్ ప్రక్రియకి గురి చేసిన నీటిని స్వీకరించడం ఉత్తమం ఎక్కడబడితే అక్కడ కనిపించే గుంటలలో దిగడం, స్నానం చేయడం, నీళ్లు త్రాగడం వంటి పనులని తగ్గించుకోవాలి లేకపోతే మనకే నష్టం!

"సెస్టోడా" తరగతికి చెందిన బద్దె పురుగు మనిషికి ఎంతో అపకారం చేసే పరాన్న జీవి దీన్ని శాస్త్రీయ పరి భాషలో "టీనియా సోలియమ్" అంటారు ఈ ప్రజాతిలో 1500 ఉప జాతులు ఉండటం ఆసక్తిని కలిగిస్తుంది. అరడుగుల నించి 40 అడుగుల వరకు ఈ పరాన్న జీవి ఉంటుందని వింటుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఈ బద్దె పురగు చిన్న ప్రేవునంతా ఆక్రమించుకొని ఆహారం సరిగ్గా జీర్ణం కాకుండా అడ్డు పడుతుంది. అధిశోషణ ప్రక్రియ పూర్తిగా దెబ్బ తింటుంది పైగా చిన్న ప్రేవు గోడలపై ఈ బద్దె పురుగు వ్రణాలని కలిగిస్తుంది. కడుపులో విపరీతమైన నెప్పి వేస్తుంది. ఈ బాధ భరించలేక మనిషి మరణించిన సందర్భాలు కూడా లెక్కకు మిక్కుటంగా ఉన్నాయి. ఉడికీ ఉడకని పంది మాంసం తినడం వల్ల ఈ బద్దె పురుగు మనిషిని చేరుకొంటుందని తెలుస్తోంది బద్దెపురుగు వల్ల కలిగే వ్యాధిని "టీనియాసిస్" అని పిలుస్తారు!

"ట్రిమటోడా తరగతికి చెందిన హెల్మింథ్ పరాన్నజీవి "సిస్టోజోమా"! ఈ పరాన్నజీవి వల్ల వచ్చే వ్యాధిని నత్తజ్వరం అని పిలుస్తారు ఈ జీవులు నత్తల ద్వారా మానవదేహాలలో చేరుకొని కాలేయము, చిన్నప్రేవులు, ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, మూత్రకోశాలు మొదలైన అంగాలని అంటిపెట్టుకొని వాటిని క్షీణింపజేస్తాయి. ఫలితంగా తలతిరగడం, కైర్లు కమ్మడం, వాంతులు రావడం, విపరీతంగా జ్వరం ముంచుకొని రావడం సంభవిస్తాయి. రక్త వాంతులు కూడా సర్వసాధారణమైన విషయమే! ఈ నత్తజ్వరం వల్ల ఏటా 20 కోట్లమంది ఆహుతి అవుతున్నారు. ఈ వ్యాధి జపాన్, బ్రెజిల్, సూడాన్, జింబాబ్వే, తూర్పు ఆసియా, చీనా, పెన్‌సిల్‌వేనియా, పియర్టోరికో ప్రాంతాలలో బాగా విస్తృతంగా ఉంది. ఈ వ్యాధినే "సిస్టోజోమియాసిస్" అనీ, "బిల్హార్జియాసిస్" అనీ పిలుస్తూ ఉంటారు నీటి గుంటలలో దిగినప్పుడు నత్తల నుండి విడుదలైన ఈ పరాన్నజీవి లార్వాలు మనిషి శరీరాన్ని అంటుకొని లోపలికి ప్రవేశిస్తాయి. ఈ నత్తజ్వరం వల్ల లివర్ పూర్తిగా దెబ్బతింటుంది. కాబట్టి బ్రతికే అవకాశం చాల తక్కువ! ఇటీవలే ఈ వ్యాధి భారతదేశంలో కూడా ప్రవేశించినట్లు చెబుతున్నారు. అయితే స్పష్టమైన సాక్ష్యాధారాలు లేవు. అయినప్పటికీ ముందు జాగ్రత్తలో ఈ వ్యాధిని అరికట్టగలిగే స్థాయిలో ఉండేలా భారత్ సమాయిత్తం కావాలి!

మనిషిలో ప్రవేశించి వ్యాధిని కలిగించే పరాన్న జీవులు ఇంకా ఎన్నో ఉన్నాయి లోవా - లోవా అనే పరాన్నజీవి ("క్రైసాప్స్" వల్ల సంక్రమిస్తుంది!) బాహ్య చర్మపు లోపలి స్తరాలలో ఉండి వాపును కలిగిస్తుంది. ఈ వాపు ఏ భాగంలోనైనా రావచ్చును. ఎక్కువగా గొంతు వద్ద వస్తూ ఉంటుంది. ట్రైకోమోనాస్, జియార్డియా, బాలన్‌టిడియమ్, ట్రైకినెల్లా వగైరా జంతువుల వల్ల కూడా జ్వరము, వాంతులు, విరేచనాలు, కడుపు నెప్పి వంటి వ్యాధులు వస్తాయి బాహ్యపరాన్న జీవులయిన- నల్లులు, పేనులు, జలగలు- ఇలాంటి వాటి బారినించి తప్పించుకోగలిగితే అంతర పరాన్న జీవుల బెడద సగానికి పైగా తగ్గినట్లే! ముఖ్యంగా మనిషి దోమల నించి ఈగలనించి తనని తాను రక్షించుకోగలిగినట్లయితే అంతర పరాన్న జీవులనించి తొంభై శాతంకి పైగా బయట పడినట్లే!

ప్రమాణాల మేరకు పారిశుధ్యాన్ని గనుక పాటించగలిగితే- రోగ నిరోధకాలైన వ్యాక్సిన్‌లు, అంటీ బయాటిక్స్, ఇనాకులేషన్‌లు మొదలైనవి వాడుతూ ఉన్నట్లయితే- మనిషి ఆరోగ్యం క్రమబద్ధమై ఆయుర్దాయం పెరిగే అవకాశం ఎంతైనా ఉంది.

—డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

## బాంబినో ఆమ్లెట్

1 ప్యాకెట్ బాంబినో
6 కప్పుల నీళ్ళు
6 గుడ్లు బాగా ద్రవంగా తెల్ల, పసుపు సొనలు కలిసేటట్లు కలపాలి.
3 మధ్యరకం సైజు ఉల్లిపాయలు తరిగి ఉంచాలి.
6–7 తరిగిన పచ్చి మిరపకాయలు
1 చెంచా నల్ల మిరియాలు
2 చెంచాలు నూనె రుచికి ఉప్పు
2 కొత్తిమీర కట్టలు తునిమి ఉంచాలి

నీళ్లలో బాంబినో కాస్త ఉప్పుతో ఉడకబెట్టి దించి, వార్చి వేరే ఉంచాలి. అందులో గుడ్ల సొన, ఉల్లిపాయలు, పచ్చి మిరపకాయలు ఉప్పు, మిరియాలు కొత్తిమీర వేసి గట్టిగా కలపాలి. పెనం వేడి చేసి వేస్తూ పోతూ ఉంటే ఎన్నైనా చెల్లిపోతాయి.



## వ్యక్తిగతం



ప్రఖ్యాత చలన చిత్ర నటుడు సంజీవ్‌కుమార్ (47) నవంబరు 6వ తేదీన బొంబాయిలో గుండెపోటుతో అకాల మృత్యువు పాల్పడినారు అమెరికాలో ఓపెన్ హార్ట్ శస్త్ర చికిత్స చేయించుకుని ఇటీవలే ఆయన తిరిగి వచ్చారు. ఈయన అసలు పేరు హరిహర్ జరీవాలా. గుజరాత్‌లోని సూరత్‌లో జన్మించారు. రంగస్థల నటునిగా మంచిపేరు తెచ్చుకుని 1964లో "నిషాన్" చిత్రంతో సినిమారంగంలో ప్రవేశించి దాదాపు 200 చిత్రాలలో వైవిధ్యంగల ఎన్నో ముఖ్య పాత్రలని ధరించి తమకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించడమేకాక నటుడిగా ఉన్నత శిఖరాలని అందుకున్నారు. ఈయన అవివాహితుడు జాతీయ స్థాయిలో ఉత్తమ నటుడిగా వరుసగా మూడు సార్లు "భరత్" అవార్డుని అందుకుని రికార్డు సృష్టించారు. నటీమణులలో మూడుసార్లు "ఊర్వశి" అవార్డుని అందుకున్న నటి శారదతో కలిసి "ఊర్వశి" తెలుగు చిత్రంలో నటించారు.... ☐



ఇటీవలే గోలో మన్ (40) చరిత్రకారునికి జర్మనీ దేశస్థులకి ప్రతిష్ఠాత్మకమయిన గొథె అవార్డు లభించింది గోలో మన్ 19, 20వ శతాబ్దాలకి చెందిన జర్మన్‌ల చరిత్రను అత్యంత ప్రతిభావంతంగా విశ్లేషించారు ఈయన రాసిన "వాలెన్‌స్టెయిన్" ఈయన తండ్రి థామస్ మన్ (75) రాతలను గుర్తుకు తెస్తుంది. ఆసక్తికరమైన విషయ మేమిటంటే థామస్ మన్‌కి కూడా 36 సంవత్సరాల క్రితం గొథె అవార్డు వచ్చింది! ఈయనకి గతంలో నోబెల్ సాహిత్య బహుమానం కూడా వచ్చింది!! కుమారునికి కూడా గొథె అవార్డు రావడం పట్ల ఈయన ఎంతో సంతోషాన్ని వ్యక్త పరచారు. గోలో మన్ ప్రస్తుతం స్టట్‌గర్ట్ విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్రాచార్యునిగా పని చేస్తున్నారు. సుప్రసిద్ధ చరిత్రకారునిగా నిపుణుల మన్నన లందుకొంటున్న గోలో మన్‌కి షిల్లర్ బహుమతి, బుక్‌నెర్ బహుమతి వంటివి గతంలోనే లభించాయి గొథె అవార్డు రావడంలో వింత లేదు చరిత్రను కొత్త కోణంలో దర్శించాలని ఈయన కోరుకుంటారు ☐

# వారఫలం

## 29-11-1985 శుక్రవారంమొదలు 5-12-1985 గురువారం వరకు

★ **మేషం:** అనుకొన్న విధంగా అంతా సుముఖమే. బాగా విజయవంతమైన వారం. మీరు క్రొత్త యోచనలు అనేకంగా విస్తరిస్తాయి, కాని తొందరపాటుతో ఏ పనికి దిగరాదు, క్షేమంగాదు స్త్రీలకు:ఒకానొక విషయం నిర్దిష్టంగా మీకు అనుకూలం కాగలదు.

★ **వృషభం:** అన్ని రంగాలలో విజయవంతం. మీ మనోభీష్టం నెరవేరుతుంది, అది శుభ ప్రస్తావనయేగా. వ్యాపారం సాఫీగా సాగి, లాభదాయకం కావటం ఆనంద దాయకమేగా! రాజకీయంగా ఎలాంటి ఉపయోగం చేకూరదని గ్రహించాలి. స్త్రీలకు: ధనధాన్య వస్తువాహనానుకూలత గల వారం.

★ **మిధునం:** ఎవరో ఏమో చేయబోతారనీ, ఏదో లాభం చేకూరగలదనీ ఆశించటం శ్రేయస్కరం గాదు. మన కృషియే మనకు సాయపడాలి.నాట్యనాటక రంగానుభవం గల వారికి సదవకాశాలు లభ్యం కాగలవు, యత్నించాలి. స్త్రీలకు. వృత్తి ఉద్యోగ రీత్యా మేలైన సమయమే.

★ **కర్కాటకం:** గ్రహించండి, ప్రయాణాలందు జాగ్రత్త అవసరం. వ్యాపార రీత్యా అనుకూలం. మీరు సేకరించిన వస్తువులకు గిరాకీ హెచ్చుటం గమనించగలుగుతారు. ధనలబ్ధికి అవకాశం గలదు. పరుల చేత చిక్కిన డబ్బు, యత్నిస్తే అందటం ఖాయం. స్త్రీలకు: యత్న కార్యసిద్ధి, ధనలబ్ధి.

★ **సింహం:** శుభ ప్రస్తావనలకు అవకాశం, రాజకీయంగా ఏదో మేలు చేకూరటం, అంతో యింతో ఆయివోజు పెరగటం గమనింపదగిన అంశాలు. మిత్రులో, బంధువులో మీ మాటల్లో పొరపాట్లు దొర్లినవని వేధింప చూస్తారు. గ్రహించి మెలగండి స్త్రీలకు: విద్యాసంబంధంగా, వ్యవహార సంబంధంగా మీకు మేలున్నది. గ్రహించాలి

★ **కన్య:** ఎంతో కాలంగా, యితరుల చేతి నుండి డబ్బు రాబట్టుకోవాలని యత్నించారుగా, ఏమి ప్రయోజనం సాధించారు? ఈ వారం యత్నించండి, వీలైతే ప్రయాణం సాగించండి. మీకు అనుకూలదాయకమే. కొందరు వాహనం సంపాదించుకోగలుగుతారు. స్త్రీలకు:సాహితీ రంగాన కొందరకు, ఉద్యోగ రీత్యా కొందరకు సదవకాశాలు లభ్యం కాగలవు, గ్రహించండి.

★ **తుల:** మీరు రాజకీయరంగాన పరిభ్రమించే వారయితే, ఎంతో జాగ్రత్త అవసరం ఉన్నత పదవులలో ఉన్న వారు మరి జాగ్రత్తపడాలి. స్తోత్ర పాఠకులను దాపునకు చేర్చకండి స్త్రీలకు వయోవృద్ధులు అతిజాగ్రత్తగా ఉండాలి.

★ **వృశ్చికం:** ఆదాయానికి లోపం లేదు. అయినా లేనిపోని ఖర్చులు తలపై పడుతాయి. ఈ దినం జరగాలని అనుకొన్న వ్యవహారం మరెప్పుడో గాని జరుగదని గ్రహింపగలుగుతారు. స్థితి యందు మార్పు ఆశింపదగిన వారం గాదు, గ్రహమండలి అనుకూలం గాదు. స్త్రీలకు: విద్యా వైజ్ఞానికరంగాన అనుకూలత కనిపిస్తుంది

★ **ధనుస్సు:** సినీ నిర్మాతలు గాని, భారి వ్యాపారం చేసే వారికి గాని, నల్లని వస్తు విక్రేతలకు గాని అనుకూలత గల వారం. సుఖశాంతులకు · అవకాశం, రాజకీయవాదులకు అనుకూలం, గ్రహించి మెలగండి. స్త్రీలకు ఉద్యోగంలో అప్రమత్తత కూడదు పైవారి వలన మాట పడకుండ జాగ్రత్త వహించాలి.

★ **మకరం:** అన్నిరంగాలలో మీ యత్నాలు కొనసాగుతవి మీ యింట శుభ ప్రస్తావనలకు ఆస్కారమున్నది మీరు చేసే జాయింటు వ్యాపారం అనుకూలదాయకం గ్రహించండి పత్రికా విలేఖరులకు, ప్రకటనకర్తలకు, రచయితలకు అనుకూల సమయం. స్త్రీలకు నగలో, విలువ గల వస్త్రాలో కొంటారు, కొందరకు ప్రయాణం తప్పనిసరి అవుతుంది

★ **కుంభం:** రాజకీయరంగాన మీరు ప్రకాశింపనున్నారు, యత్నించండి. నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడుతుంది, తద్వారా మేలున్నది. చాలమందికి దూరప్రయాణాలు చేయవలసి వస్తుంది, వ్యవహార రీత్యా అనుకూల సమయంగా భావించి మెలగండి స్త్రీలకు పుణ్యకార్యాచరణం, అందుకై యత్నించుటతో వారం గడుస్తుంది

★ **మీనం:** ఏనాడో ఎవరికో మీరు మేలు చేసి ఉంటారు, ఈ వారం మీకు తెలియకుండానే, ఆ ఫలం అనుభవిస్తారు, పత్రికా విలేఖరులకు, ప్రకటనదారులకు లాభదాయకమైన వారం గ్రహచారం బాగున్నదని గ్రహించి ప్రయత్నాలకు దిగాలి. స్త్రీలకు కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి, బాకీలుంటే వసూలు కావటం వార విశేషం గ్రహించండి

–విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

# డాక్టర్లకు రెండేళ్ళు గ్రామవాసం

—శేఖర్ & BANNU

హైదరాబాద్, అక్టోబర్19
గ్రామీణ ప్రజలకు వైద్య సౌకర్యాలందించ నికి అనువుగా కొత్తగా ఉద్యోగంలో చేరే క్టర్లను మొదటి రెండు సంవత్సరాలు గ్రామీణ ప్రాంతంలో నియమించాలని ప్రభుత్వం నిర్ణయించినట్టు ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు బుధవారం నాడిక్కడ ప్రకటించారు.


















సీరియల్

# కాంచన సౌధం

రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

"అమ్మాయిగారూ!

ఏదో ఆలోచిస్తూ అద్దం ముందు కూర్చుని జడేసుకుంటున్న కల్పన తృళ్ళిపడి చూసింది

ఈ మధ్య ఆమె నిమిష నిమిషానికి తృళ్ళిపడుతోంది

ఏవిఁటమ్మాయిగారూ? ఉలిక్కిపడ్డారా? లోపలికొస్తూ అంది మంగి

అబ్బే! ఏవేం లేదు! ఏవిఁటిలా వచ్చావ్? నవ్వుతూ అంది కల్పన

మా మావఁగానున్నాడేమోనని!

అరె! వరదు పట్నం వెళ్ళాడుగా నీతో చెప్పలేదా? నాన్న ఏదో పని మీద పంపించి నట్టున్నారు అంది కల్పన జడ అల్లడం పూర్తి చేసి మువ్వేసకున్న చిక్కు తీస్తూ

అయ్యో! ఎల్లిపోనాడా! మద్దెనేల్నించి ఎల్తానన్నాడే! దిగులుగా అంది మంగి

ఏం? ఏదైనా పనుందా?

ఏం లేదమ్మా! నేనో పాలి పట్నం ఎల్దారని!

నువ్వా? ఎందుకు? సినిమా చూడాలనుందా? నవ్వుతూ అడిగింది కల్పన

మంగి నవ్వలేదు

మా మొగాలికి సినిమాలొకటే తక్కువైనై! మా బతుకులే సినిమాలు' అంది ఆవేదనగా

మంగి మాటలు చిత్రంగా తోచాయామెకి విరదు రాచి రంపాన పెడుతున్నప్పుడు గాని, రోజుల తరబడి పస్తులు పడుకున్నప్పుడు గానీ మొగుడి చేత చావు దెబ్బలు తిన్నప్పుడు గానీ ఇంత నిరాశ పడలేదు మంగి

అంటే అంతకన్నా కష్టమేమైనా వచ్చిందా? అనుకుంది కల్పన

ఏమైంది మంగి?" అంది అనునయంగా

మంగి రెండు కళ్ళ నిండా నీళ్ళూరాయి.

**జరిగిన కథ–9:** మమత తన పుట్టిన రోజునాడు సరదాగా పట్నం వెళ్ళి రావాలని ప్లాను వేస్తుంది విశ్వం అందుకు ఒప్పుకుంటాడు కానీ హాస్పటల్‌లో కల్పనతో మాటల్లో పడి ఆమాట మరచిపోతాడు. మమతికి బావపై కోపం వస్తుంది విశ్వం కల్పన ప్రేమించుకున్నారని, పెళ్ళి కూడా చేసుకోవాలను కుంటున్నారని దాసు మమతతో చెపుతాడు ఆమె అతని మాటలు నమ్మింది విశ్వం దగ్గర కల్పన ఫోటో, కల్పన దగ్గర విశ్వం ఫోటో ఉండటంతో మమత వాళ్ళని ఆ విషయం నిలదీసి అడుగుతుంది చౌదరి విశ్వాన్ని శత్రువులా చూస్తున్నాడు, విశ్వం రాయుడి గారింట్లో భోజనం చేస్తున్నాడు ఎలక్షన్‌లో రాయుడు నెగ్గాడు చౌదరి ఓడాడు మమతకు విశ్వం మీద పగరెట్టింపయింది మమతకు టైఫాయిడ్ వస్తే పట్నంలో నర్సింగ్ హోంలో చేర్పిస్తాడు చౌదరి విశ్వం జరిగిన విషయాలన్నీ మనసు విప్పి మాట్లాడాలని మమత దగ్గరకి వెళితే మమత అతనితో మాట్లాడడానికి నిరాకరించింది

ఏం చెప్పమ్మా! మమతమ్మగారు బతికుండగా ఆ పాం చూద్దామనుకున్నమ్మా! దుఃఖం నిండిన గొంతుతో అంది

మంగి! తృళ్ళిపడింది కల్పన

'అవునమ్మా! ఆరి పరిత్తితేం బాలేదంట'

ఎవరన్నారు?"

అంతా అనుకుంటున్నారమ్మా! ఆ తల్లి నా కాపరం బాగడ్డాక ఎన్నో ఇదాల సాయం సేసింది అయ్యగోరికి, సౌదరి బాబుకి పచ్చగడ్డేత్తే బగ్గుమనేలా వున్నా, మావఁ మీకాడ పని సేత్తన్నాడని తెల్సినా, ఆల్ల నాన్నగారికి తెలిసి తెలపకుండా ఎన్నో ఇదాల ఆదుకంది!

ఆల్ల బావగోరి మూలంగానే నా కొడుకు బతికాడు! ఆణ్ణి ఇస్కూల్లో సేర్పడవేఁగాక నాకూ నాలుగచ్చరాలు సెప్పి పున్నెం కట్టుకుంది

అలాంటి తల్లిప్పుడు సావుబతుకుల్లో వుంటే సూడకుండా ఎట్టా వుండగల్నమ్మా? ఏడుస్తూనే అంది మంగి

మంగి మాటల్లో నిష్ఠూరం కూడా వున్నట్టు అనిపించింది కల్పనకి బలవంతంగా నవ్వడానికి ప్రయత్నిస్తూ–

మంగి! నువ్వు బాధ పడ్డంలో తప్పులేదు! కాని కాస్త జ్వరం వస్తేనే మమత ఏదో అయిపోతుందంటున్నావే అదే బాగా లేదు! అసలు నీ కెవరు చెప్పారో గానీ ఈ రోజుల్లో టైఫాయిడ్ పెద్ద జబ్బేంకాదు!" అంది

మంగి బాధగా నవ్వింది

"నిజవేఁనమ్మా! మీరన్నట్టు జొరం పేణాలు తియ్యదు! కానీ దేనికైనా మందు తీసుకోవాలి గదమ్మా!

అంటే?"

అమ్మాయి గోరక్కడి కెల్లిందగ్గిర్నించి ఒక్క మందు బిల్ల మింగ లేదంట! ఒక్క ఇంజేషను చేపించుకోలేదంట!

'ఎందుకు" నిర్ఘాంతపోయింది కల్పన

ఆరికి బతకాలని లేదంట! సచ్చిపోతానని ఒకటే ఏడుపంట! " అంది మంగి కళ్ళు తుడుచుకుంటూ

కల్పన ముఖం పాలిపోయింది

నోట మాట రాక అలా ప్రతిమలా నిల్చుండిపోయింది

'మరో సిన్న మాటమ్మా!" మెల్లగా అంది మంగి

ఏమిటి?" అన్నట్లు చూసింది కల్పన

'అయ్యగోరు మీకూ, డాక్టరు బాబుగోరికి పెళ్ళనీ, తొరలో లగ్గాలెట్టుకుంటారనీ సెప్తున్నారు నిజవేఁనా?" సూటిగా అడిగింది

మరింత తృళ్ళిపడింది కల్పన

"సరే! నేనొత్తానమ్మా! ఏది చేసినా కూస్తి ఆలోచించి మరీ సెయ్యండి! తవఁకి సెప్పేపాటి దాన్ని కాదు! అయినా మీ దగ్గరున్న సనువుతో సెప్తున్నాను!" అంది మంగి

'మరి పట్నం వెళ్ళవూ? తడారిన పెదవులతో అంది కల్పన

"ఎలాగో ఆ బాబుగోర్ని అడిగి ఆరి జీపులోనే ఎల్తాను! అంటూ వెనుతిరిగింది మంగి

మంగి! "

"ఏటమ్మా?" .. వెనుతిరిగి అంది మంగి

"నువ్వు మీ ఇంటి దగ్గరే వుండు! నేనొస్తాను ." గంభీరంగా అంది కల్పన

అర్థంకానట్టు చూసింది మంగి

"నేను . పట్నం వెళ్తున్నాను! నిన్ను కూడా తీసికెళ్తాను!" అంది కల్పన

మంగి కళ్ళు తళుక్కుమన్నాయి

"అలాగేనమ్మా!" రెండు చేతులూ జోడించి ఆనందంగా వెళ్ళిపోయింది

కొంతసేపలా కూలబడిపోయింది కల్పన. ఆ తరువాత మెల్లగా లేచి చకచక డ్రెస్ చేసుకుని జీప్ బైటికి తీసింది.

"ఎక్కడికమ్మా?" అన్నాడు రాయుడు.

"పట్నం!"

"ఇప్పుడా? ఎందుకు?" ఆశ్చర్యంగా చూశాడాయన

"పనుంది నాన్నా!" ముభావంగా అంది కల్పన.

"ఆ చౌదరి కూతుర్ని చూడ్డానికే కదూ?" ఆయన గొంతు తీక్షణంగా ఉంది.

"అవును!"

"నీ జీవితంలో నువ్వే నిప్పులు పోసుకుంటున్నావన్న మాట!"

"లేదు నాన్నా!. నేనామె జీవితంలో పోసిన నిప్పుని ఆర్పడానికి ప్రయత్నిస్తున్నాను.. అదే ఆర్పకపోతే, ఆమెతో పాటు నేనూ ఆహుతై పోతాను." అంతకన్నా తీక్షణంగా అంది కల్పన.

"నామాట విను! పెద్దాణ్ణి!" ఏదో చెప్పబోయాడాయన

'సారీ! ఈ విషయంలో నేనింక ఎవరి మాటా వినదల్చుకో లేదు!" స్థిరంగా అందికల్పన

అంతే! మరుక్షణం జీపు దుమ్ము రేపుకుంటూ పట్నంకేసి దూసుకుపోయింది

★ ★ ★ ★ ★

రాయుడు బోన్లో పులిలా పచార్లు చేస్తున్నాడు ఆయనకి పూర్వం దర్పంకన్నా పదవి వచ్చాక రెట్టింపయింది

ప్రస్తుతం ఆయన విశ్వంమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు తను గెల్చింది కూడా విశ్వం మూలానే అని ఆయనకి బాగా తెలుసు అలాంటిది, అతనిప్పుడు తమకి దూరం అవుతాడేమో అన్న అనుమానం ఆయన్ని పురుగులా తొల్చేస్తోంది

కూతుర్ని అతనికిచ్చి చేసి అన్ని విధాలా చౌదరి గుండెలమీద దెబ్బతీయాలని ఎంతగానో అనుకున్నాడు కాని ఇప్పుడు కూతురి ప్రవర్తనవల్ల అంతా తారుమారు అయ్యేలా వుంది

ఇప్పుడు కల్పన పట్నం వెళ్ళడం ఆయనకి సుతారామూ ఇష్టంలేదు అయినా తనని కాదని వెళ్ళింది!

రాయుడు అలా ఆలోచిస్తుండగానే వీరడొచ్చాడక్కడికి తన ఆలోచనల క్కాస్సేపు ఆనకట్ట వేసి -

'ఏరా? పట్నం వెళ్ళిన పనులన్నీ అయినట్టేనా?' అన్నాడు ఓరగా చూస్తూ.

"అన్నీ అయినాయయ్యా! . మందులు అయ్యి మన పరండాలో ఏపించాను! ఏదో ఆలోచిస్తూ అన్నాడు వీరడు

"అమ్మాయిగారు బావుందా?" గంభీరంగా అన్నాడు రాయుడు

"అయితే అమ్మాయిగోరు పట్నవెల్లారన్న మాట! అక్కడ సెంటర్లో మన జీపు నాగుంటే ఏదో అనుకున్నాను కాని అమ్మాయిగోరు నా కనపడ్లేదయ్యా!" వినయంగా అన్నాడు వీరడు

నేనడిగింది మన అమ్మాయి గురించి కాదు! ఆ చౌదరి కూతురి గురించి!'



తృప్తిపడ్డాడు వీరడు

చెప్పరా! ఎలా వుందా పిల్ల?

'నాకేం తెల్సు బాబూ?"

తెలియదూ?"

'నువ్వా పిల్లని చూడ్డానికి హాస్పటల్‌కెళ్ళలేదూ?' దండిస్తున్నట్లు అడిగాడు రాయుడు

ఓసారి బయంగా ఆయనకేసి చూసి -

'వెళ్ళాను!' అన్నట్లు తలూపాడు వీరడు

రాయుడి మొహం మాడిపోయింది

'నియ్యమ్మ! మిరిద్దరూ ఒకటేరా! నా ఉప్పు తింటూ నా వెనకాల గోతులు తవ్వుతారు!' మండిపడ్డాడు

"అది కాదయ్యా! అమ్మాయిగోరి పరిత్తితేం బాగో లేదంటే "

వెళ్ళి రక్షించొద్దామనుకున్నావా?"

'లేదయ్యా! అమ్మాయిగోరు శానామంచోరు! ఎప్పుడూ నన్ను గురించడుగుతారు! ఆరి నాన్నగారి కట్టం లేకపోయినా నా కెన్నో ఇదాల సాయంసేసి మా కాపురం నిలబెట్టారయ్యా! నిజానికి రోజు నే నిలాగుండానంటే ఇదంతా ఆరి పున్నెవేనయ్యా! అలాంటప్పుడు ఒక్కసారామెని సూడకుండా ఎలా వుండనయ్య!' సంజాయిషీగా అన్నాడు వీరడు

రాయుడు మాట్లాడలేదు

ఆయన కిదంతా తెలుసు! అసలందుకే మమతంటే ఆయనకి చిరాకు!

వీరడు తాగుడు మానడం ఆయనకేమాత్రం నచ్చలేదు వాడు తాగకపోవడం మూలంగా తన పన్లు చాలా ఆగిపోయాయి

ఏదైనాచెప్తే తనకే నీతులు చెప్పేలా ఉన్నాడు ప్రస్తుతం వాడి దగ్గర ఆయనకి నచ్చిందల్లా విశ్వాసంగా, నమ్మకంగా పని చెయ్యడం మాత్రమే!

ఇప్పుడు వాడు కూడా చౌదరి కూతురితో చేరి ఊర్ని ఉద్ధరించే ప్రయత్నంలో ఉన్నాడని కూడా విన్నాడు

కొడుకుని స్కూల్లో చేర్పించడమే గాక తనూ, భార్యా చదూ నేర్చుకొంటున్నట్లు కూడా తెలుసుకున్నాడు

'ఎల్లి రానా బాబూ?" మెల్లగా అన్నాడు వీరడు

ఏరా? ఏవిఁటి తొందర? వెళ్ళి పాఠాలు చదువుకోవాలా?" వ్యంగ్యంగా అన్నాడు రాయుడు

"సీ! పాఠాలు కావు బాబూ! ." సిగ్గుపడి పోయాడు వీరడు.

"అరె! నా దగ్గరికెందుకురా దాచడం! మీరు చదువుకుని ఊళ్ళేలానుకొంటే నేనడ్డు పడతానా? అది సరే మి ఆవిడ కూడా చదువుతోందిట ?

"అదేనయ్యా! అమ్మాయిగోరు. బలవంతం సేత్తే నసిగాడతను

"అలాగా మరి ఆ మమత కాస్త ఎండుగడ్డి తినమంటుంది తింటావేవిఁట్రా?

అయ్యేం మాట్లు బాబూ! ఆ యమ్మ మమ్మల్ని గడ్డెందుకు తినమంటది మేమెందుకు తింటాం ఏదో నాలుగ. రాలు సెప్ప

ఆఁ! ఉద్యోగాలిప్పిస్తుంది!' వంకంగా నవ్వాడు రాయుడు

వీరడు బాధగా నవ్వాడు

"ఉద్దోగాలు మాకెందుకు బాబూ! మట్టి ఏసుక్కు బతికేవోల్లం! మరలాంటప్పుడు ఈ చదువులెందుకురా?"

"ఏదో కుర్రాడు సరదాపడ్డాడు

"కుర్రాడు సరదాపడ్డాడా? కుర్రాడు సరదాపడ్డాడని నువ్వూ, ని పెళ్ళాం కూడా సరదాపడ్డారు! అంతేనా?

అరే! వీరా! మి తాత చదివాడా మి బాబు చదివాడా నువ్వు చదివావా? ఇప్పుడు నీ కొడుకు, పెళ్ళాం చదవడానికి! అయినా ఇన్నాళ్ళూ లేని బుద్ధి ఇప్పుడు పుట్టిందేరా? చిరాగ్గాఅన్నాడు రాయుడు

తపఁరన్నది నిజమే బాబూ! - మా తాతగానీ, మా అయ్యగానీ పలకట్టుకోలేదు! - అందుకేనేమో! మాకున్న కొంద్ర, ఇల్లు తనకా రాపించుకుని వేలిముద్ర లేపించుకుని కూస్తంత డబ్బిచ్చి తన స్తొంతం చేసుకున్నాడా షావుకారు! కాస్త ఆవేశంగా అన్నాడు వీరడు

'ఓ! అయితే ఇప్పుడు నీ ఎస్టేట్లన్ని కాపాడుకోవటం కోసం చదువుకుంటున్నావన్న మాట!" హేళనగా అన్నాడు రాయుడు

ఏవోఁ బాబూ! మిరన్నట్టు నాకు ఎట్టేట్లే ఒత్తయ్యేమో! సిరిసంపదలు, పదవులు సెప్పా పెట్టకుండానే వత్తాయంటారు. అయ్యొచ్చినంత హటాత్తుగా సదూ రాదు గందా అందుకే ఈ సదూలు! గంభీరంగా అనేసి బైటికెళ్ళిపోయాడు వీరడు

రాయుడు నిర్ఘాంతపోయాడు!

వీరడు అలా మాట్లాడతాడని ఊహించనైనా లేదాయన ఇంకా ఏదైనా అంటే .. పన్లోంచి కూడా పోతాడనిపించింది

ఇదంతా ఆ చౌదరి పనే! పాలేరు వెధవల్ని నెత్తికెక్కించుకుని కొమ్ములొచ్చేలా చేశాడు!' మరోసారి పళ్ళు నూరుకున్నాడు

ఆయన చిరాకు రెట్టింపయింది

★ ★ ★ ★ ★

కల్పన, మంగి పట్నం వెళ్తూ దార్లో ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు






వాళ్ళు నర్సింగ్‌హోమ్ చేరేసరికి చౌదరి వీధిలో నిల్చుని ఉన్నాడు కల్పనని చూసి మౌనంగా ఆహ్వానించాడు

'ఎలా వుంది బాబాయ్? ఆతృతగా అడిగింది కల్పన

"ఇంకా జ్వరం కంట్రోల్‌కి రావడం లేదమ్మా! హై ఫీవరుంది దిగులుగా అన్నాడు చౌదరి లోపలికి నడుస్తూ-

'మందులు వేసుకుంటోందా?" భయం భయంగా అడిగింది కల్పన

ఆ! వేసుకుంటోంది కానీ మానసికంగా చాలా బాధ పడుతోంది డాక్టర్లు ఎన్నో విధాల నచ్చచెప్పారు వర్రీలేం వుండకూడదని కానీ ' ఆయన కళ్ళలో నీళ్ళూరాయి

"మీరేం బాధ పడకండి బాబాయి! తనే సర్దుకుంటుంది నేను మాట్లాడతాను మనసులో బాధ పడుతూనే పైకి ధైర్యంగా అంది కల్పన

ఆయన మౌనంగా తల పంకించాడు అయితే విశ్వాసాన్ని చిదరించుకున్నట్టు కల్పనని కూడా కూతురెక్కడ చిదరించుకుంటుందో అని ఆయనకి భయంగా వుంది ఎందుకో ఆయనకిప్పుడు ఆవేశాలు పూర్తిగా చల్లారిపోయాయి తెలిసిన వాళ్ళెవరు కనిపించినా ప్రాణం లేచొచ్చినట్టుంటోంది

ఆయన భయాన్ని గ్రహించిన కల్పన –

'మీరు ఏం ఆలోచించకండి బాబాయి! మమత నా చిన్ననాటి స్నేహితురాలు! ఏదో రోజులు బావుండక మన మధ్య నిప్పు రాజుకుంది ప్రస్తుతం ఆ నిప్పు చల్లార్చాలి! అంది అయితే మమత చేత ఎలాంటి మాటలు పడాల్సొస్తుందో అన్న బయం ఆమె క్కూడా లేకపోలేదు

ముగ్గురూ కలిసి మమత రూమ్‌లో కెళ్ళారు ఆమె మగతగా పడుకునుంది

మమతా! మెల్లగా పిల్చాడు చౌదరి ఆమె పలకలేదు

శవాకారంలా పడున్న ఆమెని చూస్తుంటే మంగికి దుఃఖం ఆగలేదు గభాల్న వరండాలో కెళ్ళి భోరుమంది

"మమతా!" మెల్లగా తట్టింది కల్పన

మమత బారంగా కళ్ళు విప్పింది

ఎదురుగా పాలిపోయిన మొహంతో కల్పన!

ఆమెని గుర్తించినట్టుగా చిన్నగా నవ్వింది మమత తనని అసహ్యించుకుంటుందనీ, మాట్లాడను పొమ్మంటుందనీ ఇంకా ఏవేవో వూహించుకున్న కల్పనకి మమత నవ్వు చూశాక కొంతంత ధైర్యం వచ్చింది

'ఎప్పుడొచ్చారు?' నీరసంగా అంది మమత

"ఇప్పుడే! ' ఆమె చేతిని తన చేతల్లోకి తీసుకుంటూ అంది కల్పన

'మంగి కూడా వచ్చింది!" చౌదరి అన్నాడు

ఏది?' అన్నట్టు చూశాయి మమత కళ్ళు అప్పుడే మంగి లోపలి కొచ్చింది ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి ఏడ్చిన గుర్తుగా

ఏడ్చావా?' నవ్వుతూనే అంది మమత

"లేదు!" అన్నట్టు తలూపింది మంగి అయితే ఇంకా ఆమె కళ్ళు నీళ్ళతో నిండుతూనే ఉన్నాయి

మమతా! " మెల్లగా పిల్చింది కల్పన

'ఊఁ!

"ఎలా వుంది?'

'ఏమిటి?"

అదే నీ. ఆరోగ్యం!"

'అది మీరు చెప్పాలి!" నవ్వింది మమత

ఆ నవ్వు కల్పన గుండెల్ని పిండేలా ఉంది

'అవునమ్మా! పరిస్థితెలా వుంది?" అన్నాడు చౌదరి కల్పన కేసి చూస్తూ ధైర్యం చెప్పిందామె

"మీరు మందు తీసుకోవడం లేదని ఇన్నాళ్ళ పేణం కొట్టుకు పోయిందమ్మా! ఇంక బయంనేదు! తృప్తిగా అంది మంగి

"నేనంత తొందరగా చావను మంగి!" నిరాశగా నవ్వుతూ అంది మమత

'ఛ! అలా అనమాకండమ్మా!" అంది మంగి బాధగా కల్పన మొహం మరింత పాలిపోయింది

చెప్పండి' ఇంకా ఏమిటి విశేషాలు" నవ్వు తెచ్చి పెట్టుకుంటూ అంది మమత

పది నిమిషాలు మాట్లాడుకున్న తరవాత కాస్త సర్దుకున్నారంతా ఇంతలో డాక్టర్ పిలవడంతో కల్పనకి చెప్పి బైట కెళ్ళిపోయాడు చౌదరి

కల్పన సైగ చూసి మంగి కూడా వరండాలో కెళ్ళిపోయింది

కూర్చున్న స్టూల్‌ని మమతకి మరింత దగ్గరగా లాక్కుంటూ – మమతా' మృదువుగా పిల్చింది కల్పన

ఊఁ'

ఇప్పుడు నేనెందుకొచ్చానో తెలుసా"

నన్ను చూడ్డానికి'

కాదు'

మరి" కళ్ళు చిట్లించింది మమత

నీతో కాస్సేపు మాట్లాడాలని'

దేన్ని గురించి"

చెప్తాను' ముందు నువ్వు నాకో మాటివ్వాలి'

చెప్పండి'

నేను చెప్పేది పది నిమిషాల పాటు శాంతంగా వినాలి'

ఏమిటి డాక్టర్" నవ్వింది మమత

ముందు ప్రామిస్ చెయ్యాలి'

అలాగే' ప్రామిస్' చెప్పండి

మన పరిచయ కాలం ఎంత" గంభీరంగా అంది కల్పన

దాదాపు రెండేళ్ళు'

రెండేళ్ళేనా' అంతకుముందు మనకి పరిచయం లేదా'

ఉంది' కాని అది లెక్క లేదు'

ఎందుకు లెక్క లేదు"

ఆ పరిచయాలు, స్నేహాలు పూర్తిగా ఆవిరైపోయాయి అందుకే ' మమత ఆపేసింది

చెప్పు మమతా' అందుకే"

డాక్టర్' ఇప్పుడవన్నీ తవ్వుకోవడం వల్ల వచ్చే లాభం ఏమిటి" మనసులు మరింత పాడవడం తప్ప'

అలా కాదు' ఉన్నదున్నట్టు చెప్పు' మనం చిన్నతనం నుంచి ప్రాణ స్నేహితులం' అవునా'

కావచ్చు' కాని మధ్యకాలంలో మన మధ్య బద్ధ శత్రుత్వం ఏర్పడింది

ఏం" మనిద్దరం ఎప్పుడైనా పోట్లాడుకున్నామా"

మనిద్దరం పోట్లాడుకోక పోవచ్చు' కాని మన పెద్దలు పోట్లాడుకున్నారు'

అయితే మనం విడిపోవడం ఎందుకు"

'పెద్దలతో పాటే పిల్లలు' గంభీరంగా ఉంది మమత

బావుంది' పోనీ ఒకటి చెప్పు' అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఎప్పుడూ మాటా మాటా అనుకోరా" కాస్త ఘర్షణ పడ్డంత మాత్రాన పువ్వు, నిప్పులా ఉంటారా" జీవితాంతం కలవనే కలవరా" సూటిగా అంది కల్పన

నిజమే' . కాని మన మధ్య బంధుత్వం లేదు తక్షణంగా అంది మమత

మమతా' తెల్లబోయింది కల్పన

అవును డాక్టర్' మీరు నాకు అక్కా కాదు మీ నాన్నగారు నాకు పెదనాన్నా కాదు'

ఎంత మాటన్నావ్ మమతా' బంధుత్వానికన్నా స్నేహమే ఎక్కువ' అన్న

# భారతి
## కథలు రాసేవారికి మనవి.....

భారతిలో ప్రచురణకి పరిశీలనార్థం చిన్న కథలు పంపవలసిందిగా రచయిత(త్రు) లకి మనవి చేస్తున్నాము.

రచనలు కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి

కథలు 12 అరఠావు కాగితాలకి మించకుండా ఉంటే మంచిది

అనువాదాలు, అనుసరణలు పంపరాదు

ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన స్వంత చిరునామా గల కవరు జతపరచి పంపాలి

రచనలని సంపాదకుడు, భారతి, సాహిత్య మాసపత్రిక, ఆంధ్రపత్రిక కార్యాలయం, గాంధీనగరం, విజయవాడ – 520003 అన్న చిరునామాకి పంపాలి







నువ్వేనా ఇలా మాట్లాడింది? బాధగా అంది కల్పన

అది నిజమే కల్పనా! కాలం, కాలంతో పాటు మనుషులూ మారుతూంటారు! అది సహజం

అంటే మనం కూడా శత్రువులమన్నమాట

కాకపోవచ్చు! కాని మిత్రులం కూడా కాదు

లేదు మమతా! మనమిద్దరం ఎప్పుడూ స్నేహితులమే! వణుకుతున్న స్వరంతో అంది కల్పన అంతవరకు జపం లేనట్టున్న మమత కళ్ళు చురుకుగా చూశాయి కల్పన కేసి ఆ కళ్ళల్లో -

నువ్వు నాకు స్నేహితురాలివా? నో! నాకు బద్ధ విరోధివి! అని బాపం కనిపించింది కల్పనకు

భారంగా నిట్టూర్చింది

ఇంతకీ ఈ ఉపోద్ఘాతం అంతా దేనికి? తన భావాల్ని మనసులోనే దాచుకుంటూ తేలిగ్గా నవ్వేసి అంది మమత

చెప్తాను కానీ మమతా! ఒక చిన్న రిక్వెస్ట్!

ఏమిటి?

ప్లీజ్! నా మాటలు జాగ్రత్తగా విను! ఇప్పటి సంగతులు కొన్నేపు మర్చిపో! మనం చిన్నప్పుడు ఒకటిగా తిరిగాం ఏమి అంటే ఏమి అనుకునేవాళ్ళం! అవునా?

అవును! అయితే?

అందుకే మనం కొంతసేపు మన మనసుల్ని నిర్మలంగా ఉంచుకుని ఆనాటి పసి మనసులతోనే నిష్కల్మషంగా మాట్లాడుకుందాం!

ఆనాటి పాల మనసులతోనా? ఇప్పుడా? పక్కున నవ్వింది మమత

ఏమిటి మమతా? చిన్నబుచ్చుకుంటూ అంది కల్పన

లేకపోతే ఏమిటి కల్పనా! కల్లాకపటం తెలియని ఆనాటి పసిహృదయాలెక్కడ? నరనరాల్లోనూ విషం జీర్ణించుకుపోయి ఎదుటి వాళ్ళ మీద విషం కక్కడానికి సిద్ధంగా ఉన్నట్టున్న ఈనాటి కఠిన హృదయాలెక్కడ! అసలానాటి ఛాయలే మనలో లేవు! మాడి మసైపోయాయి! మట్టిలో కలిసిపోయాయి! ఆవేశంగా అంది మమత

కల్పన బిత్తరపోయింది

మమతా! నువ్వెందుకలా అనుకుంటున్నావో నాకర్థం కావటంలేదు- అసలు

ప్లీజ్! ఇంక ఆ టాపిక్ వదిలెయ్యి కల్పనా! నీలోనూ, నాలోనూ కూడా మార్పొచ్చింది లేకపోతే ఆనాడు నేనడగాననే కాస్తయినా ఆలోచించకుండా తామరపువ్వు కోసం చెర్లో దిగి ప్రాణం మీదికి తెచ్చుకున్న నువ్వు! ఈనాడు నా ప్రాణానికి ప్రాణమైన నా బాబుని దుఃఖంతో మమతకు మాట రాలేదు

నిర్లిప్తంగా నవ్వింది కల్పన

అయితే మమత తనతో కాస్త మనసు విప్పి మాట్లాడుతుందనే అనిపించిందామెకి అందుకే-

'అదే మమతా! దాని గురించే మనం మాట్లాడుకుందాం! అందుకే నేనొచ్చాను!' అంది గంభీరంగా

మమత మాట్లాడలేదు

పరవాలేదు! నువ్వు కాస్త మారావని నన్ను పేరు పెట్టి పిలవటం చూస్తే తెలుస్తోంది

మమతా! నన్ను డాక్టరుగా మర్చిపోయి నీ చిన్ననాటి స్నేహితురాలిగా చూడు! నేనూ అలాగే ఉంటాను ఇద్దరం మన ముసుగుల్ని తొలగించుకుని హాయిగా మనసుల్ని విప్పుకుని మాట్లాడుకుందాం! నిజంగా నేన్నీకు ద్రోహం చేశాననే అనిపిస్తే ఇంక జీవితంలో నీ కంటపడను! ఈసారికి నా మాట విను ప్లీజ్! ఆమె చేతిని సున్నితంగా నొక్కుతూ అంది కల్పన

మమత మౌనంగా ఉండిపోయింది

మమతా నేనిప్పుడు చెప్పేదంతా నూటికి నూరు పాళ్ళూ నిజం! మా నాన్నమీదే కాదు! నాకత్యంత ఇష్టమైన విశ్వం మీద ప్రమాణం చేసి చెప్తున్నాను!




యస్. ఎస్. డి – హైదరాబాద్

నాకు 18 సం లు చిన్నప్పటి నుంచి పైన ఉన్న రెండు పెద్ద పళ్ళు పసుపు (ఎరుపు) రంగులో వుంటాయి అవి తెల్లగా రావటానికి ఏమి వాడాలి?

**ఎక్కువగా టెట్రాసైక్లిన్ వంటి మందులు వాడినా, మరికొన్ని రకాల దంత రోగాల వల్లా ఇలా పసుపుగా అయ్యే అవకాశం ఉంటుంది "పాచి" చేరటం ఇలా అవటానికి ముఖ్య కారణం అవుతుంది ఇటువంటి సందర్భాలలో దంత వైద్యులు పళ్ళను క్లీన్ చేస్తారు.**

కె వి – పాలకొల్లు

నా వయస్సు 25 సం లు నాకు రోజుకు కనసము 15 సార్లు యూరిన్ పాస్ అవుతుంది ఇలా అయినపుడల్లా కొంచెము కడుపు నొప్పి 2 నిముషాల పాటు వుంటుంది యూరిన్ అయ్యాక కొంచెము వక్గా కూడ వుంటుంది యూరిన్ టెస్టు, బ్లడ్ టెస్టు చేసి అన్ని నార్మల్‌గా వున్నాయని టెంపరేచర్ నార్మల్‌గా వుంటే తగ్గుతుందని డాక్టరు గారు చెప్పారు

**మీరు యూరాలజిస్టుల వద్ద చూపించుకోవటం మంచిది. మూత్రపిండాలలోను, యూరినరీ బ్లాడర్‌లో ఏదైనా లోపం ఉన్నదీ లేనిదీ వారు కొన్ని పరీక్షలు చేసి నిర్ణయిస్తారు.**

బి. వి. ఆర్ – రాయగడ

మా అమ్మగారి వయస్సు 40 సం ఆవిడకు కుడికన్ను ఆపరేషన్ అయి మూడు సం అయినది కాని ఎడమ కన్ను నుంచి ఎప్పుడూ నీరు కారుతూ నెప్పి పెట్టుతూ వుంటుంది ఆపరేషన్ అయిన కన్నుకు కళ్ళద్దాలు ఉన్నా సరిగా కన్పించదు దీనికి కారణము ఏమిటి?

**చేసిన ఆపరేషన్ పేరు తెలియకుండా రోగ నిర్ణయం చెయ్యటం కష్టం. ఎడమ కంటి నుంచి నీరు కారటానికి ఎన్నో కారణాలు ఉంటాయి. వాటిలో డాక్రొ సిస్టైటిస్ అనేది ముఖ్యమైనది. ఏ రోగమైనదీ నేత్ర వైద్యులు ప్రత్యక్షంగా పరిశీలించి నిర్ణయించవలసి ఉంటుంది.**

**ఆపరేషన్ చేసినా అప్పుడప్పుడూ కళ్ళను పరీక్షింప చేసుకొని అవసరమైతే అద్దాలను మార్చవలసి ఉంటుంది. మీరు వెంటనే నేత్ర వైద్యులను కలవండి.** □

చెప్పు! ఎలాంటి భావం లేకుండానే అంది మమత

నేను విశ్వాన్ని ప్రేమించిన మాట నిజమే!" తలవంచుకుని మెల్లగా అంది కల్పన

'అదిప్పుడు కొత్తగా చెప్తున్నావా? కఠినంగా అంది మమత

లేదు నీకర్థమయ్యేలా చెప్తున్నానంతే!-

చెప్పు!

**(ఇంకా ఉంది)**

# పల్లవ శిల్పకళా వైభవం

దాక్షిణాత్యంలో కాంచీపురాన్ని రాజధానిగా చేసుకొని విజృంభించి 3 శతాబ్దాలుకు పైగా (క్రీస్తుశకం 575 నుంచి 885 వరకు) పాలించినవారు - పల్లవులు. వీరు తమ రాజ్యానికి ఉత్తరంగా వున్న బాదామి చాళుక్యులతోను దక్షిణంగా వున్న పాండ్యులతోను నిరంతరం యుద్ధాలు కొనసాగించినా మరో ప్రక్క తమలో రగిలే కళాదీప్తిని రవళింపజేసి, మహోన్నత శిల్పాలను సృష్టించి, ద్రవిడ శిల్ప కళారీతులకు శ్రీకారం చుట్టి, దాక్షిణాత్య ఆలయ రీతులకు సరి అయిన పునాది వేశారని చెప్పవచ్చు. విన్సెంట్ స్మిత్ పండితుడు చెప్పినట్లు "వాస్తవంగా దక్షిణ భారతదేశంలో వాస్తుశిల్ప కళల చరిత్ర పల్లవుల కాలంలో ప్రారంభమైనది". పల్లవ రాజుల్లో కొంతమంది శైవులు కాగా, మరికొంత మంది వైష్ణవులు వున్నారు. దేవాలయాల నిర్మాణం విరివిగా జరిగింది.

పల్లవుల సంక్షిప్త రాజకీయ చరిత్ర:- మహోజ్వలమైన శిల్పసంపదను సృజింపజేసిన ఘనులైన పల్లవులకు మూలపురుషుడు సింహవిష్ణువు. ఇతని తర్వాత రాజ్యానికి వచ్చిన మహేంద్రవర్మ (600-630) కు వాస్తు, శిల్ప, చిత్రలేఖనాలన్నా, సంగీతమన్నా ఎక్కువ అభిమానం. కొండలను తొలిచి గుహాలయాలను నిర్మించే శిల్ప పద్ధతిని తమిళనాడులో ప్రవేశపెట్టినది ఇతడే! ఇలాంటి ఆలయాలను మహాబలిపురం, మమన్దర్, దళవానూర్, తిరుచునాపల్లి మొదలైన చోట్ల చూడవచ్చు.

మహేంద్రవర్మ తర్వాత అతని కుమారుడు మొదటి నరసింహవర్మ (630-668) రాజ్యపాలన చేశాడు. మహా యోధుడీతడు. చాళుక్య రాజ్యంపై దండెత్తి (642) రెండో పులకేశిని వధించి అతని రాజధాని అయిన బాదామిని ధ్వంసం చేశాడు. ఈ విజయపరంపరలకు సూచనగా మహామల్ల, వాతాపికొండ అనే బిరుదులను ధరించాడు. ఇతడు కూడా తండ్రివలె సారస్వత లలితకళలను పోషించాడు. మహాబలిపురంలోనే ఏకశిలా రాతి రథాలలోని అధిక భాగం ఇతని కాలంలోనే తొలిపించబడ్డాయి. ఇతడు తొలిపించిన గుహాలయం నెల్లూరుజిల్లా భైరవకొండలో వుంది.

మొదటి నరసింహవర్మ తర్వాత అతని కుమారుడు రెండో మహేంద్రవర్మ రెండు సంవత్సరాలపాటు (668-670) పల్లవ సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. ఇతని తర్వాత ఇతని కుమారుడు అయిన పరమేశ్వరవర్మ 670 నుంచి 700 వరకు ఏలుబడి సాగించాడు. తదనంతరం సింహాసనం అధిష్ఠించిన రెండో నరసింహవర్మ (700-728) దేవాలయాలను నిర్మించడం పట్ల ఎంతో ఆశక్తి కనపరిచాడు. ఇతనికి రాజసింహ అనే బిరుదు వుంది. సుప్రసిద్ధ దేవాలయాలైన మహాబలిపురంలోని తీర దేవాలయం, కంచిలోని కైలాసనాథ ఆలయాన్ని కట్టించినదీతడే! ఇతని తర్వాత క్రి. శ. 728 నుంచి



"గంగావతరణము" దృశ్యం శిల ఉత్తర భాగం

885 వరకు పల్లవ సామ్రాజ్యం ఎందరో రాజుల చేత పరిపాలించబడింది. వీరిలో వాస్తుశిల్ప కళా దృష్ట్యా ముఖ్యుడు - నందివర్మ (731-96). ఇతడు కాంచీపురంలో ముక్తేశ్వర, వైకుంఠ పెరుమాళ్ ఆలయాలను నిర్మించాడు. కాగా, 'పల్లవ సామ్రాజ్యం అపరాజితవర్మ పరిపాలించే కాలంలో (885) చోళుల చేత ఆక్రమించబడి పతనమయి పోయింది.

పల్లవరాజ్యం అస్తమించినా, రాజులు పోయి, వైభవం మసి అయినా గత వైభవానికి తార్కాణంగా రారాజుల శిల్పకళాదరణకు నిదర్శనంగా వారు నిర్మించిన దేవాలయాలు నేటికీ నిల్చి వున్నాయి.

శిల్పకళ :- పల్లవులు వారి పరిపాలనా కాలం తొలి రోజుల్లో గుహాలయాలు, ఆ తర్వాత దేవాలయాలను నిర్మింపజేశారు. వీరు నిర్మించిన గుహాలయాలను రెండు రకాలుగా విభజించవచ్చు. అవి - (ఏ) మంటపాలు (బి) రథాలు. మంటపాలు మహాబలిపురం, తిరుచునాపల్లి, మండగపట్టు, భైరవకొండ మొదలైన చోట్ల వున్నాయి. రథాలను మాత్రం మహాబలిపురంలో చూడవచ్చు. పల్లవుల దేవాలయాలలో ముఖ్యమైనవి మూడు వున్నాయి. అవి - (1) కైలాసనాథాలయం (కంచి) (2) వైకుంఠ పెరుమాళ్ ఆలయం (కంచి) (3) తీర దేవాలయం (మహాబలిపురం). వీరి గుహాలయాల మీదను దేవాలయాల మీదను దేవతా, మానవ ప్రతిములు రమణీయంగా మలచబడి ఉంటాయి. పల్లవులు వారి నిర్మాణ రీతులలో అమరావతి శిల్ప సంప్రదాయాలను చాలవరకు అనుసరించారు.

1) మహాబలిపురం :- మద్రాసునగరానికి 60 కిలో మీటర్ల దూరంలో బంగాళాఖాతం తీరాన వెలిసిన సుందర శిల్పాలయం - మహాబలిపురం. తమిళనాడు టూరిజం శాఖవారు మద్రాసు నించి మహాబలిపురానికి లగ్జరి బస్సులలో టూర్లు నిర్వహిస్తున్నారు. పల్లవులు అభివృద్ధి చేసిన శిల్పకళకు ఇది ముఖ్య కేంద్రం. పల్లవ చక్రవర్తి మొదటి నరసింహావర్మ (630-668) దీనిని నిర్మింపజేశాడు. మహాబలిపురంలోని శిల్పాలలో అధిక భాగం ఏకశిల నుంచి మలచబడ్డవే. ఇక్కడి ఆలయాలను మూడు రకాలుగా విభజించవచ్చు. అవి - (ఏ) గుహాలయాలు. (బి) దేవాలయాలు. (సి) పెద్ద బండరాయిపై మలచబడ్డ శిల్ప సముదాయం.



ధర్మరాజు రథం



భీముని రథం

(ఏ) గుహాలయాలు :- గుహాలయాలను తిరిగి రెండు రకాలుగా విభజించవచ్చు. అవి - (1) మంటపాలు (2) రాతి రథాలు.

(1) మంటపాలు :- ఒక పెద్ద కొండ రాతిని తొలిచి అద్భుతంగా నిర్మించిన గుహాలయాలే మంటపాలు. ఇక్కడ మొత్తం 15 మంటపాలున్నాయి. ఇవి పల్లవుల ఆరంభ శైలిని సూచిస్తున్నాయి. వీటికి ముఖ భాగంలో స్తంభాలతో కూడిన వరండా, అందులో నుంచి లోపలికి తొలిచిన గది లేదా గదులుంటాయి. ఇవి పరిమాణంలో చిన్నవి. మంటపాల ముందు భాగంలో సింహాలు మోస్తున్నట్లుగా చెక్కిన రెండు స్తంభాలు, ఆ స్తంభాలపై కనిపించే జిలుగు పనితనం పల్లవుల అపూర్వ కల్పనాశక్తిని వ్యక్తం చేస్తున్నాయి. మంటపాల లోపల అద్భుతమైన పౌరాణిక గాథలు శిల్పరూపంలో దర్శనమిస్తాయి. ఈ గుహాలయాలలో వరాహ, మహిషాసురమర్ధిని, త్రివిక్రమ, విష్ణు గుహాలయాలు అతి ప్రసిద్ధి చెందినవి. వీటిలో వరాహ, దుర్గ మంటపాలు మహేంద్రవర్మ కాలం నాటివి.

(2) రాతి రథాలు :- ఒకే శిలలో మలచి వేరుచేయబడిన 4 రథాలు, మరొక రథం ఒకే చోట గుంపుగా వున్నందున వీటిని పంచపాండవ రథాలు అంటారు. కాని, ఇవి దేవాలయ నమూనాలు. వీటిలో చాలా భాగం మొదటి నరసింహవర్మ (630-668) నిర్మింపజేశాడు. నాలుగు ఏకశిలా రథాలు ఒకదాని వెంబడి ఒకటి వరుసగా వుండగా అయిదవ రథం మాత్రం వాటికి ప్రక్కగా దర్శనమిస్తుంది. వీటిలో ద్రౌపది రథం అన్నింటికంటే చిన్నది. దీనిని చతురస్రాకారమైన గుడిసెలా మలిచారు. ప్రవేశ ద్వారాని కిరువైపులా ద్వార పాలకుల విగ్రహాలున్నాయి. రథం లోపల గోడమీద పద్మంపై నిలుచున్న దుర్గాదేవి, తన తలను నరుక్కుని దేవికి సమర్పిస్తున్న భక్తుని విగ్రహం అద్భుతంగా చెక్కబడింది. ఈ రథానికి ప్రక్కనే అర్జునుడి రథం మలచబడింది. ఈ రథం రెండు అంతస్తులుగా (ద్వితల) నిర్మించబడింది. దీని కుడ్యాలు తరంగ శీర్షికలుగల స్తంభాలతోను, వృషభ వాహన శివుడు, ఐరావతంనెక్కిన ఇంద్రుడు, రాజదంపతులు మొదలైన శిల్పాలతో అలంకరించబడ్డాయి.

అర్జునుడి రథం ప్రక్కనే వున్న భీముని రథం అన్నింటికంటే పెద్దదిగా మలచబడింది. దీని శిఖరం గజపృష్టాకారంలో వుంది. ప్రదక్షిణా పథం కలిగివుంది. తర్వాత కనిపించే ధర్మరాజు రథం మూడు అంతస్తులు (త్రితల)గా చెక్కబడింది. ఈ రథం గోడలపై బ్రహ్మ, హరిహరుడు, శివుడు, కార్తికేయ అర్ధనారీశ్వర ప్రతిమలు అద్భుతంగా చోటు చేసుకున్నాయి.

ఈ నాలుగు ఏకశిలా రథాలకు ప్రక్కగా నకుల సహదేవ రథం వుంది. ఇది గజపృష్టాకారంలో వుంది. పంచపాండవుల రథాల ఆకారాలను బట్టి చూస్తే ఇవి నాటి బౌద్ధ విహారాలను, చైత్యశాలలను కొంతవరకు అనుకరించి నిర్మించినట్లు తెలుస్తోంది. పెర్సీబ్రౌన్ చెప్పినట్లు "ఈ రథాలు తర్వాత నిర్మించబడిన ప్రసిద్ధ ఆలయాలకు నమూనాలైనాయి"

(2) దేవాలయాలు :- (ఏ) తీర దేవాలయం:- పల్లవులచే నిర్మించబడిన అతి ముఖ్యమైన దేవాలయాలలో మహాబలిపురంలోని తీర

ద్రౌపది అర్జునుల రథాలు



నకుల సహదేవుల రథం





వరాహా మంటపం

దేవాలయం ఒకటి సముద్రపు ఒడ్డున వున్న ఈ ఆలయాన్ని పల్లవరాజు అయిన రెండో నరసింహవర్మ (రాజసింహుడు) 8వ శతాబ్దంలో కట్టించాడు ఇది కట్టడాలయం దూరంనుంచే అంతస్థులు కలిగిన రెండు విమానాలు ఆకర్షిస్తాయి దీనికి అంతరాళం, గర్భ గృహంపైన సమచతురస్ర, చతుస్థల ద్రావిడ విమానం వున్నాయి ఈ ఆలయపు ఆకారం చాలవరకు ధర్మరాజు రథాన్ని పోలి వుంటుంది వాస్తవానికి ఈ ఆలయం త్రికూట ఆలయం (ఒకే ఆలయంలో 3 గర్భగృహాలు) తూర్పు దిశలో క్షత్రియ సింహేశ్వర గృహం, పశ్చిమ దిక్కున రాజసింహేశ్వర గృహం ఈ రెండింటికి మధ్య విష్ణు అనంతశాయి గృహం వుంది గర్భగృహాల గోడల లోపలి వైపు, అర్ధమండపం గోడల మీద పల్లవులకు ఇష్టమైన సోమాస్కంద శిల్పాలు చెక్కబడ్డాయి తొలి పల్లవ ఆలయ నిర్మాణ శైలికి మచ్చుతునక ఈ తీర దేవాలయం ఎన్నో వందల సంవత్సరాలు గడిచినా ప్రకృతి ఆటుపోటులకు తట్టుకొని ధృడంగా వున్న ఆలయ గోపురాలను చూస్తే ఆలయం కట్టిన రాజవైభవదర్పాలు గుర్తుకొస్తాయి రెండో నరసింహ వర్మ కాలానికి చెందినవే ఈశ్వరాలయం, ముకుందాలయం, మహాబలిపురంలో నే వున్నాయి

(బి) పెద్ద బండపై మలచబడ్డ శిల్ప సముదాయం -

(1) అర్జున తపో దృశ్యం శిల - మహాబలిపురంలో యాత్రికులను విశేషంగా ఆకర్షించేది పెద్ద బండరాయిపైమలచబడ్డ శిల్ప సముదాయం దీనినె 'అర్జున తపో దృశ్యం శిల' అని పిలుస్తారు కాని వాస్తవానికి ఇది "గంగావతరణము శిల్ప దృశ్యం 98 అడుగుల పొడవు, 43 అడుగుల వెడల్పు కలిగిన ఈ పెద్ద బండరాయిపై గంగ అనుగ్రహం కోసం భగిరథుడు తపస్సు చేస్తున్న దృశ్యం, గంగ భూమిపై అవతరించిన దృశ్యం అతి నేర్పుగా ప్రదర్శించబడింది గంగానదికిరు వైపులా గంగను దర్శించడానికి వచ్చిన దేవతలు, మానవులు, భూతాలు, ఏనుగులు, సింహాలు, పెద్ద పులులు చోటు చెసుకున్నాయి గంగాజలంలో నాగరాజులు సతీసమేతంగా విహరిస్తున్నట్లు చూపబడింది శిల్పం క్రింది భాగంలో రెండు ఆడ, మగ ఏనుగులు, వాటి కూనలు సహజత్వం ఉట్టిపడేలా మలచబడ్డాయి మౌర్యులువలె పల్లవులు కూడా తమ శిల్పంలో జంతువులకు ప్రాధాన్యత ఇచ్చారు

(2) కంచి - మద్రాసు నుంచి 70 కిలో మీటర్ల దూరంలో వున్న కాంచీపురాన్ని టూరిజం శాఖవారి బస్సులలోగాని, ప్రయివేటు బస్సులలోగాని చేరుకోవచ్చు రమ్యమైన శిల్పకళా సంపదలో పల్లవులు ఇక్కడ అనేక దేవాలయాలను నిర్మించారు వాటిలో ప్రముఖంగా చెప్పతగ్గవి - (ఎ) కైలాసనాధాలయం (బి) వైకుంఠ పెరుమాళ్ ఆలయం ఈ ఆలయాల శిల్పాలలో తొలి చాళుక్యుల శిల్పకళా ప్రభావం కనపడుతుంది

(ఏ) కైలాసనాధాలయం - పల్లవ వాస్తుకళలలో మహోన్నతమైన సృష్టి కైలాసనాధాలయం దీనిని రెండో నరసింహ క్రి శ 700 ప్రాంతంలో కట్టించాడు ఈ ఆలయాన్ని రాజసింహేశ్వర గృహం అని కూడా అంటారు దీని విమానం 4 అంతస్తులుమీద నాలుగు దిక్కులా నందీశ్వర ప్రతిమలు వున్నాయి ఆలయానికి గర్భగృహం, అంతరాళం, ముఖమండపం ప్రధాన భాగాలుగా వున్నాయి గర్భాలయంలో 16 కోణాలు కలిగి పాలిష్ చేయబడిన "బసాల్ట్ రాతి శివలింగం వేదికమీద వుంది గర్భగృహ కుడ్యాలపై వున్న శిల్పాలలో లింగోద్భవమూర్తి, దక్షిణామూర్తి మొదలైన శిల్పాలు పేర్కొనదగ్గవి ఆలయ ప్రాకారన్నంటుకొని 58 గూళ్ళు నిర్మించబడ్డాయి ప్రాకారం వెలుపల శైవ, వైష్ణవ శిల్పాలు మలచబడి వున్నాయి

(బి) వైకుంఠ పెరుమాళ్ ఆలయం - కంచిలోని రెండో ప్రసిద్ధ ఆలయం వైకుంఠ పెరుమాళ్

వైకుంఠ పెరుమాళ్ ఆలయం



ఆలయం. దీని నిర్మాత నందివర్మ (731-96) ఈ ఆలయం కొంత భాగం గ్రానైట్ రాయితోను, కొంత భాగం ఇసుక రాతితోను నిర్మించబడింది విష్ణుమూర్తికి అంకితమైన ఈ ఆలయ గర్భగృహం నాలుగు అంతస్తులలో వుంది మూడు అంతస్తులలో విష్ణుమూర్తి శిల్పం స్థానక, ఆసిన, శయన పద్ధతిలో గమనించవచ్చు గర్భగృహం చుట్టూ ప్రదక్షిణా పథం వుంది విమానపు ఎత్తు 47 అడుగులు ఆలయం చుట్టూ వున్న ఎత్తయిన ప్రాకార లోపలి గోడల మీద పల్లవుల చరిత్రలోని ముఖ్య ఘట్టాలను శిల్పాలుగా చెక్కారు

ఇంకా కాంచీపురంలో పల్లవులచే ఇసుకరాతితో నిర్మించబడిన అనేక ఆలయాలున్నాయి ముక్తేశ్వర, మతంగేశ్వర, ఐరావతేశ్వర, పిరవతనేశ్వర మొదలైనవి ఇతర పల్లవ ఆలయాలు ఇవన్నీ పరిమాణంలో చిన్నవిగా వుంటాయి ఏదైనా ఒక దేవాలయానికి ఒక చిన్న బండపరుపురాయిని దానం చేస్తే దాని నిండా పూర్తి పేరు, విలాసము వ్రాయించుకొని సంతృప్తి చెందుతాం మనం కాని, ఎంతో కాలాన్ని, ధనాన్ని ఖర్చుచేసి కట్టించిన దాతగాని, అందంగా తీర్చిదిద్దిన శిల్పిగాని తన పేరును ఎక్కడా ప్రముఖంగా చెప్పుకోలేదు చెక్కలేదు. ఆ విధంగా నిర్మాణక్రమాన్ని గుప్తంగా వుంచినవారు నాటి రాజులు, శిల్పులు



కైలాసనాధాలయం

ఇతర ప్రాంత ఆలయాలు - చెంగల్పట్టు జిల్లా ఉత్తర యేరూర్‌లో వైకుంఠ పెరుమాళ్, సుందరవరద పెరుమాళ్ ఆలయాల నిర్మాణంలో ఇటుక వాడబడింది అంతస్తులలో నిర్మించిన సుందర వరదపెరుమాళ్ ఆలయంలో వైఖానస ఆగమశాస్త్రంలో చెప్పబడిన విష్ణుమూర్తుల (స్థానక, ఆసిన, శయన, సత్య, అచ్యుత, అనిరుద్ధ నరనారాయణ, నరసింహ, వరాహ) శిల్పాలున్నాయి చెంగల్పట్టు జిల్లా తిరుత్తణిలో వున్న వీరట్టానేశ్వర ఆలయం ఏక తల విమాన ఆలయానికి చక్కని ఉదాహరణ

విదేశాలలో వ్యాప్తి - పల్లవ శిల్పకళ విదేశాలకు సైతం ప్రాకింది ఆగ్నేయాసియా రాజ్యాలలోని కొన్ని నిర్మాణాలలో పల్లవుల శిల్పకళా ప్రభావం చూడవచ్చు. ఉదాహరణకు మలయాలోని "లిగర్" హిందూ దేవాలయాలలో మహాబలిపురం రాతి రథాల ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది ఆ విధంగానే తిరువాసా సమీపంలో పల్లవ శిల్ప శైలిలో మలచబడిన దేవతా విగ్రహాలు లభ్యమైనాయి ప్రపంచ ప్రసిద్ధిగాంచిన అంగ్కోర్‌వాట్ ఆలయ నిర్మాణంలో పల్లవుల వాస్తు రీతులు అనుసరించడం జరిగింది

తీర దేవాలయం



పల్లవరాజుల నిర్మాణాలు నేటికి చెక్కుచెదరకుండా వున్నాయంటే, విశేషమైన సాంకేతిక ప్రజ్ఞ ఈ నిర్మాణాల వెనుక దాగి వుండాలి ఈ ఆలయాలకు ఎక్కువగా వాడిన రాయి ఇసుకరాయి అయినప్పటికి అతి కఠినమైనది కనుకనే తరతరాలకు తరగని సంపదగా విదేశీయులను సైతం ఈ అద్భుత నిర్మాణాలు ఆకర్షిస్తున్నాయంటే అతిశయోక్తి కాదు

వ్యాసం, ఫోటోలు:-
వరికూటి వెంకటసుబ్బారెడ్డి

# జేబురు పొద

డాక్టర్ పి.వి. రమణ

మహాగ్ని గోళంలా నిప్పులు రగిలించిన సూర్యుడు, ప్రతాపం చల్లబడి పడమటి కొండ దిగిపోతూ పొందే వేదనకు, ఆకాశపు అంచు కూడా ఆవేదనతో ఎర్రబడింది ఇహ కొద్ది సేపట్లో ఆవరించబోయే గుబురు చీకటిని చీల్చటానికి వీధి దీపాలు ఒంటి కాలితో కదను చేయబోతున్నై ప్రకృతిలో పెల్లుబుకుతున్న కలకలం తరు శిఖర శాఖల చపల తాండవం

సరిగ్గా ఆ ముని మాపు వేళ, అస్తంగత సూర్యబింబపు అవశేష రూపాన్ని, ఆ రూపానికి, నేపథ్య ఆకృతిలా, అరుణిమ కాంతితో అలంకరించబడ్డ ఆకాశపు కొసను చూస్తున్నప్పుడు ఆ మహానటుడి మనస్సులో, పారాణి నిండిన పాదాలతో, ముద్ద గోరింటాకు ముచ్చటతో మురిసిపోయే అరచేతులతో, నునుసిగ్గు దొంతరల మధ్య ఎర్రబడ్డ పెళ్ళికూతురు బుగ్గలు గుర్తుకొచ్చేవి నవవధువు దరహాసపు విరిజల్లులతో, వలపు హరివిల్లులతో తను వంతా వింత పులకరింతలతో కేరింతలాడేది.

కానీ, ఇప్పుడు అభినయ బ్రహ్మ, వెండితెర రేరాజు ఇత్యాది బిరుదులు ఎన్నో పొందిన ఆ మహానటుడికి, అంధకారానికి ఆధిపత్యం ఇస్తూ, తాను తప్పుకుపోతున్న ఈ అవశేష సూర్యబింబం, ఏదో పెనుభూతంలా, ఛళ్ళుమనబోయే అగ్నిపర్వతంలా కన్పించి, నరనరంలో సలసలమనే నూనె పోసినట్లు, ఏదో అదృశ్య శక్తి నెత్తిన పాదంతో త్రొక్కిపట్టి పాతాళానికి తనను త్రొక్కుతున్నట్లు అన్పించి గిలగిల కొట్టుకోసాగాడు మహానటుడి మనసులో అంతులేని మథన, అవయవాల్లో దాపిడి

నో ఇట్లా జరిగేందుకు వీలులేదు నే జరగనివ్వను "మహానటుడిలో స్వాతిశయం రెక్కలు విదిలించుకొంది. ఆ విశాల భవనం యావత్తూ ఆ విదిలింపు బొబ్బరింపుకు పరిస్పందించింది

'చెప్పు, వాడి వైపు ఇహ ముందు కన్నెత్తైనా చూడనని చెప్పు' మహానటుడి మనసు నిండా విషసర్పాల పూత్కారాలు నిశ్చలంగా చూసింది రేవతి, ధిక్కారంగా చూసింది, ఈసడింపుగా చూసింది

'చెప్పవేం?'

మేం వాగ్దానాలు చేసుకొన్నాం' రేవతి స్థిరమైన జవాబు

"నా కనవసరం, వాడి తండ్రిగా నిన్ను శాసించే హక్కు నాకుంది."

'పరస్పరం ప్రేమించుకొని, మమతలు పంచుకొన్న వాళ్ళను విడిపోండని, సభ్యత, సంస్కారం ఉన్న వాళ్ళెవరు శాసించేందుకు సాహసించరు" నిరసనగా అంది రేవతి

'నే చెప్పినట్లు వినకపోతే నీ గతి ఏమవుతుందో తెలుసా' ఆగ్రహంతో కంపించిపోతూ హెచ్చరించాడు మహానటుడు.

"నేనేం మీ చేతిలోని మరబొమ్మను కాదు, కీ ఇచ్చి మీరాడమన్నట్లు ఆడటానికి, మీ కారు స్టీరింగునూ కాను, తిప్పినట్లు తిరగటానికి, తాళి గట్టించుకొన్న భార్యను అంతకంటే కాదు, తల వొగ్గి బ్రతకటానికి" మొండిగా పల్కింది రేవతి.

మహానటుడి మనసులో భుగభుగలు, ఆవేశపు శగలు, కసితో ఉబ్బిన నరాలు

"సిగ్గు లేదూ నీకు, నాతో శరీర సుఖాల్ని పంచుకొని, వాడి మీద మనసు పడటానికి, మనువాడటానికి" చీత్కారంగా అన్నాడు మహానటుడు

'నిజమే ఈ శరీరం మీ వశమైంది, కాదు; మీ వాంఛకు దాసోహం చేయించుకొన్నారు, అడ్డగించినా, ఏడ్చి మొత్తుకొన్నా విన్నారా మీరు? నా మనసునీ, వ్యక్తిత్వాన్నీ ఉనికి లేకుండా చేశారు అంతేకానీ మన అంతరంగాలు కలిసీ కాదు, మమతలు విరబూసీ కాదు, జీవనాద ఊపిరులు పరస్పరం శృతిగూర్చుకొనీ కాదు, మన కలయిక జరిగింది ఆ విషయం మీకూ తెల్సు"

రేవతి నిస్సంకోచంగా, నిర్భయంగా ఇచ్చిన సమాధానానికి, ఆకాశం విరిగి తన మీదే పడుతున్నట్లుగా, తనను నిలువునా సగానికి ఎవరో చీలుస్తున్నట్లుగా అన్పించి విలవిల్లాడి పోయాడు మహానటుడు గుండెల్ని పిండి చేసే ఈ కొత్త అనుభవం కక్కరానిది, మింగరానిదిగా ఉండి మహానటుడు ఏదో ఊబిలోకి కూరుకు పోతున్నట్లుగా కుమిలిపోసాగాడు

"ఇంతకూ నే చెప్పినట్లు వింటావా లేదా? అసహనంగా మహానటుడు. రేవతి నవ్వింది, విరగబడి నవ్వింది. జలపాతపు హోరులా నవ్వింది. నవ్వి నవ్వి అంది

సమయం మించిపోయింది'

వావి వరుసలు అక్కర్లేదా నీకు?' నిశ్చలంగా మహానటుడి వేపు చూసింది రేవతి

వావి వరుసలా? మీరు ఆ విషయం గూర్చి ప్రస్తావిస్తున్నారా? అందులో నన్ను ప్రశ్నిస్తున్నారా? మా తల్లిని మీ కామాగ్నికి ఇంధనంగా చేసుకొని, అది చాలక నన్నూ మీ దాహానికి నైవేద్యంగా, బలవంతంగా లోబర్చుకొన్ననాడు, ఈ వావి వరుసల ఆలోచన అప్పుడు కలుగలేదా మీకు? కనీసం వయసు అంతరాలైనా గుర్తుకు రాలేదా మీకు? మీరంటున్న ఈ వావి వరుసల్లో, సృష్టి ధర్మాలు మీకేమైనా ప్రత్యేక మినహాయింపులు ఇచ్చాయా?" హేళనగా, ఎకసెక్కంగా గుచ్చి గుచ్చి అడుగుతున్న రేవతిని చూసి కంపించి పోయాడు మహానటుడు అతని శరీరం మంచు గడ్డల మధ్య పెట్టినట్లు మొద్దుబార సాగించి, మనసులో అల్లుకుపోతున్న శూన్యం

'చూస్తా నీ అంతు చూస్తా" తేరుకొంటూ అని వడివడిగా వెళ్ళిపోయాడు మహానటుడు అషామాషిగ్గా అన్నట్లు తేలిగ్గా నవ్వుకొంది రేవతి

సాగర గర్భం నుండి మొలకెత్తింది చంద్రబింబం వెన్నెల వ్యాప్తి చెందింది అయినా మహానటుడి కళ్ళ ముందంతా కాటుక పూతలాటి కటిక చీకటి తన వ్యక్తిత్వాన్ని, పెంచుకొన్న గొప్పతనాన్ని, పేరు ప్రఖ్యాతుల్ని ఏదో కన్పించని శక్తి మొదలంటా తుడిచి వేస్తున్నట్లు, దయనీయమైన స్థికి తనను జారవిడుస్తున్నట్లు కంపించి పోసాగాడు మహానటుడు తన కంటిచూపు తెరల కావల, గాలి గూటిలో, రూపం లేని రూపం నుండి చిమ్ముకొస్తున్న కఠోర సత్యాల నాదాలు పరస్పరం ఢీ కొంటూ శిరస్సులు పగలకొట్టుకొంటున్న గత అనుభవాలు మూలుగుతూ ముక్కుతున్న విషాద, వికార స్మృతులు, మనసును ఎవరో ఆకురాయితో అరగ తీస్తున్నట్లు, హృదయాన్ని ఆర్ద్రవేదనా గిటు రాయితో రాపాడుతున్నట్లు, వేడి కన్నీటితో తన శరీరాన్ని అంతిమ స్నానానికి సన్నద్ధం చేయిస్తున్నట్లు ఎవేవో తన్నుకొంటూ బయటకొస్తున్న నిట్టూర్పుల క్షోభలు,పొగల పొగలి రగులుతున్న పరితాప అగ్నికణాలు మహానటుడు తల పట్టుకొన్నాడు, కలో, నిజమో తెలియని అస్తవ్యస్త స్థితిలో అల్లకల్లోలం కాసాగాడు

పైన చుక్కలు ఫక్కుమన్నాయి, ఆకాశం అవహేళనగా, వికృతంగా మెరుపు వారిని సంధించింది మహానటుడి అంతరంగంలో రంపపుకోత, విచ్చుకొంటున్న పుటలలో విషాదంగా దర్శనమిస్తున్న తన గతం తాలూకు ఛాయలు పాపచింతనలేని, కట్టుబాట్ల పరిధి లేని తన అహంకార ప్రవర్తనకు ఎందరు అడుగంటా ఆహుతైపోలేదు? మరెందరి వర్ధమాన నటీనటుల మానసిక హత్యలకు, నిరాశా నిట్టూర్పులకు తాను లోపాయికారిగా కారణభూతుడు కాలేదు? వాళ్ళ

భవిష్యత్తుపై బలవంతంగా మేకులు నాటలేదు? ఇంకిపోయాయనుకొన్న ఆ జ్ఞాపకపు పొరల్నుండి మూగవోయిన వాళ్ళ చీకటి నైరాశ్య రోదల్నుండి, రోదనల్నుండి పునరుద్ధానం చెంది, తిరిగి అంకురిస్తూ, తన గుండెను పిండి చేస్తున్న ఆ ఆర్తనాదాలు శాపనార్థాలు. ఓహ్. ఎంత దారుణం? ఎంత అమానుషం? ఆ ఆర్తనాదాలే తన మనసును పేల్చి వేస్తున్నట్లు, పగతో, కక్షతో తన రక్తాన్నే గడ్డ కట్టిస్తున్నట్లు, అణగారిపోతాయనుకొన్న ఆ ఆక్రందనలు, ఇప్పుడు విజృంభించి, వికటాట్టహాసంతో, ప్రచండ ఘోషల సెగల మధ్య తన్ను కట్టిపడి వేస్తున్నట్లు విలవిల్లాడసాగాడు మహానటుడు అతని మనసులో మహాసంగ్రామం మరగిన మానవ రక్తం, గడ్డ కట్టిన కన్నీరు చైతన్యమై, ఏకమై చేస్తున్న దాక్షిణ్యరహిత సంగ్రామం. ఊపిరి సైతం తీసికోనివ్వని సంగ్రామం. విస్మరించిన గతాన్ని, ఆ గతం తాలూకు విషాదాన్ని తొడిలాగుతూన్న సంగ్రామం, మహానటుడి నవనాడులూ పిండుకుపోతున్నై.

ఈ చిత్ర పరిశ్రమలో తానధివశించిన ఎదురులేని, అగ్రస్థానం ముందు మిగతా నటినటులు దిష్టిబొమ్మల్లానే దిగాలు నిలబడి ఉండాలనీ, తన అనంత ప్రస్థానానికి పహరా కాస్తూ, తనకు మోకరిల్లితూ, వొదిగి వొదిగి ఉండాలనీ, తన అడుగులకు మడుగు లొత్తుతూ, తన కనుసన్నల్లోనే కాలం వెళ్ళదీసే ఒట్టి వాజెమ్మల్లాగా, వానపాముల్లాగా మిగిలిపోవాలనీ,. . ఒకటేమిటి? ఎంత అహంకారం తన కానాడు? ఎంత అమానుషం, ఎంత బండబారినతనం తనలో అనాడు? పురుగును ఆకర్షించే దానికి అందంగా గూడువల్లే సాలెపురుగు గుర్తుకొచ్చి ఉలిక్కిపడ్డాడు మహానటుడు గతం అతని గుండెను పెళ్ళగిస్తూ ఉంది ముద్ద కట్టుకుపోయిన ఆ గతం నుండి ఏవేవో వికార విన్యాసాలు, తన నిర్లజ్జ, నీతిబాహ్య ప్రవర్తన తాలూకు మెరుపులు, తన నిరంకుశత్వ పోకడ తాలూకు రేఖలు మహానటుడి మనోగతం ముందు

ప్రతి సహనటిలోనూ అనాడు తనకన్పించిందేమిటి? అభినయ ప్రమాణాలు కావు, నవరసభావ విన్యాసాలు కావు, మరేమిటి? అధరాలు, అవి జాలువార్చే మధువులు, మైమరపింపులు, ఆ మైమరింపుల కోసం తన ఉరుకులాటలు, వక్షోజాలు, వాటి మనోహర కదలికలు, ఆ కదిలికల్లో తన కోరికల్ని పండించుకోవాలనుకొంటూ తనలో రేగే ఆరాటాల పరవళ్ళు, తన మనసు రసికతతో కూరుకుపోయి, కాముకతతో నరనరం మధించుకుపోయి, మోహంలో, వ్యామోహంలో తన అణువణువూ వివశత్వమై పోయినప్పుడు, నయానా, భయానా వాళ్ళను లొంగదీసుకోగలిగాడే గానీ, వాళ్ళ మనసును, ఆ మనసులోని అలజడిని, కంపించే కళ్ళలోని దీనతను తాను గ్రహించగలిగాడా? సెట్స్‌లో 'చెల్లీ, చెల్లీ' అంటూ పిలుస్తూనే, షూటింగ్ పూర్తయిన తర్వాత, రాత్రికి






# జీబురు పొద

తనలో పలవరించే కోరికల విందుకు సిద్ధంగా ఉండమని ఆజ్ఞలు జారి చేస్తున్నప్పుడు, ఆ యువతి కళ్ళల్లో అంతవరకు కన్పించే ముగ్ధత, ప్రఫుల్లత మటుమాయమై, ఆస్థానంలో అల్లుకుపోయే అలజడి, ఆవేదన, చేతగానితనం, ఆందోళన తాను పట్టించుకొన్నాడా ఇన్నాళ్ళూ? తన కోరికను తిరస్కరించిన ఎందరు, నటీమణుల్ని, ఈ ఫిల్ము నుండి శాశ్వతంగా దూరమైపోయేట్లు చూడలేదు తాను? తనలో మానవతా స్పందన లేదు, కనీసం ఆ చాయ కూడా లేదు, సాంప్రదాయ చింతనా స్పర్శలు లేవు, వావివరుస పట్టింపులు లేవు, ఎంత వికార మనస్తత్వం తనది? ఎంత దయారహిత ప్రవృత్తి తనది!? ఎంత పతనావస్థ తనది!? తను నీతి నియమాల్ని దెబ్బ తీసి, ఏడు నిలువుల గోతిలో పాతి పెడితే, తిరిగి ఆ నీతి నియమాలే చైతన్యమై, పెళ్ళగించుకుపోయి తనను దెబ్బ తీస్తున్నాయి ప్రస్తుతం, మహానటుడి శరీరం ఒక్కసారిగా జలదరించింది, జ్వాలలా దహించి వేస్తున్న ఆత్మక్షోభ, మృత్యు ప్రతినిధిలా ఆహ్వానిస్తున్న ఏదో కఠోర సత్యం తాలూకు బలీయ హస్తం, బ్రష్టుపట్టి పోయిన తన నీతిబాహ్య ప్రవర్తన, స్వార్థ సంకుచిత ప్రేరణల రణగొణల బయంకర ధ్వనులు పరిసరమంతా మహా నిద్రావస్థలో,తన ఉక్కు పిడికిల్లో తనకు తానే బిగించి వేసిన అన్ని నైతిక ధర్మాలు, వెలికి వచ్చి లయకాల ప్రళయ గీతాలు వల్లిస్తున్నట్లు తన నాలుక పైన నెత్తుటి ముద్ర లేస్తూ మోష పెడుతున్నట్లు తన పైనే ధ్వజ మెత్తి స్వారి చేస్తున్నట్లు అన్పించి వణికి పోసాగాడు నిలువెల్లా మహానటుడు ముఖం కందగడ్డలా మారింది, అంతరంగం ఆత్మాహుతికి వేదికలా ఉంది మనసు నిస్సహాయంగా, నిశ్శబ్దంగా రోదించసాగింది, మానవత్వాన్ని, మంచితనాన్ని తన నిరంకుశ, అహంకార, కర్కశత్వ దోరణితో అణిచి పెట్టి ఉంచిన తన సంకుచితత్వ ప్రవర్తన, తన మీదే తిరగబడుతూ ఉంది తన భవిష్యత్తుకే గాక, తన జీవితానికే భరత వాక్యం పలకబోతూన్నట్లు, తన ఆధిపత్యాన్నే ముక్కలు చెక్కలు చేయబోతున్నట్లు, తన పాపకార్యాలకు పడికట్టు రాళ్ళు సిద్ధం చేసి ఉంచినట్లు, భావించి, అనంతమైన వ్యధా బరువు మోస్తున్న అపరాధిలా అణగారి పోయాడు మహానటుడు, ఇప్పుడతని కళ్ళ ముందు పున్నాగ పూలపాన్పుల్లేవు, పర్చుకొన్న వెన్నెల జాలుల్లేవు పన్నీటి జల్లుల చిలుకరింతల్లేవు, అంతా చీకటి, వెలుగు జాడే లేని కటిక చీకటి నిట్టూర్పులు ఉధృతమై అతని చాతీ ఎగిసి పడుతున్నది కనురెప్పలు జీవం లేనట్లు వాలిపోతున్నాయి, అతని మనసులో తెలియని ఏదో కోత, ఇరుకు, ఇబ్బంది, తీర్చరాని వెలితి, శరీరం చీల్చుకు పోతున్నట్లు, కణతలు నొక్కుకుపోతున్నట్లు, నరనరమూ శక్తి హీనమై పోతున్నట్లు, ఈ జీవితమే ఓ శాపంగా మారిపోయినట్లు కృంగిపోసాగాడు మహానటుడు. భయం, ఆందోళన, జుగుప్స, దిగులు, నిరాశ అతణ్ణి కుళ్ళగొట్టి కూల్చ వేయసాగాయి అతని మనోనేత్రం ముందు గతం చేస్తున్న వివేక వ్యాఖ్యానం ఆ రోజున మూడు దశాబ్దాల క్రితం తను తొలిసారిగా తండ్రి కాబోతున్నాడని తెల్సినప్పుడు, తన హృదయంలో పొంగిన పరవశత్వం, కళ్ళల్లో ప్రవహించిన కాంతి తరంగం, సృష్టిలో తన కవగతమైన పరమార్థం భార్య ముఖంలోని సిగ్గు దొంతరలు బుగ్గను పూసిన ముద్ద మందారాలు, కనకాంబరాలు, పెదాలపై దాగుడుమూతలాడే పగడాల విన్యాసాలు, ఎన్నెన్ని అనుభూతులు .మరెన్నెన్ని మధుర మురిపాలు తనలో, తను జన్మనిచ్చిన ఆ కొడుకే ఇప్పుడెందుకింతగా క్షోభ, వేదనల్లో తనను ముంచి వేస్తున్నాడు? గుండెల్లో కల్లోలాన్ని సృష్టిస్తున్నాడు? తన రక్తాన్ని పంచుకొని, తాను పెంచుకొచ్చిన ఐశ్వర్యంతో వైభవంతో వెలిగిపోతున్న తన కొడుకు ఈ నాడు ఎందుకింత విశ్వాస హీనంగా, గౌరవ రాహిత్యంగా ప్రవర్తిస్తున్నాడు? మురిపెంగా, అనురాగంగా చూసుకొంటూ వచ్చిన తన కొడుకే, ఎందుకు తన బ్రతుకును అపస్వరాలతో రసహీనం చేయబోతున్నాడు, విషాద నీడల వినాశాగ్నికి ఆహుతి కావాలని కోరుకొంటున్నాడు? ఇప్పుడు వీడి మొండితనం వల్ల, సిగ్గులేని ప్రవర్తన వల్ల ఈ ఫిల్ములో తన స్థానమే కాదు, తన బ్రతుకే కొండెక్కి పోయేట్లుగా ఉంది. వాడి పట్ల తన భ్రాంతులన్నీ వికా వికలై చీలికలు పేలికలై ఇంత విచ్చలవిడి వ్యసన విశృంఖలత్వం ఇంత స్త్రీ వ్యామోహం వీడి కెట్లా అబ్బాయి? ఎవరు నేర్పారు? ఒకవేళ వారసత్వంగా తనను జూసి మహానటుడి శరీరం జలదరించింది ఒక్కసారిగా నరనరాల్లో నిప్పు శిఖల భగభగలు

"నువ్వు రేవతిని కల్సుకోగూడదు, అది కల్సినా కన్నెత్తి దాని వైపు చూడకూడదు." హుంకరించాడు మహానటుడు

"ఆజ్ఞాపిస్తున్నారా డాడీ" అధిక్షేపిస్తూ అడిగాడు కొడుకు

"ఆఖరిసారిగా హెచ్చరిస్తున్నాను '

అనుబంధాల్ని, సృష్టి ధర్మాల్ని మీ శాసనాల్తో నిరోధిస్తారా?"

"షటప్, నీ బోడి బోధనలు నా కనవసరం నీ కోసం, ఉజ్వలమైన నీ భవిష్యత్తు కోసం రాత్రింబగళ్ళు స్టూడియోల్లో మగ్గి చచ్చాను తిన్నా తినకపోయినా, ఆ ఆలోచనే లేక తరతరాల మీ సుఖ సంతృప్తుల కోసం కూడబెట్టాను. అలుపూ, ఆటవిడుపూ లేక అహర్నిశలూ శ్రమించాను ఎందు కొరకురా? ఎవరి కొరకురా? నాలాగా గానుగెద్దులా నీవు బ్రతక్కూడదని, అర్థమైందా?"

నిరసనగా నవ్వాడు కొడుకు తలెత్తి తండ్రి వంక ధీమాగా చూస్తూ అన్నాడు.

"మీరు ఎన్ని తంటాలుపడ్డా, నా మనస్సాక్షికి విరుద్ధంగా పోలేను"

"అంటే"

'ఇచ్చిన మాట ప్రకారం రేవతిని పెండ్లి చేసుకుతీర్తాను

మహానటుడి ముందు మళ్ళీభూకంపం, ఆకాశం తన మీదకి విరిగిపోతున్నట్లు, తన గుండెనెవరో నిప్పుల కొలిమిలో పెడుతున్నట్లు, మనసునెవరో రంపపు కోత కోస్తున్నట్లు అతని అహాన్ని, అదృష్టాన్ని అవలికి గెంటేసిన, ఎండిపోయిన ఆత్మీయత తాలూకు ఆర్తనాదాల తాలూకు స్మృతుల ఛాయలు ముఖాన్ని మ్లానం చేస్తుంటే, తన జీవితం చిద్రువలు చిద్రువలై, ఛిన్నాభిన్నమైనట్లు అన్పించి, రెక్కలు తెగిన పక్షిలా క్షణకాలం అల్లాడి పోయాడు మహానటుడు

క్రమంగా అతని గుండె ఆగ్రహంతో, అసంతృప్తితో గుప్పుమంది. నిర్వేదం, నిట్టూర్పులు మటుమాయమై మనసులో అసహనం, ఆవేశం చోటు చేసుకున్నాయి మహానటుడు శివమెత్తి శివతాండవం చేస్తున్నట్లు, ఉగ్రరూపంలో ఒక్క అంగలో కొడుకు ముందుకు దూకాడు కొడుకు రెండు చెంపల మీద ఎడా పెడా అలుపొచ్చేంత దాకా వాయించాడు

'చర్మం వొలిచేస్తా వెధవా ఈసారి రేవతిని కల్సుకుంటే, నా కడుపున పుట్టి నా కడుపుకే చిచ్చు పెడతావా రాస్కెల్ అది బరితెగించింది నీతి నియమాల్ని విడిచివేసింది అటువంటి దాని వల్లో పడతావా? మళ్ళీ మీరు కల్సుకున్నట్లు నాకు తెలిస్తే ఇద్దరినీ సజీవంగా పాతేస్తాను, జాగ్రత్త' ఆవేశంతో హెచ్చరించాడు మహానటుడు

ఈ హఠాత్పరిణామానికి మొదట్లో విస్తుపోయాడు కొడుకు తర్వాత తేరుకొని నిరసనగా తండ్రి వైపు చూశాడు

"కన్నకొడుకు మనసారా కోరుకొనే స్త్రీతో వివాహ విషయంలో కూడా ఆంక్షలు పెట్టి అడ్డగించే తండ్రిలోని రాక్షసత్వం, క్రూరత్వం, ఎంతటిదో తెలిసొచ్చింది.

తిరస్కారంగా తండ్రి వైపు చూసి వడివడిగా వెళ్ళిపోయాడు కొడుకు

మహానటుడు క్షణకాలం కొయ్యబారిపోయాడు అతని గుండె తో డినకొద్దీ వూరే చెలమలా, నిరంతర క్షోభకు నిలయంలా అయింది జీవితంలో మొదటిసారిగా అతని కన్నుల్లో కన్నీటి సుదులు నాసికా రంధ్రాల్నుండి వెచ్చని ఆవిరులు మనసులో అగాధ సాగర కెరటాల అనంత ఘోష మహానటుడి చుట్టూ అల్లుకుపోతున్న భయంకర శూన్యం ఛిన్నమైన జీవితంలో ఇప్పుడు మిగిలింది పూడ్చరాని వెలితి ఆ వెలితి నుండి నిరంతరం పొంగుకొచ్చే అశాంతి, ఆవేదన తన బ్రతుకు ఎందుకింతగా బోర్లాపడిందో, వర్తమానం తనపట్ల ఎందుకింతగా దయారాహిత్యంగా ఉందో వెలుగునిచ్చే ద్వారాలన్నీ ఎందుకు మూసుకుపోయి, తన భవిష్యత్తు చీకటి చిచ్చుకు ఎరైపోతూ ఉందో, జీవన మృత్యు తీరాల మధ్య గజిబిజిగా, నిస్త్రాణగా, అనాసక్తిగా, తనను చరమసంధ్యకు చేరువజేస్తున్న ఈ ఆపశృతులకు, సుడిగాడ్పులకు, విహ్వల ధైన్యానికి మూలకారణం ఏమిటు?లయబద్ధం పూర్తిగా అదుపు తప్పిన ఈ జీవన స్థితికి తనకు తానే కారకుడా? రక్తి విరక్తుల, ఆకర్షణ వికర్షణల ఆటుపోటుల్ని తనంతటతానే ఆహ్వానించు కొన్నాడా? నియమాల్ని, విధి నిషేధాల్ని, స్వాయత్తంగా విసర్జించివేసినందుకేనా తనకీ దారుణ స్థితి ఈనాడు? పరిష్కార శూన్యమైన సమస్యల సాలెగూళ్ళ వంటి ఆలోచనలు మహానటుడ్ని ఓటమి వైపుకు ఈడ్చుకు పోతున్నాయి నివృత్తి లేని మనోవిశ్లేషణతో శృంగభంగానికి గురిచేస్తున్నాయి. మహానటుడి అంతర్జగత్తును భయానకం చేస్తున్నాయి

ఇప్పుడు రేవతి మనసులో కొచ్చిన కొద్దీ, మహానటుడి మనసులో కంపరం, నిలువునా చీల్చివేయాలన్నంత ఆవేశం

ఆనాడు నగ్నంగా ఉన్న నీలాకాశం, మురుస్తున్న నక్షత్రాలు, పరవశంతో ప్రవహిస్తున్న మల్లెల గంధం, వెండి వలువలు ధరించిన భూమి. సృష్టి వెన్నెలకు వాకిళ్ళు తీసిన ఆ సమయంలోనే తొలిసారిగా తనకుదాసోహమైంది. రేవతి. ఒకరి ఒడిలో ఒకరుఅన్నంతగా ప్రచారమైంది తమ అనుబంధం తమ బంధం అన్ని అడ్డు తెరలూ తొలగించుకొంది. అడ్డగించాలనుకొన్న రేవతి తల్లి అనాధగా మిగిలి, ఆ తర్వాత తమ దయా దాక్షిణ్యాల మీదనే బ్రతుకును నెట్టుకురాసాగింది ఒకానొకప్పుడైనా రేవతిని హెచ్చరిస్తూనే రాసాగింది తల్లి

"రేవతీ నన్నూ ఇట్లానే మొదట్లో ఏవేవో ఆశలతో, బులిబుచ్చుకాలతో, అమృతపు జల్లు వంటి మాటల్తో వశపర్చుకున్నాడు నా చుట్టూ మమతల పందిళ్ళు వేశాడు. ఆ తర్వాత, తన తపన కోర్కెలు తీర్చుకొన్నాక, అతి క్రూరంగా, తనకు కన్పించనంత దూరంగా నెట్టివేశాడు ఎందుకైనా మంచిది నీ జాగ్రత్తలో నువ్వు ఉండటం మంచిది" తల్లి మాటలు విన్న రేవతి మందహాసం చేసింది

అమ్మా కాలం మారింది ఎవర్ని, ఎప్పుడు ఎట్లా బిగించాలో నాకు తెల్సు" చేసేది లేక, చేవలేక మౌనం దాల్చింది తల్లి

ఒకానొక రాత్రి. మహానటుడు తన సర్వస్వాన్నీ ఆరాటంతో ఆక్రమిస్తున్న తరుణంలో

"ఈ వయసులో మీకిన్ని కోరికలా?' గునిసినట్లుగా అడిగింది రేవతి

ఇది నా శక్తి కాదు. దాన్ని కవ్వించిన నీ అందం కళ్ళు చెదరగొట్టే నీ వంటిసొంపులు నాది అనుభవం, నీది అనుభావం ఇద్దరిదీ కలిపి ఈ అనుభూతి నీలాటి కుర్రదాన్ని రసికతలో శిఖరం ఎక్కించటానికి నాలాటి వాడే అవసరమన్న విషయం మర్చిపోకు" ఆ తన్మయత్వంలోనే నవ్వింది రేవతి వెండిని పిండి చేసి ఊదినట్లు వెన్నెల ధారై కురిసినట్లు

# ఇ.వేమన.పద్యాలు




పులియదెట్టిదన్న భూలోకమృగరాజు
కలియదెట్టిదన్న గానరారు
పులియు కలియుకన్న భువి నాకలియె హెచ్చు
విశ్వదాభిరామ వినురవేమ

## జీబురు పొద

రేవతిలో అయస్కాంత చూపులేకాదు. ఆలోచనలూ ఉన్నాయి. అభిలాషలున్నాయి. "ఏమిటీ జీవితం?" అని విలపించిన రాత్రులు లేకపోలేదు రేవతికి. అయినా ఆ విలాపాలకు, విషాద అనుభవాలకు ఆన్సర్ దొరకదనీ, ఈ ఫీల్డులో తారాపథం అందుకొనేంత వరకూ తానొక"ధర్మసత్రంలా" మనుగడ సాగించక తప్పదనీ ఆమె గ్రహించగలిగింది. అవతలవాడు అడిగినవన్నీ ఇవ్వాలి. మరోమారు అడక్కముందే కవ్వించి మరీ ఇవ్వాలి. ఇవ్వకుంటే తన తల్లి అనుభవంలా, తన మనుగడా ఈ ఫీల్డులో అర్ధంతరంగానే ముగిసిపోతుంది. ఇప్పుడు మహానటుడి విషయంలో మరీను. సాటిలేని స్థానంలో ఉన్న అతని కోరికను తిరస్కరిస్తే, ఈ ఫీల్డ్‌లో తన స్థానానికి తానే తిలోదకాలు ఇచ్చుకోవటమే అన్న సత్యం ఆమెను కీలుబొమ్మగా మార్చింది. తన తల్లినీ ఒక మహానటిని చేస్తానంటూ ఆకట్టుకున్న ఈ మహానుటుడే, అదే పథకంతో, అదే వ్యూహంతో తననీ లొంగదీసుకున్నాడు. వావివరుసలు లేని ఈ బంధాలు ఆదిలో ఎంతో క్షోభ కలిగించేవి రేవతికి. నీతి, నియమాలు తమ, మార్గదర్శక దీపాలను తమకుతామే ఆర్పివేసుకొన్నట్లుగా అన్పించి ఆవేదన చెందేది. ఇంత పతనం జరుగుతున్నా, ఈ సృష్టి మైనంలా మారి, ఎందుకు కాలిపోదోనన్న ఆశ్చర్యం రేవతిని నీడలా ఆవరించి ఉండేది. కోరినవన్నీ అందుతై ఈ ఫీల్డులో కుడి ఎడమల మినహా. ఒక్క నిజాయితీ మినహా. సిరులు రాశులుగా పేర్చుకోవచ్చు.

అంతరంగ స్వచ్ఛతను తప్ప. ఆ నిజాయితీ, స్వచ్ఛతలే తనలో రేపుతున్న కల్లోలం రేవతి గ్రహించగల్గుతున్నది. తనను బిగించి పట్టుకున్న కీర్తికాంక్ష పిడికిలి నుండి తప్పుకురావాలని తపించిపోతూ వుంది. వేలాదిమందిని వెర్రెత్తించే తన అందం, అభినయం, వయ్యారాల మాటున తన ముసుగు కాలక్షేపం, నీతిబాహ్యమైన మురికి జీవితం ఆమెకు విసుగు కల్గిస్తున్నది. ప్రస్తుతం, ఈ మనస్తత్వం తనలాంటి దానికి మింగుడుపడదు. ఈ వంచనను, సాంప్రదాయ రాహిత్య విచ్చలవిడి జీవితాన్ని తాను భరించలేదు. భరించినా శాంతిగా బ్రతకలేదు. నిరంతరం తాను చేసిన ఘోరాన్ని, ఆ ఘోరం రాల్చే నిప్పు కణికల్ని, క్షణం క్షణం చల్లార్చుకొంటూ, అడుగడుగులో నాటబడ్డ కత్తుల్ని దాటుకుంటూ, తనను తాను సముదాయించుకొంటూ, మనుగడ సాగించడం దుర్భరం. రేవతి మనసులో హోరు. ఆవరించుకొన్న భ్రష్ట జీవితం తాలూకు అంధకారాన్ని చీల్చుకుని, అనంతమైన స్వచ్ఛమైన వెలుగులోకి రావాలన్న ఆరాటం ... ఇది చాలదన్నట్లుగా మహానటుడి వంశోద్ధారకుడు తనమీద పిచ్చి వ్యామోహంతో, అదుపులేని ఆరాటంతో తనను వెన్నంటి తిరగటం, తన ప్రేమకై, పొందుకై ప్రాధేయపడటం రేవతిలో విచిత్రమైన అలజడిని కల్గించింది. మొదట్లో, మహానటుడు తనకూ, తన తల్లికీ చేసిన అపచారానికి ప్రతీకారంగా, అతని కొడుకుకు తనపై ఏర్పడ్డ ఆరాధనా భావాన్ని, వ్యామోహాన్ని పెరగనిచ్చి, తద్వారా ఆ మహానటుడికి బుద్ధి చెప్పాలనుకున్నది నిజమే అయినా, ఆ ప్రతిక్రియ ఆచరణలో సామాజికపరంగా, నైతికపరంగా వావివరుసల దృష్ట్యా తానెంత అధోగతిపాలయ్యేది అవగాహనకొచ్చేకొద్దీ నిలువెల్లా కంపించిపోసాగింది రేవతి. తండ్రిలో ఉన్న అహం, స్వార్థం, వెర్రి కామోద్రేకం కొడుకులో లేవని పసిగట్టగలిగినా ఈ అనుబంధానికి, నియమ రాహిత్యమైన ఈ వివాహానికి ఆమె మనస్సు ఎదురు తిరుగుతూ ఉంది ప్రస్తుతం. ఆయన కొడుకును వివాహమాడి, మహానటుణ్ణి సాధించట మటుంచి, క్షణక్షణం తాననుభవించే క్షోభ, నీతిని, సాంప్రదాయాల్ని, కట్టుబాట్లను, వావివరుసల్ని తూనా బొడ్డుంచాలుగా తృణీకరించి, తానందుకోబోయే అస్తవ్యస్త జీవితాన్ని, ఆ జీవితం తనకేర్పరిచే పాలరాతి సమాధిని తల్చుకొనికంపించిపోసాగింది రేవతి. ముందు తరాల భవిష్యత్తు కోసమైనా ఈ వివాహానికి తాను తలొగ్గరాదు. తమ ఇరువురి మనసులు, మమతలు ఏకోన్ముఖమైన భారతీయ సాంప్రదాయ విరుద్ధమైన ఈ వివాహానికి ఆమె మనస్సు అంగీకరించలేదు. కలవరపడసాగింది. మహానటుడికి ఆమె రాసిన లేఖ "నటశిఖామణికి నమస్కారాలు మీ ఆజ్ఞను, అధిక్షేపాన్ని నేను లెక్కచేయుటలేదు. కాని మహోన్నతమైన భారతీయ సంస్కృతిని కాపాడాలని ఈ సినీ ప్రపంచాన్ని వదిలి అజ్ఞాతములోనికి వెళ్ళిపోదల్చుకున్నాను. అంధకారంలో బ్రతకదల్చుకున్నాను. ఈ అంధకార జీవితంలోకి మీ కుమారున్ని ప్రవేశించకుండా ప్రయత్నము చేసుకోండి. ఇవే నా తుది నమస్కారాలో తిరస్కారాలో మీరే అర్థం చేసుకోండి. - రేవతి". □

# విశృంఖలంగా సాగే వేటకు బలైపోతున్న వన్యప్రాణులు



శౌర్యానికి మారు పేరు మృగరాజు

ఒకప్పుడు వినోదంకోసం, గొప్పతనంకోసం పూర్వపు రాజులు పులులను, సింహాలను, అడవి జంతువులను వేటాడేవారు కానీ, ఈనాడు మానవుని స్వార్థానికి అడవి జంతువులు బలైపోతున్నాయి మన రాష్ట్రంలో నేకాదు, దేశంలో ని అనేక అడవులలో అడవి దున్నలు, దుప్పులులాంటి వన్యజీవుల వేటసాగుతోంది

గత కొన్ని దశాబ్దాల క్రితం వరకు మనదేశంలో ని అడవులలో స్వేచ్ఛగా సంచరించిన మచ్చల జింకలు, లేళ్ళు ఇటీవల అరుదుగా మాత్రమే కనబడుతున్నాయి అందమైన వీటి చర్మాలకోసం ఇవి వేటాడబడినాయి మనరాష్ట్రంలో ని అడవులలో ఈ జింకలు మచ్చుకైనా కనబడటంలేదు

వాణిజ్య రంగంలో దంతపు వస్తువుల గిరాకిని బట్టి విలువైన దంతాల కొరకు ఏనుగులు వేటకు గురికావడంవలన, ఏనుగులకు ఆలవాలమైన ఒకనాటి రాయలసీమ అడవుల్లో ఈ రోజు ఏనుగులజాడ కూడా లేకుండా పోయింది

ఓ శతాబ్దం క్రితం ఉత్తరాది అంతటా మంద ల మందలుగా విహరించిన ఖడ్గమృగాలు, వాటి కొమ్ములతో సొమ్ము చేసుకోవడానికి (ఒక కిలో ఖడ్గమృగం కొమ్ములు ఎనభైవేల రూపాయలు



విహంగావలోకనం

ప్రకృతి ముద్దుబిడ్డలు ఈ కన్నెలేళ్ళు



ఖరీదు ఉంటాయి) మానవుడు స్వార్థంతో విచక్షణారహితంగా వీటిని వేటాడి చంపడం వలన, ఈనాడు అస్సాంలో ఉన్న ఖడ్గమృగ రక్షిత ప్రాంతాల్లో వీటిని రక్షించుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది ఒరిస్సాలో ని "శిమిలిపాల్ వన్య సంరక్షణా కేంద్రం" (మయూర్ భంజ్ జిల్లాలో ని అభయారణ్యాలు)లో కూడా ప్రతి ఏటా ఆచారంగా 'అఖండ షికార్" అనే జంతుమారణకాండ జరగడం శోచనీయం ఒకప్పుడు మధ్యభారత దేశమంతా యదేచ్ఛగా సంచరించిన సింహాలకి, ఈనాడు గుజరాత్‌లో ని గిర్" అభయారణ్యాలే శరణ్యమై అక్కడే జీవనం కొనసాగిస్తున్నాయి

1930 నాటికి మనదేశంలో 40.000 పెద్ద పులులు ఉండేవి అత్యంత విలువైన ఈ పులుల చర్మం కోసం (9 అడుగులున్న పెద్దపులి చర్మం షుమారు 12.000 రూపాయల ధర పలుకుతోంది ) ఆ తర్వాత కొన్ని దశాబ్దాల కాలంపాటు సాయుధులైన వేటగాళ్ల ఘోరమైన మారణకాండకు బలైపోయిన ఈ పులుల సంఖ్య బాగా క్షీణించిపోయింది 1972 నాటికి దేశం

మొత్తం మీద 1,827 పులులున్నాయంటే వీటి సంఖ్య ఎంతగా క్షీణించి పోయిందో మనం ఊహించుకోవచ్చు! 1972లో "ప్రాజెక్ట్ టైగర్" పథకం క్రింద ఈ పెద్ద పులుల వేటను నిషేధించారు. 1979 నాటికి దేశవ్యాప్తంగా ఈ పులుల సంఖ్య 2,500 మాత్రమే ఉందని అంచనా వేశారు. "ప్రాజెక్ట్ టైగర్" పథకం క్రింద వీటిని పరిరక్షిస్తున్న ప్రపంచ వన్యమృగ పరిరక్షణ సంస్థకృషి ప్రశంశనీయం. ఈ కృషి ఫలితంగానే మనదేశంలో పులుల సంఖ్య ఇటీవల కాలంలో పెరిగింది. ప్రస్తుతం దేశం మొత్తం మీద వీటిసంఖ్య మూడువేలు వరకు ఉంది.

చిరుతపులి చర్మం ఖరీదు 5,000 రూపాయలు ఉండటంవలన, అందమైన వీటి చర్మం కోసం విదేశీయులు ఎక్కువగా మోజు పడటంవలన (వీటి చర్మాలను స్త్రీలు ధరించే కోట్లుగా తయారు చేసేవారు) విస్తృతంగా ఇవి వేటాడబడినాయి. తత్ఫలితంగా మనదేశంలో చిరుతపులులు పూర్తిగా అదృశ్యమైపోయినాయి. ఈ వేట పుణ్యమా అని అత్యంత ఆకర్షణీయమైన మచ్చల చర్మంగల "స్నో లియోపార్డ్" అనే చిరుతపులి పూర్తిగా అంతరించిపోతే; "కస్తూరి మృగాలు" (ఒక జాతి జింకలు) కనుమరుగైపోతున్నాయి.

మొసళ్ళ చర్మానికి; కొండచిలువల, పాముల చర్మానికి కూడా మంచి గిరాకీ ఉండటంవలనే వీటి చర్మాల అక్రమ వ్యాపారం కొనసాగుతోంది.

ఇక పక్షుల్లో ఎన్నో జాతుల నీటిపక్షులు బాతులు; కొంగలు; కోయజాతి; గిరిజన జాతి ప్రజల దారుణమైన వేటకు బలైపోతున్నాయి. కృష్ణా, గోదావరి లోయ ప్రాంతాల్లో విస్తారంగా ఉన్న 'బట్టమేక పక్షులు' నిర్దాక్షిణ్యంగా వేటాడి చంపబడ్డాయనడానికి – తార్కాణం- ఈ పక్షులు దాదాపుగా అంతరించిపోవడమే! కొల్లేరు సరస్సు; నెల్లూరు జిల్లాల్లోని పులికాట్ సరస్సులాంటి ప్రాంతాలను పక్షుల సంరక్షణ కేంద్రాలుగా ప్రకటించినా, ఈ సరస్సులకు వలస వచ్చే పక్షుల వేట నిరాటంకంగా కొనసాగుతూనే ఉంది. కొల్లేటి కొంగలకు; రకరకాల నీటి పక్షులకు, నీటి బాతులకు నిలయమైన కొల్లేరు సరస్సులో ఇటీవల ఈ పక్షులు చాలా తక్కువగా మాత్రమే కనబడుతున్నాయి.

దేశవ్యాప్తంగా 61 రకాల క్షీరదాలు (పాలిచ్చే జంతువులు) 38 రకాల పక్షులు అంతరించిపోయే స్థితిలో ఉన్నాయంటే నిరంతరం కొనసాగే ఈ వేట పర్యవసానమే నన్నది నగ్న సత్యం.

1972 నాటి వన్య మృగ సంరక్షణ చట్టం వన్యప్రాణుల వేటను అరికట్టడంలో సఫలీకృతం కాలేకపోయిన దనడం సమంజసమే అనిపిస్తుంది. ఒక ప్రక్క ప్రతి సంవత్సరం వన్యప్రాణి సంరక్షణా సన్నాహాలు జరుపుకొంటున్నా; మరో ప్రక్క వేట కోలాహలాలు కొనసాగుతూనే ఉన్నాయి.

శాస్త్ర విజ్ఞానం ఎంతగా పురోగమించినా, అంతరించిపోయిన జంతు జాతిని సృష్టించలేమన్న



పౌరుషానికి ప్రతీక, పెద్దపులి

సత్యాన్ని ఎవరూ కాదనలేరు. వన్యప్రాణుల వేట ఇలా నిరంతరం కొనసాగితే భావితరాలవారు కనీసం ఇప్పుడున్న వన్యప్రాణుల్ని చూసే అదృష్టానికి నోచుకోరేమో!

మానవుడు స్వార్థాన్ని వదిలి అరణ్యాలకు వన్నె తెచ్చే ఈ ప్రాణుల్ని సరక్షించుకొంటే, ఎన్నో రకాల వన్య జీవుల్ని కాపాడుకోవచ్చునడంలో ఎలాంటి సందేహం లేదు.

వ్యాసం, ఫొటోలు: జి. రత్నకుమార్



"పెళ్ళీళ్ళోయ్ - పెళ్ళిళ్ళు"లో నరేష్, పూర్ణిమ

## మొదటి షెడ్యూల్ పూర్తయిన "ఇదే నా న్యాయం"

"అక్టోబర్ 23 నుంచి 31 వరకు ఫస్ట్ షెడ్యూల్ పూర్తి చేశాం," అన్నారు డైరెక్టర్ ఎం. నందకుమార్. ఈయన ఇంతకు మునుపు ఆదుర్తి సుబ్బారావు, తాతినేని రామారావు, ఎస్. డి. లాల్ వంటి ప్రముఖుల వద్ద సహాయ సహకార దర్శకుడుగా అనుభవం గడించారు. ఈయన తొలిసారిగా దర్శకత్వం నెఱపుతున్న కనిష్క క్రియేషన్ "ఇదే నా న్యాయం" చిత్రానికి మల్లాది వెంకట కృష్ణమూర్తి విరచిత "ధర్మయుద్ధం" ఆధారం. భానుచందర్, రజని, జగ్గయ్య, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్, వేలు, రాళ్ళపల్లి, చలపతిరావు ప్రభృత నటవర్గం. సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, డి. ప్రసాద్ బాబు ఛాయ, సాయికుమార్ శిల్పం, విశ్వం సహ దర్శకత్వం, కృష్ణస్వామి - బాలు కూర్పు, సుధాకరరెడ్డి సహకార దర్శకత్వంతో మాగంటి బెనర్జీ, టి. వి. ఎస్. రెడ్డి, ఎం. ప్రదీప్ కుమార్ నిర్మాతలు. తదుపరి షెడ్యూల్స్ నవంబర్ 11 నుంచి 25, డిసెంబర్ 10 నుంచి నెలాఖరు వరకు.



సామాజిక సంగమంలో రాధ

## కమలహాసన్, రాధికలతో ఏడిద నాగేశ్వరరావు, కె. విశ్వనాధ్‌ల సృష్టి "స్వాతి ముత్యం"

"స్వధర్మకార్యనిర్వహణ అతి పవిత్రమైనది. దాని పట్ల భక్తి శ్రద్ధలు కలిగి, ఏకాగ్రతతో, చిత్తశుద్ధితో కృషి చేయడం కూడా ఆరాధనే. దీనికి సత్ఫలితం ఉండి తీరుతుంది." ఇది కళా తపస్వి కె. విశ్వనాధ్ మతం. "ఇరవై ఏళ్ళ క్రితం నా మస్తిష్కంలో మెదిలిన సంఘటనలు క్రమంగా ఈ చిత్రరూపాన్ని దాలుస్తున్నాయి. ఇందులో కమలహాసన్ ధరించే శివయ్య పాత్ర– పసిపాప మనస్తత్వం గల జ్ఞాని. బతకడానికి ఎంతో తెలివి తేటలు ఉండీ, మతలబులు చేయడం కన్నా– ఏమి లేకుండా బతికే నిస్వార్థజీవి. రాధిక మధ్య తరగతి కుటుంబానికి చెందిన యువతి. బిడ్డ కలిగాక భర్తను పోగొట్టుకుని, అన్నగారి పంచన చేరి, వదినగారి సూటి పోటి మాటలకు ఎంతో వ్యధ చెందుతుంది. ఇలా వైవిధ్యం గల పాత్రలెన్నో ఉన్నాయి ఈ చిత్రంలో. ప్రొడ్యూసర్‌గారి అబ్బాయి శ్రీరామ్, దీప సరసన రజకుడుగా ఓ చక్కని పాత్రను నిర్వహించాడు. ఈ జంటతో పాటు కాశీ మల్లికార్జునరావు కలిసి శివయ్యకు తోడు నీడగా ఉంటూ, అతన్ని కంటికి రెప్పలా చూసుకుంటూంటారు. నా డైరెక్షన్‌లో ఇది రాధిక నటిస్తున్న తొలి చిత్రమైతే, కమలహాసన్ సరసన నాయికగా ఆమె నటిస్తూన్న తొలి చిత్రం కూడా ఇదే." అన్నారు పూర్ణోదయ మూవీ క్రియేషన్స్ "స్వాతి ముత్యం" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కె. విశ్వనాధ్. ఇంకా శరత్‌బాబు, జె. వి. సోమయాజులు, మేజర్ సుందరరాజన్, వీరభద్రరావు, వై. విజయ, అనిత, కుమారి వరలక్ష్మి ఇతర భూమికలు ధరించారు. ఇళయరాజా స్వరకల్పనలో ఆత్రేయ, సి. నారాయణ రెడ్డితో పాటు కె. విశ్వనాధ్ తొలిసారిగా ఒక జానపద గీతాన్ని రాయడం విశేషాకర్షణ. సాయినాధ్, ఆకెళ్ళ మాటలు



# విశేషాలు

-జి.వి.జి.

రాశారు. ఎం. వి. రఘు ఛాయ, అరుణ్ శిల్పం, శేషు నృత్యాలు, నందూరి విజయ్ సహకార దర్శకత్వం, ఏడిద రాజా నిర్వహణతో తాడి రామకృష్ణ, తాడి హరిబాబు, తాడి బాబ్జీ సహ నిర్మాతలు. "ఈ చిత్ర కథ సగ భాగం గ్రామీణ వాతావరణంలో నూ, మిగతా సగ భాగం నగర వాతావరణంలో నూ జరుగుతుంది. రాజమండ్రి సమీపాన తాటికొండ, తొర్రేడు, పట్టిసీమ ప్రాంతాలలో షూట్ చేశాం. కమల్ తన నట జీవితంలో తొలిసారిగా రాజమండ్రికి వచ్చారు ఈ చిత్రం కోసం. కణకణలాడే నిప్పులతో ఉన్న అగ్నిగుండాన్ని ఆయన దాటే సన్నివేశం హృదయాలను కదిలించి వేస్తుంది. మా పూర్ణోదయా బానర్ స్థాయిలో కళాత్మకంగా, వ్యాపార రీతిలో తయారైన ఈ చిత్రం కూడా మా ఇదివరకటి చిత్రాలలాగే సంచలనం కలిగిస్తుందని నా విశ్వాసం," అన్నారు నిర్మాత ఏడిద నాగేశ్వరరావు.

## లక్ష్మిఫిలిమ్స్ డివిజన్ నిర్మిస్తున్న బాలూ మహేంద్ర తొలి తెలుగు చిత్రం

జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన దర్శకుడు బాలూ మహేంద్ర. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, ఛాయ, దర్శకత్వంలో లక్ష్మి ఫిలిమ్స్ డివిజన్ మూడో చిత్రం షూటింగ్ అక్టోబర్ 12 నుంచి ఊటీ, బెంగుళూరు, హొగెనికల్ ప్రాంతాలలో విశిష్ట రీతిలో సాగుతోంది. "భానుచందర్ ఇదివరకు ధరించిన పాత్రలన్నీ ఒక ఎత్తు, ఈ చిత్రంలో ధరించే పాత్ర ఒక ఎత్తు. అసలు ఈ చిత్రం విడుదలయ్యాక ఇదే గెటప్‌లో భానుచందర్‌ని చూడాలని అతని అభిమానులు కోరుకున్నా ఆశ్చర్యం లేదు. అతని పక్కన అర్చన నాయిక," అన్నారు బాలూ మహేంద్ర. ఒకే షెడ్యూల్‌లో చిత్రీకరణ ముగిసే ఈ చిత్రంలో సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి తతిమా పాత్రధారులు. జంధ్యాల సంభాషణలు, ఆత్రేయ గీతాలు, ఇళయరాజా సంగీతం, వాసు కూర్పు తెర వెనుక హంగులు.

## నుప్రియ, అశ్వని





## "రెండు రెళ్ళు ఆరు"లో రజని, చంద్రమోహన్

## బాలకృష్ణ "దేశోద్ధారకుడు"

"డిసెంబర్ 6 నుంచి 15, జనవరి 16 నుంచి 20, ఫిబ్రవరి 1 నుంచి 15, మార్చి 11 నుంచి 20- నాలుగు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు ఎస్. ఎస్. రవిచంద్ర. ఈయన దర్శకత్వంలో ధనేకుల శివన్నారాయణ, చెరుకూరి హరనాథ్‌బాబు, తుమ్మల హరిశ్చంద్రప్రసాద్ నిర్మించే లక్ష్మీరామా ఆర్ట్ పిక్చర్స్ "దేశోద్ధారకుడు" చిత్రానికి అక్టోబర్ 24న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. నందమూరి బాలకృష్ణ, రావుగోపాలరావు, సత్యనారాయణ, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, గొల్లపూడి మారుతీరావు, వేలు, వీరభద్రరావు, రాళ్ళపల్లి, మాడా, సుధాకర్, బాలాజీ, శుభకర్, విజయశాంతి, ముచ్చెర్ల అరుణ, సంయుక్త, వై. విజయ, కాకినాడ శ్యామల వగైరా తారాగణం. గొల్లపూడి కథకు సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. నందమూరి మోహన్‌కృష్ణ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, శివశంకర్ – ప్రకాష్ నృత్యాలు, జూడో రత్నం సాహసాలు, కోట వెంకటేశ్వరరావు కూర్పు తెర వెనుక హంగులు.

వాడు ఆ పిల్లని రేప్ చేస్తుంటే ఏదో సినిమా చూస్తున్నట్టుగా వుండిపోయానే గానీ– ఆ పిల్లని రక్షించాలన్న ఆలోచన రాలేదు సార్!



'కసాయి గుండెలు'లో క్రాంతి మోహన్

## 'జయచిత్ర' నాట్యాలయ "శక్తిలీల"

నూరుకు పైగా చిత్రాల్లో నటించి ఎన్నో బహుమతులు, ప్రశంసలు పొందిన శతచిత్ర నటి 'జయచిత్ర'. ఈమె జయచిత్ర నాట్యాలయ పేరుతో 'శక్తిలీల' నృత్య నాటికను తమిళనాడు అంతటా ప్రదర్శిస్తూ ప్రశంసలు పొందుతున్నది. ఈమె ఇటీవల మద్రాసులో ముఖ్యమంత్రి ఎం. జి. రామచంద్రన్ సమక్షంలో తొలి ప్రదర్శన ఇచ్చి, ముఖ్యమంత్రి సహాయ నిధికి పది వేల రూపాయల విరాళాన్ని ఇచ్చి 'నృత్య నాటిక' ప్రదర్శనకు ప్రశంసలందుకుంది.

"ఆదిపరాశక్తి" అవతారాలైన, సరస్వతి, మహాలక్ష్మి, పార్వతి, మోహిని, ఆదిపరాశక్తి వేషాలను 'జయచిత్ర' ఒక్కతే నిర్వహిస్తూ ప్రతి వేషానికి,


"మహాలక్ష్మి వేషంలో జయచిత్ర

దుస్తులు, రూపం మార్చుకుందుకు రెండు నిముషాల వ్యవధిని మాత్రమే తీసుకోవటం, ప్రదర్శనకు నిండు తనమొచ్చింది. ఈ విధంగా స్వల్పవ్యవధిలో అయిదు అవతారాలుగా వేషం మారుస్తూ నృత్యం చేసిన నర్తకులెవరూ ఇటీవల కాలంలో లేరు. ఆదిపరాశక్తి మోహిని వేషంలో వచ్చి రాక్షస సంహారం చేసే ఘట్టం ప్రేక్షకుల కరతాళ ధ్వనులను అందుకుంది.

ఈ సందర్భంగా 'జయచిత్ర' మాట్లాడుతూ, తాను చిన్నతనం నుంచి, కూచిపూడి, భరతనాట్య ప్రదర్శనలు ఎన్నో ఇచ్చినా, చిరకాలంగా తనకు 'శక్తిలీల' నృత్య నాటిక ద్వారా 'ఆదిపరాశక్తి' అయిదు అవతారాలను నృత్య నాటిక రూపంలో ప్రదర్శించాలనే కోరిక సఫలమయినందుకు సంతోషిస్తున్నానని, ఈ నృత్య నాటికలో తాను అయిదు వేషాలు వేసినా 35 మంది ఇతర నృత్య కళాకారిణులు కూడ పాల్గొన్నారని చెప్పారు.

ఈ సందర్భంగా ఆమెకు "నాట్యకళా పేరోలి" బిరుదును ఇచ్చి సత్కరించారు.

త్వరలోనే ఆంధ్రప్రదేశ్ అంతటా ఈ నృత్య నాటికను ప్రదర్శించాలనే ఆకాంక్షను ఆమె వ్యక్తం చేశారు.

కృష్ణ సమర్పించు



పద్మావతీ ఫిలింస్






# మహామనిషి

దర్శకత్వం: **యం.బాలయ్య** B.E.,

నిర్మాత: **యు.సూర్యనారాయణబాబు**

"పట్నంపిల్ల-పల్లెటూరి చిన్నోడు" లో సుహాసిని, కె. ఆర్. విజయ

## కొమ్మినేని దర్శకత్వంలో "గర్జించిన గంగ"

"నాయకుడు సంపన్నుడైనా ఏమాత్రం అహంలేని పరమ సాధువు అతని నిజాయితీకి ముగ్ధురాలై, మనసును అర్పిస్తుంది నిరుపేద అయినా దొడ్డ మనసు గల నాయిక అయితే, ఆ ప్రేమికుల మధ్య విధి అడ్డు గోడ కట్టి వారి జీవితాలతో ఆడుకోవాలని చూస్తుంది కాని, సిరికీ శ్రమైక సౌందర్యానికీ జత కుదురుతుందా? ఇలా వినూత్నంగా సాగే ఇతివృత్తం,' అన్నారు కొమ్మినేని ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి జి ఆర్ట్ క్రియేషన్స్ అధినేత జి గన్నయ్య నిర్మించిన గర్జించిన గంగ" చిత్రంలో జయసుధ, శరత్‌బాబు, అర్జున్, పూర్ణిమ, గొల్లపూడి, వరలక్ష్మి, జయవిజయ, సూర్యకాంతం, బాలాజీ, గోకిన రామారావు, వంకాయలు ప్రభృత నటవర్గం కాశీ విశ్వనాథ్ సంభాషణలు, ఇళయరాజా సంగీతం, కబీర్‌లాల్ చాయతో కె సత్యనారాయణ ఈ చిత్ర సమర్పకులు


"లవ్ మాస్టర్"లో రాగిణి

## జి. సి. శేఖర్ దర్శకత్వంలో కె. కె. ఆర్ట్స్ చిత్రం

"భానుచందర్ సరసన ఊర్వశి, రామకృష్ణ హెగ్డే సరసన కొత్త నటి మాధురి నాయికలు నవంబర్ 1 నుంచి 9, 18 నుంచి 30, డిసెంబర్ 15 నుంచి 31 వరకు మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది రెండో షెడ్యూల్ రాజమండ్రి ప్రాంతాలలో జరుగుతుంది, అన్నారు జి. సి శేఖర్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కోమలబాబు సమర్పించే కె కె ఆర్ట్స్ చిత్రంలో రంగనాథ్, గిరిబాబు, పి ఎల్ నారాయణ, వేలు, డాక్టర్ శివప్రసాద్, వై విజయ, అనూరాధ తతిమా నటవర్గం గిరిజా శ్రీ భగవాన్ కథకుడు చక్రవర్తి స్వరకల్పనలో ఆత్రేయ, సి నారాయణ రెడ్డి, వేటూరి గీతాలు రాశారు పి ఎస్ ప్రకాష్ చాయ, రంగారావు శిల్పం, తార నృత్యాలు, కె పి కృష్ణ కూర్పుతో కోమల సత్యనారాయణరావు నిర్మాత

## చివరి షెడ్యూల్‌లో "డ్రైవర్ బాబు"గా శోభన్‌బాబు

"ప్రేక్షకులు తాము చెల్లించే పైకానికి సంపూర్ణ సంతృప్తి చెందేలా, అదే సమయంలో ఉన్నత ప్రమాణాలు కూడా ఉండేలా చిత్రాలు తీయాలనే తలంపుతోనే నేనీ సినిమారంగంలో ప్రవేశించాను నాకు పంపిణీ రంగంలో అంతో ఇంతో అనుభవముంది. రసవత్తరమైన కథ దొరికింది చక్కగా ప్లాన్ చేసి ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నాను. ఇదివరకు చెంగయ్య, డి. డి ప్రసాద్‌ల వద్ద అనుభవం గడించిన మా హీరో మేనల్లుడు సురేష్‌ను కెమెరామన్‌గా పరిచయం చేస్తున్నాం. ఈ యువకుని పనితనం అద్భుతంగా ఉంది ఇతనికి ఉజ్వలమైన భవిష్యత్తు ఉంటుంది," అన్నారు శ్రీ కృష్ణప్రసన్న ఎంటర్‌ప్రైసెస్ అధినేత బి వి ఎస్ ఎన్ ప్రసాద్. ఈయన నిర్మించే "డ్రైవర్‌బాబు చిత్రంలో శోభన్‌బాబు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రాజేష్, వీరభద్రరావు, గోకిన రామారావు, తులసి, రాజ్యలక్ష్మి వగైరా తారాగణం సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, వి. సురేష్ ఛాయ, సలీమ్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, ఎన్ శ్రీనివాసరావు సహకార దర్శకత్వం, ఎస్ వి. ప్రసాద్ ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో బి రామారావు, బి తిమ్మరాజు సహనిర్మాతలు "అక్టోబర్ 1 నుంచి 15 వరకు రెండవ షెడ్యూల్ జరిగింది. నవంబర్ 15 నుంచి 28 వరకు బెంగుళూరు, మైసూరు పరిసరాలలో పాటలు పిక్చరైజ్ చేయడంతో మొత్తం షూటింగ్ పూర్తవుతుంది మా హీరో పుట్టిన రోజున సంక్రాంతి కానుకగా విడుదలవుతుంది," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహిస్తున్న బోయిన సుబ్బారావు

## నరేష్, యువతరం రూపొందించే "దిగ్విజయం"

"యువతీ యువకుల కోసం నేను, పృథ్వీ నిర్మించే ఈ చిత్రంలో సాంకేతిక వర్గం అంతా యువకులే ప్రముఖ ఛాయాగ్రాహకుడు విన్సెంట్ కుమారుడు విన్సెంట్ జైనన్ ఛాయాగ్రహణ బాధ్యతలు వహిస్తారు రాజ్- కోటి సంగీతం, తోటయాదు ఆర్ట్‌తో దాసరి నారాయణరావు గారి వద్ద శిష్యరికం చేసిన సూర్య తొలిసారిగా డైరెక్ట్ చేస్తారు విక్టరీ ఫిలిమ్ సర్క్యూట్ బానర్‌లో తయారవుతుంది డిసెంబర్ 21 నుంచి నెల రోజుల పాటు ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ప్రముఖ హీరో నరేష్ ఈయనతో పాటు తులసి, త్రినాధ్, గొల్లపూడి, వేలు, వీరభద్రరావు ప్రధాన భూమికలు నిర్వహిస్తారు



"ఉక్కుసంకెళ్ళు"లో స్మిత



...లో కళ్ళపల్లి... పొట్టిప్రసాద్



"డాకూరాణి"లో విజయలలిత



"భలేమిత్రులు" లో భానుప్రియ

## ఛాయాగ్రాహకుడు దేవరాజ్ దర్శకత్వంలో "శివుడే శంకరుడు"

"రామకృష్ణ హెగ్డేది డ్యుయల్ రోల్, నవంబర్ 11 నుంచి 30 వరకు ఫస్ట్ షెడ్యూల్. బేలెన్స్ వర్క్ డిసెంబర్‌లో," అన్నారు పి. దేవరాజ్. ఈయన ఛాయ, దర్శకత్వంలో గుంటూరు వాస్తవ్యులు చిగురుపాటు సురేంద్రబాబు నిర్మించే బాబూ ఆర్ట్ క్రియేషన్స్ "శివుడే శంకరుడు" చిత్రంలో సరిత, తులసి, జగ్గయ్య, గుమ్మడి, గొల్లపూడి, వేలు, వీరభద్రరావు, శ్రీలక్ష్మి, నిర్మల, జ్యోతిలక్ష్మి, జయమాలిని, అనూరాధ, మరొక నవనటి పాత్రధారులు కాశీ విశ్వనాథ్ మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, రంగారావు శిల్పం, హార్స్‌మన్ బాబు సాహసాలు, శ్రీనివాస నృత్యాలు, గాదిరాజు కేశవరావు సహదర్శకత్వం, వీరప్ప కూర్పు, కృష్ణకిశోర్ రెడ్డి-దాసరి రామకృష్ణ సహకార దర్శకత్వం, చంద్రశేఖర్ ప్రొడక్షన్‌తో మానస సమర్పిస్తారు □

# హిందీ చిత్ర విశేషాలు

- "మర్ద్" చిత్రం దీపావళి కానుక విడియో ధాటిని ఎదుర్కోడానికి గాను ఈ చిత్రం ప్రింట్లు 225కి పైగా మనదేశమంతా విడుదల చేయబడతాయట. ఈ చిత్రంలో పాల్గొన్న 'బ్రౌనీ' అనే శిక్షణపొందిన శునకం కోసం మన్‌మోహన్‌దేశాయ్ 60 వేల రూపాయల పారితోషికాన్ని చెల్లించాడట ఈ కుక్కనే నిర్మాత కె. సి. బొకాడీ తన "జవాబ్ హమ్ దేయేంగే"లో లక్ష రూపాయలకు బుక్ చేశాడట! మరో చిత్రంలో ఈ కుక్క కోసం పూనమ్‌ధిల్లాన్, జాకీష్రాఫ్, అమృత్‌సింగ్ లాంటి తారలు తమ కాల్‌షీట్లను సర్దుబాటు చేయవలసి వచ్చిందట!

- "రజియా సుల్తానా" చిత్రం కోసం డైరెక్టర్ కమల్ అమ్రోహి చాలా డబ్బు తగలేశాడని ఎంత చెడ్డ పేరొచ్చినా – ఆయన దర్శకత్వంలో "లైలామజ్ను"తో పాటు మరో భారీ చిత్రాన్ని నిర్మించడానికి కొందరు . ల్మ వాలాలు సన్నాహాలు చేస్తున్నారట

- బొంబాయి జుహు ప్రాంతంలోని అమితాబ్‌బచ్చన్ బంగళాను జితేంద్ర కొనుక్కోదలిచాడట. చివరికది ఒక వర్తకునికి దక్కిందట

- చాలామంది హిందీ తారలు ఇటీవల అస్వస్థతకు లోనయ్యారు సంజీవ్‌కుమార్ అమెరికా నుంచి బైపాస్ సర్జరీ చేసుకుని తిరిగొచ్చాడు ఇతను బాగా సన్నబడటం వలన కొన్ని చిత్రాలలోని కొన్ని సన్నివేశాలను రీ షూట్ చేయవలసిన అవసరం ఉందట మిథున్ చక్రవర్తి మూత్రకోశంలోని రాళ్ళకు వియెన్నాలో లేసర్ చికిత్స పొంది వచ్చాడు. శశికపూర్ కాలు జారి ఎముక విరిగినందుకు కొంతకాలం మంచంపట్టాడు కిరణ్‌కపూర్ కారు ప్రమాదానికి లోనయ్యాడు

- రాజ్‌కపూర్‌కు ఎన్నో కష్టాలు ఎదురయ్యాయి. ఊపిరితిత్తులలో పుట్టకురుపు వ్యాధి లేదని తేల్చుకుని న్యూయార్క్ నుంచి తిరిగొచ్చినా – ఆస్త్మా వ్యాధి మాత్రం నయంకాలేదు. ఇక రిటైరై, పూనెలో అతని పొలాల మధ్య ఉన్న విశ్రాంతి మందిరంలో శేష జీవితాన్ని ప్రశాంతంగా గడపమని డాక్టర్లు సలహా ఇచ్చారట ఆర్థిక ఇబ్బందుల మూలంగా అతని ఆర్ కె స్టూడియోలోని కొంత భాగం విక్రయింపబడిందట మరో వంక అతని కొడుకు రణధీర్ నుంచి విడిపోతానంటోందట కోడలు బబిత

- రీనాచందావర్కర్ కూడా దురదృష్టవంతురాలు తుడుస్తున్న పిస్టల్ తూటా పొరబాటున తగిలి ఆమె భర్త సిద్ధార్థ కొంతకాలం క్రితం మృతిచెందాడు ఇటీవల ఆమె సోదరుడు అనిల్, భార్య విడాకులిచ్చిన కారణంగా పిస్టల్‌తో ఆత్మహత్య చేసుకున్నాడు

- అమ్జద్‌ఖాన్ డైరెక్టర్‌గా రెండు సార్లు అపజయాన్ని చవిచూశాడు ఇర్విన్ షా నవల "రిచ్ మెన్, పూర్ మెన్" ఆధారంగా స్వీయ దర్శకత్వంలో నిర్మించిన "అమీర్ ఆద్మీ – గరీబ్ ఆద్మీ" చిత్రం ఫ్లాప్ అయింది "ఈ చిత్రంలో ఒక క్లిష్టమైన పాత్రను గ్లామర్ తార కల్పనా అయ్యర్‌కు, విలన్ పాత్రను ఇమ్తియాజ్‌ఖాన్‌కు ఇవ్వడం నే చేసిన పొరబాటు," అని వాపోయాడట అమ్జద్ ఇతను అంతకుముందు తీసిన "చోర్ పోలీస్" సెన్సార్ కత్తెరకు బలియై, ఆ తర్వాత ప్రేక్షకుల నిరాదరణకు గురైంది

- కేన్సర్‌తో అసువులు బాసిన భార్య నర్గీస్ జ్ఞాపకార్థం సునీల్‌దత్ ఒక కేన్సర్ సర్వీస్ సెంటర్‌ను ఏర్పాటు చేశాడు అతని కొడుకు సంజయ్ గంజాయిలాంటి మత్తు పదార్థాలకు లోనై కోలుకున్నవాడల్లా అలాంటి మత్తు పదార్థాలకు బానిసలైన యువకులను కాపాడేందుకు ఒకసేవా సమితిని నెలకొల్పాడట.

- ఇటుపైన యువతరంలో చక్కని చలనచిత్రాల పట్ల అవగాహన పెంపొందించేందుకు గాను ప్రీ డిగ్రీ కోర్సులో "గోల్డ్ రష్, పథేర్ పాంచాలి" లాంటి చిత్రాల అంశాలు పాఠ్య భాగాలలో చేర్చబడతాయట

- ఇటీవల బొంబాయిలో విపరీతంగా వర్షం కురవడం ఒక నిర్మాతకు ఒకింత మేలు చేసింది ఈసెత్ స్టూడియోలోకి వరద నీరు రాగా – అందులో "డాక్ బాంగ్లా" చిత్ర నిర్మాత, విలన్ రంజిత్, నవ హీరో రాజన్ సిప్పీతో షెట్స్‌ను గగుర్పాటు కలిగించే రీతిలో చిత్రీకరించాడట. ఇలాగే కొంతకాలం క్రితం పునె వద్ద కురిసిన కుంభవోతకు ఒక గ్రామం మునిగిపోగా – హుటాహుటిగా అక్కడ "సత్యం శివం సుందరం" చిత్రం పతాక సన్నివేశాలను చిత్రీకరించాడు రాజ్‌కపూర్. ఇందువల్ల కృత్రిమ వర్షం కోసం అయ్యే వ్యయం ఆదా అయింది.

- "రామ్ తేరీ గంగా మైలీ" నాయిక మందాకిని అసలు పేరు యాస్మిన్ జోసెఫ్. ఈమె తండ్రి యార్క్‌షైర్‌కు చెందిన ఆంగ్లేయుడు. తల్లి కాశ్మీర్‌కు చెందిన పఠానీ ముస్లిమ్

–(జి. వి. జి.)

మీరు పెట్టిన డబ్బు నీటిలో
కొట్టుకు పోవడం లేదు కదా?



# జై కిసాన్ సామ్రాట్ నీటిలో కొట్టుకుపోదు ఎరువులోని ప్రతి అణువూ మొక్కలకు అందుతుంది



జైకిసాన్ సామ్రాట్‌లోని నత్రజని అంతా అమోనియా రూపంలో వుండటం చేత ఎరువు కొట్టుకుపోయే ప్రమాదం లేదు. 18 శాతం నత్రజని, 46 శాతం ఫాస్ఫేటుతో సమృద్ధమైన జైకిసాన్ సామ్రాట్ మొక్క వేళ్లు బలంగా పెరిగేలా చేస్తుంది, మొక్క వేగంగా ఎదిగేలా చేస్తుంది. వర్షాధార పంటలకు ఇది అతి ఉత్తమమైన ఎరువు.

ప్రతి నేలకూ, ప్రతి పంటకూ అనువైన ఈ ఎరువు పప్పులు, నూనెగింజలు, వాణిజ్య పంటలు, తోట పంటలకు ఎంతో ఉత్తమమైనది.

భూమిని హెచ్చు సారవంతం చేయడానికి ఇందులో కాల్షియమ్, మెగ్నీషియమ్, గంధక తత్వాలు కూడా ఉన్నాయి.

మీ కష్టార్జితాన్ని సరైన ఎరువు మీద ఖర్చు పెట్టండి. జైకిసాన్ సామ్రాట్ తెచ్చుకొని పొలంలో బంగారం పండించండి!

---

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి. జువారి వారి ఉచిత భూసార పరీక్షా సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి.

---







## జై కిసాన్ రాజ్యం–ధాన్యలక్ష్మి సామ్రాజ్యం

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు : సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణె, ఇందోర్, ఆగ్రా, జువారినగర్.

LINTAS ZUA 134 2317 TL

సీరియల్

# అంతరాలు-అంతర్యాలు

బోసుబాబు

(గత సంచిక తరువాయి)

సుబ్బారావుగారు గజగజ వణికిపోతున్నారు. అయినా నోటివెంట చిమ్మిన ఉమ్మి నురగను తుడుచుకుంటూ . 'ఈ సుబ్బారావు చచ్చాడనుకున్నారా, ఒళ్ళు కొవ్వెక్కి వ్యవహరిస్తారా ఆ( ఇంటిల్లి పాదిని హతమార్చి, ఆత్మహత్య చేసుకుంటాను తెలుసునా '

"ఏమండి, అంతమాటనకండి ఊరుకోండి మీకు దణ్ణం పెడుతున్నాను ఈ రోజు బాగాలేదు లేచిన వేళ ఎలాంటిదో మరి .' అంటూ కూతురు వైపు చూచి 'అయ్యో నా తల్లీ, అమ్మో, పడిపోయిందండి స్పృహలేదు కాబోలు,' అని సరోజ దగ్గరకు వెళ్ళి పట్టుకుని లేవనెత్తబోయి, మళ్ళీ పడుకోబెట్టి గదివైపు చూస్తూ, 'ఏమండీ త్వరగా రండి మంచినీళ్ళు తీసుకురండి .' అని కేకపెట్టింది

ఏరి భర్త?. ఎక్కడున్నారు ? ఆయన పెరటిలోకి వెళ్ళి వేపచెట్టు మానుకు తల ఆనించి విలపిస్తున్నారు ఆయన తన జీవితంలో ఎన్నోసార్లు కన్నీళ్ళు పెట్టుకున్న ఉదంతాలు వున్నాయి కాని, బావురుమంటూ ఏడ్చిన సంఘటనల్లో ఇది రెండవది కావచ్చు

సుబ్బమ్మగారికి ఎంతకూ, భర్త మాట వినరాలేదు వంట ఇంటిలోనుంచి పిల్లి పరుగుదీయడం కనిపించింది

'అయ్యో, ఇదేం ఖర్మం దుశ్శకునం కూడా కనబడిందే ఆయన ఎక్కడికెళ్ళారు ' అనుకుని పెరట్లోకి వెళ్ళింది వేపచెట్టు క్రింద భర్త ముఖం కనిపించడంలేదు ఎటువెళ్ళాలో ఆమెకు తోచలేదు

'ఏమండీ' అని ఓ ప్రక్క పిలుస్తూనే, మరో ప్రక్క మంచినీళ్ళకోసం పరుగెత్తి, నీళ్ళు తెచ్చి కూతురు ముఖాన చల్లింది వెంటనే లేచి పెరటిలోకి పరుగెత్తింది భర్తను సమీపించింది

'ఆవేదనలో, రోదనలో ఆయన డొక్కలు ఎగురుతున్నాయి కాళ్ళు, చేతులు వణకుతున్నాయి. ఒళ్ళంతా చెమటలు

'లోపలికి రండి నామాట వినండి. అమ్మాయిని ఒక్కసారి చూడండి. అది . అది ' ఇకాతర్వాత ఏమి చెప్పలేకపోయింది ఆమె చేతులు భర్త ముఖాన్ని, గడ్డాన్ని తాకాయి అప్పుడాయన మరింతగా క్రుంగిపోయి బావురుమన్నారు. భర్తతో పాటు ఆమె కూడా ఏడ్చింది కొద్ది క్షణాల తర్వాత ఇద్దరూ లోపలికి వచ్చారు

భార్య కళ్ళల్లోకి చూస్తూ అన్నారు–

'ఏమే! నేను ఏ జన్మలోనో పాపంచేసి వుంటాను. లేకపోతే, నాకు, నా కుటుంబానికి ఈ అవస్థలు దాపురించవు అవునా '

'లేదండి, అలా అనకండి మీరు పుణ్యాత్ములు ధర్మాత్ములు నాకు తెలియదా అన్నిటికి ఆ భగవంతుడే వున్నాడు మీరు ఊరుకోండి '

'లేదే . నాకు తెలుసు నేనొక అర్భకుడినైపోయాను అనామకుణ్ణి పిల్ల పెళ్ళి చేయలేక, దాన్ని అవస్థలపాలు చేస్తున్నాను నిజం నేను బ్రతికుండి ఎవరికి ప్రయోజనం ఉరిపోసుకు ' ఆ మాటపైకి రానివ్వకుండా భర్తనోటిపై చేయివేసి–

అవ్వ అలా అనకండి మీరు లేకపోతే నా పసుపు, కుంకుమ లేకపోతే నేను బ్రతికి వుంటానని ఎలా అనుకున్నారు ముందుగా, కర్తవ్యం ఆలోచించండి సరోజను ఏ అయ్య చేతిలో నైనాపెట్టి, ఆ తర్వాత ఏ చెట్టునీడనో బ్రతుకుదాం '

"అవును నిజమే '

"అంతేనండి, అంతే పిల్ల పెళ్ళి చేయలేక, మన పరువు వీధిన పడుతోంటే, మనకి ఇల్లు మాత్రం దేనికి తెగనమ్మేయండి అంతే విషయాలు తర్వాత మాట్లాడు కుందాము ముందు, అమ్మాయిని గదిలో పడుకోబెట్టి వస్తాను వుండండి అని భార్య ఆదరాబాదరా వెళ్ళి మూలుగుతూ పడుకున్న కూతుర్ని మెల్లగా లేవదీస, నిలబెట్టి గదిలోకి తీసుకెళ్ళింది సరోజ మగతగానే మంచం మీద వాలిపోయింది

## 10

'పరంధామయ్యగారూ' సుబ్బారావుగారి పిలుపు

పరంధామయ్య కుర్చీలోంచి లేచి వచ్చి, సుబ్బారావు గారిని చూచి నవ్వుతూ ఆహ్వానించాడు ఇద్దరూ కూర్చున్నారు

అయ్యా! కులాసాగా వున్నారా?" పరంధామయ్య పరామర్శ.

'కులాసాయేనండి అంతా కులాసాయే మనసేమి బాగుండ లేదు."

"ఈ రోజుల్లో అందరి పరిస్థితి ఇంచుమించు ఇలానే వుందండి "

"అందరి విషయం ఏమోగాని, నా పరిస్థితి మాత్రం అధ్వాన్నంగా వుంది ."

**జరిగిన కథ–13:** "సరోజ తన స్నేహితురాలు శోబతో కూడా శ్యామ్ సుందరరావు ఇంటికి వెళ్తుంది శోభ శ్యామ్‌ను ప్రేమిస్తుంది శ్యామ్ కూడా తనకి శోభంటే ఇష్టమని ఆమెతో చెపుతాడు సరోజ శ్యామ్ వైపు ఆకర్షితురాలవుతోందని తెలుసుకుంటుంది శోబ శోభ, శ్యామ్‌ల ప్రేమకు అడ్డుగోడగా నిలుస్తాడు శోభ తండ్రి, సరోజ తల్లితండ్రులు సరోజని ముత్యాలరావు కిచ్చిపెళ్ళి చేయాలనుకుంటారు కాని సరోజ తానసలు పెళ్ళే చేసుకోనని చెప్తుంది శ్యామ్ తల్లి వర్ధనమ్మగారికి సరోజని చూస్తే అభిమానం ఉంది కానీ ఆ అమ్మాయిని కోడలుగా చేసుకోవడానికి మాత్రం ఆమె మనసు అంగికరించదు. సరోజ తను శ్యామ్‌ను పెళ్ళి చేసుకుంటానని తల్లితో చెపుతుంది సరోజ తరచు శ్యామం ఇంటికి వెళుతోందని, అలా వెళ్ళకుండా కూతుర్ని అదుపులో పెట్టుకోమని పరంధామయ్య సుబ్బారావుగారిని హెచ్చరించడంతో ఆయన ఉగ్రుడై కూతురిపై చేయి చేసుకుంటాడు

సుబ్బారావుగారి మాటలతో పాటు నిట్టూర్పు కూడా వెలికి వచ్చింది

మళ్ళీ ఏదైనా ఇబ్బంది అదే అదే డబ్బుకు సంబంధించిన ఇబ్బంది ఏమైనా వచ్చిపడిందా ”

అదేనండి అదే ఎల్ల పెళ్ళి త్వరలో చేద్దామని సంకల్పం

మాశారూ, నేనిదివరకే చెప్పానామాట పట్టించుకున్నారు కాదు త్వరగా చేసేస్తే మీకూడా భారం తరిగిపోతుంది కదా

అది నిజమేనండి కాని ఎలా చేయటమన్నదే ప్రశ్న

కుమారుళ్ళున్నారు గదా వాళ్ళతో సంప్రదించలేదా ”

వాళ్ళు కొడుకులా కొరగరాని కొయ్యలు అక్కరకురాని మూర్ఖులు నా మాటకు విలువ ఇవ్వటం ఎప్పుడో మానేశారు వాళ్ళతో ఇక ప్రయోజనం లేదు లెండి ప్రస్తుతం వచ్చింది. మీ సలహా కోసమే

నేను చెప్పగలిగిన దేముందండి అందునా ఇది డబ్బుతో కూడిన వ్యవహారం

అందుకే మీ వద్దకు రావటం

పరంధామయ్య భృకుటి ముడిచి కళ్ళు చిట్లించాడు

సుబ్బారావుగారే మళ్ళీ అన్నారు

చూడండి మా ఇల్లు అమ్మేస్తే ఎలా వుంటుంది”

పరంధామయ్యకు గుటక పడింది రెండు క్షణాల తర్వాత అన్నాడు

బాగానే వుంటుంది కాని అది, నా వద్ద తనఖాపెట్టి వున్నారు కదా మరి బాకీ చెల్లించకుండా ”

'అబ్బే' మీ బాకీ ఎక్కడికీ పోదు నయాపైసలతో సహా చెల్లిస్తాను

అయ్యో! అంతమాట దేనికండి మీ మీద నమ్మకం లేదని కాదు అయినా సలహా అడిగారు కాబట్టి చెబుతాను

చెప్పండి అవశ్యం

ఆ ఇల్లు నాకే ఇచ్చేయకూడదూ ఓ ఇల్లేదైనా వుంటే బేరమాడా సంకల్పం కొంతకాలంగా వుంది రెండిళ్ళు ప్రస్తుతం అందుబాటులో వున్నటు



# అంతరాలు – ఆంతర్యాలు

కనబడు తున్నాయి... ఏ ఇల్లు అయినా బేరం కుదిరితే, నాకు కూడా పైకం అవసరమవుతుంది కదా ..'

సుబ్బారావుగారు ఆలోచనలో పడ్డారు.

పరంధామయ్య ఇది గమనించి అన్నాడు –

"మీరు ఇందులో ఆలోచించవలసినదేమి లేదు మీకు అప్పుడ్నని తెలుసుకదా. మీకు అన్యాయం చేయడమంటే సాక్షాత్తు ఆ బగవంతునికి అపచారం చేయడమే.. అం '

"అయితే ఏం చేయమంటారు?'

"మీ ఇంటిని, మీకు గిట్టుబాటైన ధరకే నాకు విక్రయించండి మీ అవసరానికి డబ్బొ ముడుతుంది నా బాకీ తీరుతుంది ఇక, ఇల్లు కొనాలన్న ఆలోచన కూడా విరమించుకుంటాను ఉభయత్రా ప్రయోజనకరమే కదా లేదా నా బాకీ తీర్చి మీ ఇల్లు మరెక్కడేనా బేరం పెట్టుకోండి . మీ అమ్మాయి పెళ్లి ముఖ్యం చూడండి... "

పరంధామయ్యకు వేరే ఇల్లు కొనాలన్న ఆలోచనే లేదు సుబ్బారావు గారి అవసరాన్ని గమనించి, ఆయన ఇంటిని పడేసుకుందామన్నదే అతగాడి దుర్బుద్ధి సత్య నిష్ఠగల సుబ్బారావుగారు గ్రహించలేక పోయారు

"సరే అలాగైతే మీరే సెటిల్ చేయించండి." సుబ్బారావుగారు తన నిర్ణయం తెలిపారు

"అయ్యయ్యో! మీరు సెలవివ్వడమూ, నేను కాదనడమూనా అని "అబ్బాయ్ లోకం! బోర్నవిటా కలిపించి పట్టుకురా' అంటూ గదిలోకి చూస్తూ కేకపెట్టాడు పరంధామయ్య

'దయ చేసి, వూరుకుందురూ నే నెన్నడూ అలాంటివి తీసుకోలేదు వద్దు ."

"పంతులుగారూ! మీరలా అంటే నా మనసు నొచ్చుకుంటుంది మనం ఒక శుభ కార్యం తలపెట్టినప్పుడు విఘ్నం కారాదన్నదే నా కోర్కె ఆ పరమాత్ముడు, ఆ ఏడుకొండల వాడు, పాపం, పుణ్యం అని వూరికే అన్నారా చెప్పండి మీ అమ్మాయి కల్యాణం శీఘ్రంగా జరగాలని, మీ తరపున నేను మొక్కి, ఆ వెంకట రమణమూర్తికి పది టెంకాయలు కొడతాను "

లోకం బోర్నవిటా కప్పులు ట్రేలో పెట్టి తీసుకొచ్చాడు పరంధామయ్య తన స్వహస్తాలతో సాదరపూర్వకంగా ఓ కప్పును సుబ్బారావుగారి చేతిలో పెట్టి, "తీసుకోండి" అన్నాడు చిరునవ్వు ప్రదర్శిస్తూ సుబ్బారావు గారు రెండు గుటకలు వేసి కప్పు ప్రక్కన బెట్టారు

"అయితే, నేను మళ్లా రేపొస్తాను. కాగితాలు సిద్ధం చేయించండి '

"అమ్మమ్మ .. మీరు రావడమూ, శుభ కార్యం ముగించుకోకుండా వెళ్లడమూనా. బాగులేదు అయినా రాత కోత లెంత సేపండీ అయిదు నిముషాలు. ఇదిగో ఇప్పుడే ప్రారంభిద్దాము "

అరగంటలో కాగితాలు వ్రాయడం, బాకీలు వడ్డీతో సహా తేల్చడం, సుబ్బారావుగారికి రావలసిన సొమ్ము అంచనా వేయడం అన్నీ ముగిశాయి

సుబ్బారావు గారు చివరలో, విషణ్ణవదనంతో నవ్వారు . ఎందుకో మరి!?

"పంతులుగారూ! ఈ మధ్య వ్యాపారం కూడా దెబ్బతింది అందుమీదట నేను కూడా కొంత ఇరుకున పడ్డాను మీకు రావలసిన పైకం యావత్తు ఇప్పుడే ఇచ్చేయమంటారా .. లేక, అవసరానికి కొంత. "

"అలా కాదండీ, వ్యవహారం పైసలా అయినప్పుడు, మళ్లీ తఖరారు దేనికి అవసరం వచ్చేకదా ఇల్లు అమ్ముకున్నది ."

"అయ్యో, కాదటండీ మరి, అయితే. .. మరి, నాకు దత్తమైనప్పుడు మీ యిల్లు నాదే అవుతుంది కదా. అంచే మరి నాకు కొత్త ఇల్లు కూడాను మరి మా కొత్త ఇంటిని ఎప్పుడు కదిగించ మంటారు .?" అంటూ సుబ్బారావుగారి వదనంలోకి సూటిగా చూచాడు పరంధామయ్య

ఈ మాటతో సుబ్బారావు గారి మనసు చివుక్కు మన్నది వెంటనే తల యెత్తి చూచారు పరంధామయ్య నవ్వుతూ వినయపూర్వకంగా అన్నాడు

మరి, మీరే అన్నారు కదా వ్యవహారం పైసలా అయిన తర్వాత "

సరే రిజిస్ట్రరీ కాగానే ఖాళీ చేస్తాను అయితే, అద్దద్దా అంటే మరో అద్దె కొంప ఎక్కడ దొరుకుతుందా అని ఆలోచిస్తున్నాను ." ఉబికి వస్తున్న ఆవేదనను అణచుకుంటూ అన్నారు

'మీరింత సత్యకాలపు మనుషులైతే ఎలాగండీ పంతులుగారు నాకు గురుతుల్యురు కాబట్టి ఆ సహాయమేదో నేనే చేద్దామని సంకల్పం కల్గింది. మీరు ఆమోదిస్తానంటే సుమీ '

"సరే చెప్పండి '

"మీరేమి ఇబ్బంది పడ నవసరం లేదు మా ఇంటి వెనక వీధిలో ఓ ఇల్లు వుంది అది మా తమ్ముడిది . ఎంత స్థలం వూరికే పడివున్నదని ఇల్లొ కట్టి వేయించాడు అది విషయం '

'అద్దె ఏమాత్రం?"

ఏదో మీరు గనుక ఓ ఏభయి రూపాయ లివ్వండి చాలు అది పైన తాటాకు వేసింది లెండి '

అలాగా!

అవునండీ శుభ్రం చేయించ మంటారా? ఫస్ట్‌క్లాస్‌గా వెలుతురు, గాలి, కావలసినంత దొడ్డి పాదులు కూడా పెట్టుకోవచ్చు అయితే నీళ్లకు మాత్రం కాస్త ఇబ్బంది ఎందుచేతనంటే మన ఇంట్లో పంపు లేదు రోడ్డుమీదకు వెళ్లి నాలుగు అడుగులు వేస్తే చాలు పంపు అంతేనండీ .'

సుబ్బారావుగారు మళ్లీ ఓ నిట్టూర్పు విడిచారు తల దించుకుని కూర్చున్నారు

ఇద్దరూ కలసి ఇల్లు చూడడానికి వెళ్లారు. ఆ ఇంటిలో గదు లనేవి లేవు సిమెంటు రాళ్లతో కట్టిన గోడలు. ఒకే గది– అదే ఆ ఇల్లు. గోడలు కట్టక ముందు దాన్ని గొడ్లపాకగా వాడి వుంటారు కాబోలు సుబ్బారావు గారికి కళ్ల నీళ్ల పర్యంతమైంది నిజంగా ఇది తనకు అంతిమ దశేననుకున్నారు కాబోలు.

"ఇల్లు నచ్చినట్లేనా ?"

సుబ్బారావుగారు మవునంగా చూస్తూ తల ఊపారు వెళ్లొస్తానని చెప్పి ఇంటి ముఖం పట్టారు

మనసులో ఆవేదన హృదయంలో ఆందోళన అంతా అయోమయంగా వుంది చాలా వేగంగా నడచి వెడుతున్నారు ఎండ తీక్షణంగా వున్నా, గొడుగు వేసుకో లేదు

సుబ్బారావుగారూ!' అంటూ పిలుపు పిలిచిన వ్యక్తిని చూడనే లేదు దాటి వెళ్లిపోయారు

ఏమండోయ్! మళ్లీ పిలుపు.

ఈ సారి వెనుదిరిగి చూచారు గుండెలో తుల్లో అణగారి వున్న ఆవేదన ఒక్కసారిగా పెల్లుబికింది కాని తమాయించు కున్నారు. శ్యామం ఆకృతి ఓ విష సర్పంగా ఆయనకు తలపించింది దగ్గరకు వెడితేనే ప్రమాదమేమో అన్నంతగా బయపడ్డారు

'ఏమండీ! చూచి కూడా పలకరించకుండా వెళ్లి పోతున్నారా ..?" శ్యామం నవ్వుతూ అడిగాడు సుబ్బారావుగారు క్షణకాలం తదేకంగా చూచారు. కాని మాట్లాడ లేదు

'మీరి మధ్య కనిపించడమే మానేశారే " మళ్లీ అన్నాడు శ్యామం.

అవును బాబు పని వత్తిడిలో వుండి '

మీరు అదోలా వున్నట్టు కనబడుతున్నారే ?"

"బాగానే వున్నాను లెండి ఇప్పుడే మా ఇల్లు విక్రయించి, తిరిగి వెడుతున్నాను '

'ఇల్లా దేనికి . అంతటి అవసరం ఏమొచ్చింది?" ఆశ్చర్యంతో అడిగాడు శ్యామం

'అవసరమేనండీ పిల్ల పెళ్లి చేయవలసి. "

"అంటే, మీ రెండవ కుమార్తె వివాహానికా?"

"అవును బాబు."

"మీ అమ్మాయి .. పాపం.... అమాయకురాలు. మా ఇంటికి ఒకటి రెండు సార్లు వచ్చినప్పుడు నేనిదే గమనించాను. మంచి సంబంధ ముంటే చూసి పెళ్ళి చేయండి అందరికీ సంతోషంగా వుంటుంది."

ఈ మాటలకు సుబ్బారావుగారి కడుపు భగ్గున మండింది

"బాబూ, నేను పాత కాలపు మనిషినే కావచ్చు. కాని నయవంచన మాత్రం నాకు తెలియదు. అది ఆత్మద్రోహం మహాపాపం ఎదుటి వారి జీవితాలతో చెలగాట మాడటం మహాపాతకమని నా అభిప్రాయం "

సుబ్బారావుగారిలో అణగారి వున్న ఆవేశం ఇలా ఒక్కసారిగా పెల్లుబికింది. శ్యామం నిశ్చేష్టుడయ్యాడు మొదట నోట మాట రాలేదు ఆయన ఎందుకిలా మాట్లాడుతున్నదీ బోధపడటం లేదు.

"మీ మనసు బాగో లేనట్లుంది తర్వాత మాట్లాడుకుందాము మరి నే వెళ్ళిరానా. ."

"బాబు, ఒక్క మాట. నేను పేదవాడిని డబ్బు లేదు. కాని ఆత్మాభిమానానికి, పరువుకు మాత్రం పేదవాడిని కాను.. మీరేమి అనుకోకపోతే ఓ మాట అంటాను దయచేసి మా సరోజను మీ ఇంటికి రానివ్వకండి మీ కొక నమస్కారం. " అంటూ నిజంగానే రెండు చేతులు జోడించి నమస్కారం పెట్టారు

సుబ్బారావు గారి మాటలకు, ధోరణికి శ్యామం వదనం వివర్ణమైంది. తన నేదో నేరస్తునిగా భావించి మాట్లాడుతున్నారనుకున్నాడు. అన్నాడు వెంటనే-

"నాపరంగా మీ కుటుంబానికి ఏమైనా అపకారం జరిగిందా?"

"నే నా మాట అనడం లేదు బాబూ. మా మానాన మమ్మల్ని బ్రతక నివ్వండి అదే నా విన్నపం. మరి సెలవు .. "అని సుబ్బారావుగారు ఆగకుండా వెళ్ళిపోయారు

శ్యామం అలా చూస్తూ నిలబడి పోయాడు. ఆయన అలా మాట్లాడతారని కలలో కూడా ఊహించ లేదు అసలు జరిగిన దేమిటో అంతు పట్టటం లేదు. ఎన్నడూ భాధ కలిగించే విధంగా ప్రవర్తించి వుండలేదు. తన ఇంటికి వచ్చినంత మాత్రాన సరోజకు పెళ్ళి కాకుండా పోతుందా ఏమిటిదంతా విచిత్రంగా వున్నదే అనుకున్నాడు సరోజ వస్తే వివరాలు తెలుసుకుందామనుకున్నాడు ఇంటికి వెళ్ళి పోయాడు.

* * * * * * * * *

శ్యామం తన గదిలో పడుకున్నాడు కళ్ళు మూసుకున్నాడే గాని నిద్ర రాలేదు తల్లి వచ్చి పిలిస్తే లేచాడు భోజనం వడ్డించాను రమ్మనమని చెప్పింది భోజనం చేస్తున్నప్పుడు తల్లి అడిగింది-

"ఏరా, అలా వున్నావే. వంట్లో బాగో లేదా.. అయినా నీ కెవరు చెబుతారురా ఎప్పుడు జరగవల్సింది అప్పుడు జరగాలి. "

"ఏవిటి జరగ వల్సింది . నీ దృష్టిలో పెళ్ళేనా ?

"అవునురా కాదామరి. " వర్ధనమ్మ రెట్టించింది

"ఇంకెప్పుడూ నాముందు పెళ్ళి విషయం ఎత్తకు." ఖండితంగా చెప్పాడు.

"ఏమైనా నాదేరా తప్పు... ఆడపిల్లలను ఆఫీసుకు రానివ్వడం.... వస్తుంటే చూస్తూ వూరుకోడం .. అంతా నాదేరా తప్పు ."

"అమ్మా నవ్వు వూరుకుంటావా.. . నన్ను ఇక్కడి నించి వెళ్ళిపోమంటావా?" శ్యామం చిరాకుపడుతూ అన్నాడు. వర్ధనమ్మ మరి మాట్లాడలేదు.

శ్యామం భోజనం ముగించి గదిలోకి వెళ్ళి పోయాడు. నిద్ర పోవడానికి ప్రయత్నిస్తున్నాడు. షెల్ఫ్‌లో నుంచి ఓ పుస్తకం తీశాడు అది "హామ్లెట్ ' "నా ఆలోచనలకు తగినట్టే దొరికింది పుస్తకం " అనుకుని మళ్ళీ దాన్ని షెల్ఫ్‌లో పడేశాడు.

కళ్ళు మూసుకుని ఎలాగైనా నిద్రపోదా మనుకున్నాడు కొంతసేపు ఆలోచిస్తూ తనకు తానే వ్యాఖ్యానించు కున్నాడు .

"మంచివాళ్ళను కూడా, మంచి వాళ్ళు అర్థం చేసుకోగల రోజులు కావివి . ప్చ్ ."

మొత్తంమీద కాసేపటికి నిద్రపట్టింది. సాయంత్రం అయిదున్నర గంటల వేళ మనశ్శాంతి కోసం అలా దూరంగా ఎక్కడికైనా వెడదామనుకున్నాడు స్కూటర్ స్టార్ట్ చేశాడు అది, తిన్నగా బ్యారేజికి దారి తీసింది బ్యారేజి దిగువన గల 'కృష్ణవేణిమాత" విగ్రహం దగ్గర స్కూటర్ ఆపి దిగాడు పరిసరాలు చూస్తూ, అక్కడే అటు, ఇటు పచార్లు చేస్తున్నాడు ఇంతలో సుమారు ఇరవై గజాల దూరంలో ఓ కారు వచ్చి ఆగింది ఆ కారులోంచి ఇద్దరు స్త్రీలు, ఒక ఆడపిల్ల దిగారు. ఒకామె ప్రౌఢ ఆడపిల్లకు పదేళ్ళుంటాయి మూడవ వ్యక్తి ఎవరా అని కించిత్తు పరిశీలనగా చూచాడు ఆమె ఎవరో కాదు సాక్షాత్తు శోభ

శోభను చూడగానే శ్యామం కుడి అరచేయి వ్రేళ్ళు నుదిటిమీదకు అప్రయత్నంగా వెళ్ళి రెండుసార్లు కొట్టుకున్నాయి దీర్ఘమైన నిట్టూర్పు కూడా వెలికి వచ్చింది.

శోభ, కారులోంచి దిగగానే పరిసరాలను చూడనే లేదు తన దృష్టిని కృష్ణవేణిమాత విగ్రహం వున్న ప్రదేశానికి మళ్ళించింది ఏవో అనుభూతులు స్మరణకు వచ్చి అలా చూచిందే గాని, మరే ఉద్దేశం లేదు. కాని తాను ఊహించని విధంగా, ఆ ప్రదేశంలో శ్యామం కనిపించాడు శోభ మనసు ఒక్కసారిగా పొంగి పోయింది కాని ప్రక్కనే ఆంటి కనబడగానే, ఆ మనసు మళ్ళీ కుంగి పోయింది శోభ వచ్చింది కూడా మనశ్శాంతి కోసమే శ్యామం వచ్చినదీ అందుకే కాని, యాదృచ్ఛికంగా జరిగిన ఈ ఘటనకు ఇద్దరూ విస్తుపోయారు.

ఇద్దరూ మనశ్శాంతి పొందడం కోసం వచ్చారు అది వారి మొదటి భావం వచ్చిన తర్వాత మనశ్శాంతికి బదులు, మనోవేదన ప్రాప్తించింది ఇది అనుకోని రెండో భావం- ఈ రెండు భావాల మధ్య విచిత్ర సంఘర్షణ దీనినే ద్వైదీభావమని కూడా అనవచ్చునేమో!

కృష్ణవేణి తరంగాలు గట్టును ఢీకొంటున్నాయి అవి శ్యామానికి






# అంతరాలు – అంతర్యాలు

లయబద్ధంగా వినిపించడం లేదు నురుగులు కక్కుతున్న సముద్ర పుటలలుగాను, ఆ తరంగాల శబ్దాలు, సముద్రపు ఘోషగాను తలపించాయి పడమటి దిశనుంచి వీస్తున్న చిరుగాలులు తుఫాను హోరులా వినిపించాయి వీటి ఫలితంగా శ్యామం అంతరంగంలో కూడా తుఫాను చెలరేగింది నాసికపుటలు పెద్దవై సుదీర్ఘమైన శ్వాస వెలికి వస్తోంది

"శ్యామం, నువు హెమ్మెట్‌వి కాబోకు " అని అంతరంగం సలహా చెప్పింది అయితేనేం అతని హృదంతరాళంలో ఎక్కడో మరుగున పడివున్న బలహీనత మెలమెల్లగా పైకి వచ్చింది మనసు ఎంతగా హెచ్చరించినా శ్యామం చూపులు శోభారాణి పాదపద్మాల వద్దకు ప్రాకుతూ వెళ్ళాయి అవి ఆ పాదాలను స్పృశించి. చిక్కి శల్యమై వున్న ఆ దేవతామూర్తి దేహాన్ని తడుముతూ, దోగాడుతూ మెల్లగా పైపైకి ఎగబ్రాకుతూ ఆ చంద్రవదన చెక్కిళ్ళు నిమురుతూ, సొమ్మసిలివున్న ఆ సరసిజ నేత్రాల ముందు మోకరిల్లాయి

'శ్యామ్ . ఏమిటి నువు చేస్తున్న పని ' అని మళ్ళీ మనసు మందలించింది వెంటనే చూపులు మరల్చాడు తల దించాడు అయితే నేమి మళ్ళీ ఏదో వేదన. ఆ వేదనలోనే సానుభూతి దానిలోనే మమత ఆ మమతలోనే అనురాగం వీటన్నింటి కలయిక ఆనాటి స్పర్శానుభూతి శ్యామం జీవితంలో అదే తొలి స్పర్శ అదే తొలి ఆలింగనం అదే తొలి ఆనందానుభూతి– ఆనాటి శోభ. రాణిలా తన హృదయరాణిలా ఎదపై వాలి కలిగించిన ప్రేమానుభూతి అది చిరస్మరణీయమైన తొలి అనుభవం అది కాదనలేని సత్యం అదే – అందుకే – ఇప్పుడు శ్యామం పడుతున్న ఆవేదన

ఇది మరువలేని అనుభూతి పూర్వకమైన వేదన అందుకే కాబోలు మరోసారి శోభను చూడకుండా వుండలేకపోయాడు

శోభ అల్లంత దూరాన నిశ్చలంగా వుంది – కృష్ణవేణి మాత విగ్రహంతో పోటీ పడుతున్నట్లుంది ఆ నిశ్చలత్వం అయితేనేమి, కృష్ణవేణిది –నిశ్చల గంభీరవదనం శోభది విషణ్ణ వదనం సజల నేత్రాల నుంచి ప్రసారమై వెళ్ళిన దృక్కులు శ్యామాన్ని సమీపించి, 'శ్యామ్, నన్ను నీ ఒడిలోకి తీసుకుని, హృదయానికి హత్తుకుని లాలించవా ' అని ప్రాధేయపడుతున్నట్లున్నాయి

శోభను చూచింది ఆంటీ శ్రీలక్ష్మి 'అమ్మా! శోభా!' అని భుజం తట్టింది శోభ తృళ్ళిపడి, వెంటనే 'ఆఁ ' అంది

'ఏవిఁటా కన్నీళ్ళు?' అంటూ శ్రీలక్ష్మి శోభ చూచిన వైపు ఓ సారి చూచింది అక్కడ ఒక యువకుడు, శూన్యంలోకి చూస్తున్నట్లు నిలబడి వుండటం గమనించింది. ఎక్కడో చూచాననుకుంది ఇంతలో అన్నయ్య చెప్పిన విషయం జ్ఞాపకం వచ్చింది

'శోభా! ఇటు చూడు ఆ నిలబడిన వ్యక్తి అన్నయ్య చెప్పినాయనేనా '

శోభ మాట్లాడలేదు

'శోభా! నీవింకా ఈ ఆలోచన మానలేదన్న మాట అన్నయ్య నాకు అంతా చెప్పారు మనం ఇక్కడకు ఇప్పుడు వస్తున్నట్లు ఆ అబ్బాయి కెలా తెలుసు ?' అంటూ సూటిగా శోభ కళ్ళల్లోకి చూచింది శోభ హృదయం భగభగ మండిపోయింది పళ్ళు బిగుసుకున్నాయి కూడా

'అందరూ చూచేందుకు, ఒకేలా వున్నా, అనుమానం ముందు పుట్టి, తర్వాత మనుషులు పుట్టారనుకుంటున్నాను '

'అవునమ్మా, ప్రస్తుతం నీ పరిస్థితిని బట్టి అనుమానించడం సహజం '

'అంటే, నీ ఉద్దేశం?'

'ఉద్దేశం అలా వుంచు అయినా నీకు అసలు అంత కోపం దేనికి?'

'నాకా కోపం కోపం ఆంటీ అన్నివిధాల బందిగా వున్న నాకు కోపం వచ్చినా ప్రయోజనం ఏముంది ఆయన ఇక్కడకి ఇప్పుడే వస్తారని నాకు నిజంగా తెలియదు దూరంగా వున్నా, పలకరించకపోయి చూస్తే చాలు అదే బాగ్యమనుకున్నాను ఆ అదృష్టం కూడా లేకుండా పోతోంది నీకు అనుమానం కలిగింది నిజమే కాని నాకు అదే అవమానం నా మనసు ఎంత కుమిలిపోతోందో తెలుసా మీకు ఈ కృష్ణవేణి ఒడిలో శాశ్వతంగా కళ్ళు మూసుకుంటే ఎంత బాగుండునా అనిపిస్తోంది ' శోభ కళ్ళల్లో మళ్ళీ నీళ్ళు నిండుకున్నాయి సుడులు తిరిగి దారి లేక క్రిందికి జాలు వారాయి"

మళ్ళీ తానే అంది 'నన్నెందుకు ఇంత చిత్రహింసలు పెడుతున్నారు నేనేంపాపం చేశాను ఇక చాలు ఈ మనశ్శాంతి వెతదాంపదండి ' అంటూ కారు దగ్గరకు దారి తీసింది శోభ శ్రీలక్ష్మి, ఉష కూడా కారు చేరుకున్నారు

కారు స్టార్టు అయిన ధ్వని వినబడితే శ్యామం ఆవైపు చూచాడు

'చూశావా శ్యామం నీవెంత అమాయకుడివో నువ్వంటూ ఇక్కడ కనిపించకపోతే, వాళ్ళు మరి కాసేపు ఇక్కడ వుండేవాళ్ళే నీవు వున్నందుకే, వాళ్ళు వెళ్ళిపోయారు నీలోని బలహీనతను ఇప్పటికైనా చంపుకో. విజ్ఞత, వివేకం గల వ్యక్తిగా మసలుకో ' అంటూ శ్యామం మనసు హితవు చెప్పింది. తన తెలివి తక్కువ తనానికి తనను తానే నిందించుకున్నాడు శ్యామం

ఎదురుగా వున్న రాయిని బూటు కాలితో ఒక్క తన్ను తన్నాడు

చక చక నడుస్తూ వెళ్ళి స్కూటర్ స్టార్ట్ చేసి ఇంటి ముఖం పట్టాడు

★ ★ ★ ★ ★ ★

సుబ్బారావుగారు స్వంత ఇల్లు ఖాళీ చేసి అద్దె కొంపలో ప్రవేశించారు చోటు చాలనందువల్ల కొంత సామాను మూటలు కట్టి ఓ మూల వుంచేశారు






టేబిల్, పడక కుర్చీ, వంట పాత్రలు– ఇవే వాడుకుంటున్నారు

సరోజకు జ్వరం వచ్చింది ఓ మూల మంచం వేసి పడుకోబెట్టారు క్రితం రాత్రి తెచ్చిన రెండు టాబ్లెట్‌లలో ఒకటి మిగిలివుంటే, కూతురును లేపి, సుబ్బమ్మగారు ఆ టాబ్లెట్ వేసింది

సుబ్బారావు గారు సాధారణంగా ఉదయం ఏడున్నర గంటల నుంచి పిల్లలకు ప్రైవేటు చెబుతారు. ఆరోజు ఇద్దరు కుర్రాళ్ళు మాత్రమే వచ్చారు వారు నెల జీతాలు మాస్టారు చేతిలో పెట్టారు వారిలో ఓ కుర్రాడిలా చెప్పాడు–'మేస్టారూ! మానాన్నగారు ప్రైవేట్ వద్దన్నారండి ..'

'మంచిది. నీవురా గోపాల్ నీ సంగతి . ?'

'మానాన్న గారు కూడా మానేయమన్నారండి '

'అలాగా సరే. అబ్బాయిలూ, నాకు ఇల్లు లేదు వాకిలిలేదు పేదముండా కొడుకుని. ఈ పూరికొంపలో, ఈ పొగ మధ్య మీకు చదువు ఎలా అబ్బుతుంది నేనే జీవితంలో ఇంకా పాఠాలు నేర్చుకోలేదు. మీ కెలా చెప్పగలను . ' చివరి మాటలు అన్నప్పుడు ఆయన వదనంలో ధైన్యం కనిపించింది

'వెళుతున్నాం మేస్టారూ !'

'మంచిది నాయనా '

ఆ పిల్లలిద్దరూ వెళ్ళి పోయారు. మరి కొద్ది సేపటికి మరో ముగ్గురు పిల్లలు వచ్చారు సుబ్బారావు గారి మనసు అప్పటికే వికలమై పోయింది ఆ పిల్లల్ని చూడగానే ఇలా అన్నారు

'బాబు, మీరు కూడా వెళ్ళండి నేను ప్రైవేట్లు చెప్పలేను విరమించుకున్నాను. మనసు ప్రశాంతంగా లేక పోతే చెప్పడం సాధ్యం కాదు మరే మాస్టారు దగ్గరైనా చక్కగాచదువుకోండి.'

'సరే లెండి . ' అంటూ ఆ పిల్లలు బయలుదేరబోయారు సుబ్బారావు గారినేత్రాలు ఈ సారి సజలమైనాయి

'బాబు! ఒక్క మాట! మీకు విద్యాబుద్ధులు చెప్పించి వృద్ధిలోకి తెస్తున్నది మీ తల్లిదండ్రులే ఈ విషయాన్ని ఎన్నటికీ మరచి పోకండి వాళ్లకు ముసలితనం వచ్చాక ఏ తృణమో , పణమో మీరు ఇవ్వగలిగింది ఇవ్వండి లేకుంటే పాపం . విన్నారా నామాట లేకుంటే భగవంతుడు కూడా మెచ్చడు వెళ్ళి రండిబాబు, ఇక వెళ్ళండి. ' అని నిట్టూర్పు విడిచారు ఆ ముగ్గురు పిల్లలు కూడా వెళ్ళిపోయారు

భర్త మాటలన్నీ భార్య వింటూనేవుంది

'ఏమండీ, ప్రైవేట్లు మానేస్తే ఎలా . . ?'

'ఎలా ఏముంది. అలాగే గడుస్తుంది నామనసు బావుళ్లేదు ముందు, పిల్ల పెళ్ళి చేసేయాలి. తర్వాత విషయం తర్వాత.'

ఈసారి భార్య ఏమి మాట్లాడలేదు. ఆయనే అన్నారు మళ్ళీ

'నేను ఊళ్ళు వెళ్ళి బంధువుల్ని కలిసి, సంబంధాలున్నాయేమో విచారిస్తాను ఇంతకుమించి చేయగలిగినదేమి లేదు!'

'పోనీ ఉత్తరాలు రాస్తే ?'

'ఉత్తరాల వల్ల పనుల్లు జరుగుతాయా .. ఎవరే, మనకోసం పనులు మానుకుని తిరిగేది మనపట్ల ఎంతో అభిమానం వున్నదనుకున్న అల్లుడే ఇంతవరకు సమాధానం రాయలేదు '

'పనిలో పని, అల్లుడు గారివూరు కూడా వెళ్ళిరండి'

'సరే మంచిరోజు చూచి బయలుదేరుతా '

'అలాగే కానివ్వండి అన్నిటికి ఆ పరమాత్ముడే వున్నాడు '

'అన్నట్లు రేపే మంచి రోజు బయలుదేరి వెళ్ళనా '

'మీ ఇష్టం '

'శంకరం డాక్టరు గారి మందే వాడుతూ వుండు అమ్మాయికి బహుశా రేపటికి నిమ్మళించవచ్చునేమో '

* * * * * *

మరునాడు, సుబ్బారావుగారు కూతురు పెళ్ళి సంబంధాల కోసం బయలుదేరి వెళ్లారు

వెళ్ళి అప్పుడే నాలుగు రోజులైంది సరోజకు జ్వరం తగ్గింది మంచం మీద

# అంతరాలు – ఆంతర్యాలు

కూర్చుని, చినిగిన చీర కుట్టుకుంటోంది తల్లి వంట చేస్తోంది ఇంతలో పోస్ట్ అన్న కేకవినబడింది. తల్లి లేచివెళ్ళి, కవరు అందుకుంది. అడ్రసు ఇంగ్లిషులో వుంది

'అమ్మాయ్ ! ఇది ఎవరు రాశారో చూడవే .. ' అని ఆ కవరును, కూతురు చేతికిచ్చింది ఆ కవరు పాత ఇంటి అడ్రసుకు వెడితే, దాన్ని ఇక్కడకు డైవర్టు చేశారు ఆ కవరు చించి చూడగా, దానిలో పెద్ద ఉత్తరం కనబడింది క్రింద సంతకం చూచింది. శ్యామసుందరరావు అని వుంది. సరోజ మొదట గతుక్కుమన్నది. దాన్ని , తిరిగి ఆ కవరులో పెట్టబోయింది కాని, తల్లి. . 'ఎవరు రాసిందేమిటి చదువమ్మా కాస్త ' అంది పేరు చెప్పడానికి కూతురు తటపటాయించింది. తల్లి నిగ్గదిస్తుందని తెలుసు ఇక తప్పదని చెప్పింది .. 'శ్యామంగారు రాశారు ' అని

శ్యామం పేరు వినగానే తల్లి తత్తరపడింది. లేచి కూతురు దగ్గరకు వచ్చింది.

'ఏదమ్మా! ఆ ఉత్తరం చూడనీ. అది నీకే రాశాడా?'వుండబట్టలేక అడిగింది

'కాదు, నాన్నగారికే.'

'అయితే, ఏమిరాశాడో చదువు '

సరోజ చదవడం ప్రారంభించింది తల్లి వింటోంది

'పూజ్యులైన సుబ్బారావుగారికి, నమస్కృతులు– మీరు ఇటీవల నన్ను బజారులో కలిసినప్పుడు అదోవిధంగా మాట్లాడారు మన మధ్య ఎప్పుడూ అభిప్రాయ భేదాలు రాలేదు. ఆ విషయం మీకూ తెలుసుననుకుంటాను పూర్తి విషయాలు చెప్పకుండానే వెళ్ళి పోయారు. నేనే, మీ ఇంటికి వచ్చి విపులంగా మాట్లాడుదామనుకున్నాను. కాని, నన్ను అవమానిస్తారేమో నన్న భయంతో రాలేదు నా విషయంలో మీరు దురవగాహనకు వచ్చినట్లు గ్రహించాను అందుకే ఈ ఉత్తరం రాస్తున్నాను సరోజ , మాఇంటికి వస్తే రావద్దని చెప్పమన్నారు 'మా అమ్మాయికి పెళ్ళి కావద్దా' అని నిష్ఠురంగా ప్రశ్నించారు ఈ మాటలను బట్టి, నన్ను మీరు పూర్తిగా అర్థం చేసుకోలేదని భావించాను మీరు, తొందరపడి మాట్లాడినా, మీ బాధను నేను అర్థం చేసుకున్నాను కాబట్టి, మీపట్ల గౌరవ భావం నాకు ఇప్పటికి తొలగిపోలేదు మీరు త్యాగధనులని నాకు తెలుసు ఆర్థికంగా మీకుటుంబం చితికి పోయిందని కూడా తెలుసు సరోజ వివాహం , మీకు ఒకగడ్డు సమస్యగా పరిణమించిన విషయం కూడా నాకు పూర్తిగా తెలుసు

.ఇవన్నీ తెలుసును కాబట్టే, మీరు అంత తీవ్రంగా మాట్లాడినా, నామీద అభాండాలు వేసినా, సహించాను, నాగురించి, మీరు పూర్తిగా అపోహపడ్డారని మాత్రం గట్టిగా చెప్పగలను ముఖ్యంగా సరోజ విషయంలో నా ప్రవర్తన పట్ల మీరు ఏదైనా ఊహించుకుని వుంటే అది పూర్తిగా పొరపాటని చెప్పదలచాను మా ఇంటికి వచ్చి చనువుగా మాట్లాడినంత మాత్రాన, నేను, మీ వంశ ప్రతిష్ఠకు భంగం కలిగేవిధంగా, మీ అమ్మాయితో వ్యవహరిస్తానని ఎలా ఊహించారో తెలియదు.

సరోజకు మంచి సంబంధం చూచి పెళ్ళి జరిపితే, సంతోషించే వారిలో నేను ప్రథముడిని. పైగా, నా చేతనైన సహాయం తప్పకుండా చేదామనుకుంటున్నాను . '

ఈ వాక్యాలు చదువుతోంటే, సరోజ పెదవులు వణకడం ప్రారంభించాయి. అక్షరాలు గజిబిజిగా వున్నట్లు తలపించింది మాటలు సరిగా పలుకలేక పోతోంది . సుబ్బమ్మగారు కూడా దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది.

'సరిగ్గా చదవ్వేమే ... పూర్తికానివ్వు . '

సరోజ మళ్ళీ చదవడం ప్రారంభించింది–

'మీ అమ్మాయి అమాయకురాలు సుగుణవతి కొద్ది రోజుల పరిచయంతోనే , నేను అన్ని విషయాలు గ్రహించాను బుద్ధిమంతుడు, తన కాళ్ళమీద తాను నిలబడి కుటుంబాన్ని పోషించగలవాడు– ఎవరైనా అబ్బాయి, మంచివాడు లభిస్తే తప్పక, పెళ్ళి చేయండి నేను, ఎల్లప్పుడూ మీకు బాసటగా వుంటానని హామీ యిస్తున్నాను నన్ను ఇకనైనా అపార్థం ' ' కోవద్దని ఆశిస్తున్నాను

సెలవు

భవదీయుడు

శ్యామసుందరరావు

ఆ ఉత్తరం, సరోజ చేతిలో నుంచి జారి క్రిందపడింది. దానిమీదనే, నాలుగైదు అశ్రుబిందువులు కూడా పడ్డాయి ఆ ఉత్తరాన్ని సుబ్బమ్మగారు తీసుకుంది

'అమ్మా.. ఈ ప్రపంచంలో న్యాయం లేదమ్మా !'అంటూ సరోజ, మంచం మీద మెల్లగా వాలిపోయింది దిండులో తలదూర్చి శోకిస్తోంది

'ఊరుకోవే తల్లి . నీవు, వట్టి వెర్రిబాగులదానివయ్యావు మనుషుల్ని అర్థం చేసుకోకుండా, మనసుపారేసుకోవడం, నిర్ణయాలకు రావడం ఎంత












# సాంప్రదాయకమైన గులాబ్ జామూన్లవంటి పిండివంట చేయుటకు గంటలతరబడి అవశ్యం



## "రుచితో ఇప్పుడు నిమిషాలలో ఇది సాధ్యం"



రుచి గులాబ్ జామూన్ మిక్స్ ఆనందాన్ని చిందించే శ్రేష్ఠమైన సాంప్రదాయకపు నోరూరించే రుచులను గుభాళింపుతూ నిమిషాలలో ఒనగూర్చగలదు తూకం తూయవలసింది లేదు. కొలత చూడవలసింది లేదు. కాచుక్కూర్చోవలసిందీ లేదు ప్రత్యేకమైన ముడి వస్తువుల కలయికలతో ప్రతి ఒక్క రుచి గులాబ్ జామూన్ మిక్స్ తయారు చేయబడింది. ప్యాకెట్టును విప్పటమే తరువాయి, మీరు యిష్టపడి కోరుకొనే - రసభరితమైన, రుచులూరించే, బంగారు వర్ణపు గోధుమ రంగు గులాబ్ జామూన్లను తయారు చేయ మీరు సన్నద్ధంగావచ్చు. అవి క్షణికంలో మీ నోటిలో కరిగిపోగలవు!




ఇప్పుడు దొరుకుతోంది.
రుచివారి క్రొత్త
బొంబే
హల్వా మిక్స్




**రుచి గులాబ్ జామూన్ మిక్స్**

విదేశీ కొనుగోలుదారులనుండి
ఎంక్వయిరీలు కోరబడుతున్నాయి.

9360 T G

# అంతరాలు - అంతర్యాలు

ప్రమాదమో ఇప్పటికైనా తెలిసిందా '

'అందుకు కాదమ్మా నేను బాధపడుతోంది మంచివాళ్ళుగా నటించే వారి మోసాలను తలుచుకుని ఇలాంటి వాళ్ళు ఎన్నో నీతులు వల్లిస్తారు పేదవాళ్ళని ఆదుకోవాలని, ఉద్ధరించాలని కబుర్లు చెబుతారు. కట్నం లేకుండా, కులాన్ని చూడకుండా పెళ్ళి చేసుకోవాలని సిద్ధాంతాలు వల్లిస్తారు. ఇవన్నీ మాటల వరకేనమ్మా... అంతే.. మనబోటి పేదవాళ్ళం, ఈ మాటలు విని మోసపోతాం చివరకు అవమానం జరిగితేగాని బుద్ధిరాదు '

'నే చెబితే విన్నావుటే వెర్రిదానా. ఆ అబ్బాయి చెప్పిన ఉపన్యాసాలు తీసుకొచ్చి నాముందు వల్లించావు. అవునా... ?'

'అవునమ్మా, నమ్మాను మోసపోయాను. గొప్పవాళ్ళకు, పేద వాళ్ళకు మధ్య ఎన్నటికీ పొత్తు కుదరదని ఇప్పుడు గ్రహించాను '

'సరోజా! మన పరిస్థితి మనకు తెలుసు అలాంటప్పుడు లేనిపోని ఆశలు పెంచుకోవడం పొరపాటు కదే!'

'నిజమేనమ్మా, ఇప్పుడు పూర్తిగా అర్థమైంది. ఆదర్శాలనేవి వట్టి బూటకం అవి చెప్పడానికే పనికొస్తాయి అంతే నాన్న, నీవు పడుతున్న బాధను నేను చూడలేకుండా వున్నాను ఎవరినైనా సరే చేసుకోదలచాను. బావనైనా సరే చేసుకోడానికి సిద్ధంగా వున్నాను. ఇక నా జీవితం ఇంతే. వయసున్నా లేనట్లే తీక్క కోర్కెలన్నీ.ఏనాడో చంపుకున్నాను " ఈ మాటలన్న తర్వాత సరోజ దిగులుగా చూస్తూ పడుకుంది కన్నీళ్ళు మాత్రం ఆగలేదు

'నిజమేనే, ఎవరి అంతరంలో వాళ్ళుండాలి అంతరాలు మరిచి ఆశలు పెంచుకోడం, ఆదర్శాల పేరుతో అభాసుపాలు కావడం .. ఇవన్నీ మనకు చేనికమ్మా ' మి బావ తప్పకుండా ఒప్పుకుంటాడన్న నమ్మకం నాకు ఇప్పటికీ వుంది '

జీవితంలో వసంత శోభ ఎవరికి వున్నా లేకున్నా పేదవారికి మాత్రం మృగ్యం అది కేవలం ఎండమావుల వంటిది

మరో రెండు రోజులు దొర్లుకుపోయాయి సరోజకు నిమ్మళించింది అయినా చురుకుదనంలేదు పరధ్యాన్నంగానే వుంటోంది ఒకటికి రెండుసార్లు పిలిస్తేగాని పలకడంలేదు ఏ స్నేహితురాలింటికి వెళ్ళడంలేదు ఎవరూ కూడా, వీరింటికి రావడంలేదు. ఆమె హృదయం మూగబోయింది ఆలోచనలు మందగించాయి తిండి ధ్యాసకూడా లేదు జీవితమంటే ఓ విధమైన ఏహ్య భావం ఏర్పడింది ఎప్పుడూ తైల సంస్కారం లేని చింపిరి జుత్తుతో నే వుంటోంది.

కూతురు పరిస్థితి చూస్తోంటే తల్లి కడుపు తరుక్కుపోతోంది కాని, ఏమి చేయలేని స్థితి

'అమ్మాయ్! కాస్త, వేళకు స్నానం చేసి భోం చేయవే అలా రోజు రోజుకు చిక్కి శల్యమై పోతున్నావేమే నేను చూడలేనే ' ఎంతో బాధతో అంది తల్లి

'అమ్మా, నా గురించి పట్టించుకోకు నేను శవంలా తయారైనా బాధలేదు కాని, ఆ మూడు ముళ్ళు పడి, నా బరువు, మీకు తీరిపోతే అదే చాలు. ఆ తర్వాత నేను బ్రతికినా.. లేకపోయినా ' ఆ పైన సరోజకు మాట పెగలలేదు.

సుబ్బమ్మగారు, కూతురును సమీపించి, తల నిమిరింది రేగిపోయి వున్న జుత్తు అణగనేలేదు మెడలో ఇప్పుడు ప్లాస్టిక్ పూసల దండ కూడా లేదు జాకెట్టు రెండు చోట్ల పిగిలి, ఆ బక్క చిక్కిన శరీరం కాంతి విహీనంగా కనపడుతోంది. కళ్ళలో తేజస్సు లేకపోయినా, ముచ్చటైన ఆ రూపంలో దాగివున్న సహజ సౌందర్యం కొట్టవచ్చినట్లు కనపడుతోంది.

'సరోజా . దిగులుపడకు . ఆ ఏడుకొండలవాడు మన పక్షానే వున్నాడు మనకే జయం కలుగుతుంది. నా మాట విని, లేచి, భోంచెయ్ ' తల్లి బ్రతిమాలింది

సరోజ లేచి, స్నానంచేసి భోంచేసింది అప్పటికి సాయంత్రం ఆరున్నర గంటలు దాటింది చీకటి ఆవరించింది వెళ్ళి, మంచంమీద మేను వాల్చి ఆలోచిస్తోంది చల్లని గాలులు శరీరానికి సోకి ఏవేవో ఆలోచనలు, అనుభూతులు వరుసగా దొర్లిపోతున్నాయి అలసట వల్ల కళ్ళు మూ శలు పడ్డాయి ఈసారి ఎందుకోగాని, పాపం, హాయిగా నిద్రపట్టింది నిద్ర ప్టన కాసేపటికే, పెదవులపై చిరునవ్వు మెరిసింది ఎందుకోమరి . ??

అది వసంతకాలం సంధ్యారుణ కాంతులు దశదిశలకు విరజిమ్ముకుంటుంటే, ప్రకృతి శోభ అనన్య తేజంతో విలసిల్లుతోంది

వినీలాకాశంలో ధవళవర్ణ శోభితమైన, మేఘపుంజాలు ఝరివేగంతో పరవళ్ళు త్రొక్కుతూ, పయనిస్తున్నాయి వాటిని వెంబడిస్తున్నాయి. పలురకాల పక్షుల గుంపులు అరుణకిరణ స్రవంతులు ప్రతిఘటించగా, సప్తవర్ణ సమ్మిశ్రితమైన 'అర్ధచంద్రాకృతి', సాగర తలంపై కొలువు తీరింది

ఒక వైపు దివ్య సుందరోద్యానవనం మరో వైపు నిశ్చల గంభీర జలధి ఒక వైపు అందాలు చిందించు తరులతాశ్రేణులు మరో వైపు నురుగుల తరగలు విరజిమ్మ ఉవ్వెత్తు కెరటాలు. ఒక వైపు సమ్మోహన భరితమైన పరిమళాలు వెదజల్లు సౌగంధ్య పుష్పాల సొరు తీరు వేరొక వైపు అల్లన వచ్చి, మెల్లన ముద్దాడి, చల్లన జీరాడి పొరాడు వయ్యారి అలలకు వీడ్కోలు చెప్పు చంద్రకాంత శిలబోలు సైకతస్థితి దానిపై, పాల్కడలిపై శేషతల్ప శాయివోలె, చిరునవ్వులు కురిపిస్తూ, సయ్యాట వేళ ఇదేగా, అన్నట్లు పడుకున్నాడు ఆహ్వానిస్తున్నాడు ఎవరు ? శ్యామం






# కాలితే ఏం చేయాలో మా అమ్మకు బాగా తెలుసు.

## తనకి అమ్మమ్మ నేర్పిందిట.

అబ్బ, అమ్మంటే మా అమ్మలా ఉండాలి. ఎంత బాగా చూసుకుంటుందని! అమ్మ మొన్న నా బుజ్జి బొమ్మ గౌను ఇ.' చేస్తుంటే పొరబాట్న నేను చెయ్యి పెట్టాను. వేలు కాలింది. గబగబా అమ్మ బర్నాల్ రాసింది. కాలితే అమ్మమ్మ కూడా అలాగే బర్నాల్ రాసేదిట.

నా బుజ్జి పాపా, నీకెప్పుడైనా కాలిందంటే నేనూ బర్నాల్ రాస్తాలే, బాగయిపోతుంది.
కదమ్మా! కదూ బర్నాల్!




# బర్నాల్

ఇంటింటా విశ్... ది.

BL 2078

## అంతరాలు – అంతర్యాలు

ముగ్ధమోహన రూపంతో, క్రీగంట చూపులత గిలిగింతలు పెట్టే ఏవేవో వెచ్చని అనుభూతుల, అనుభవాల కోసం, జాగును వోపలేక, సైపలేక పోతున్నట్లుగా కూర్చున్నది. ఎవరు. ? ఇంకెవరు? సరోజ .

శ్యామం లేచాడు కూర్చున్నాడు సరోజను 'ప్రేయసీ' అంటూ మెల్లగా పిలిచాడు ఒడిలోకి ఆహ్వానించాడు. ఆమె బిడియపడింది. ప్రక్కగా జరిగి సరోజ భుజంమీద చేయి వేశాడు ఆ చేతి వ్రేళ్ళు ప్రాకుతూ మెల్లగా వెళ్ళి ఆమె చెక్కిళ్ళను మృదులంగా తాకాయి. విద్యుల్లతలా మెరిసింది సరోజ వదనం గుండె ఝల్లుమన్నది కాబోలు త్రుళ్ళిపడింది అణువణువు కంపించిపోయింది కాబోలు ఒక్క క్షణం - మరుక్షణం మైమరిచింది. అర్ధనిమిలిత నేత్రయై ప్రియుని ఒడిలో వాలిపోయింది పాపం పయ్యెదకు సిగ్గువేసి ప్రక్కకు తొలగింది. ప్రియుని హృదయం లాలనగా ఆహ్వానించింది దరిజేరమని. ఆ, అయస్కాంతపుశక్తికి తాళలేక, సరోజ వక్షం చివ్వున దూసుకుపోయి మెత్తగా, ఒత్తుగా హత్తుకుంది మైమరచినా, ఆ మత్తులో ఏవేవో శబ్దాలు, అర్థాలు తెలియని శబ్దాలు, సరోజ అధరాలపై చిందులు వేసినప్పుడు, హృదయం అందించిన ప్రేమామృతం చిలికింది సజలనేత్రాలు, సరసి జాలుగా తలపించగా, శ్యామం అధరాలు అందుకుని అద్దుకున్నాయి

తనువులు ఏకమై, పులకింతలతో ఆనందపు లోతుల అంచులు చూశాయి.

మత్తు వదలింది మాటలు సాగాయి

'శ్యామ్! నేను నీ దాసిని ప్రాణసఖిని మన ఇరువురి హృదయాలు ఏకమైనాయి ,, కదూ!'

'అవును సరూ! నీవు నా దానవు నేను నీ వాడిని ఎల్లప్పుడూ ఇలాగే ఆనందడోలికల్లో తేలిపోదాం .'

'మరి . మన వివాహం ..?'

'వివాహమా .. ఎందుకు దానివల్ల ప్రయోజనం ఏముంది?'

'శ్యామ్! మన ప్రేమ పుష్పించి, ఫలించాలి జన్మ జన్మలకూ శోభించాలి '

'కాదనను నీతో వివాహానికి మా పెద్దలు అంగికరించరు అంతరాలు వేరు, అంతస్థులు వేరు కులం వేరు '

'అయితే నీ ఆదర్శాలు?'

'నా కోసం కాదు, ఇతరుల కోసం.'

'అంతేనా?'

'అవును అంతే.'

'నన్ను వంచించడం న్యాయమా?'

'ఆ మాటకు అర్థం నాకు తెలియదు '

'అయితే, నేనే పొరపడ్డానన్న మాట '

'నాకు తెలియదు. అంతా నీ భ్రమ నన్ను నీవు అర్థం చేసుకోలేదు'

'నేను వంచితను .. భ్రమపడ్డాను . పొరపడ్డాను . నాదే తప్పు నాదే తప్పు ..''

ఈ చివరి మాటలను సరోజ పెద్దగా అనడంలో తల్లికి వినిపించాయి వెంటనే వెళ్ళి కూతురును నిద్ర లేపింది

'ఏమిటే తప్పు తప్పు అంటున్నావు కలవరిస్తున్నావా ఏమిటి . కలగాని వచ్చిందా .. ?'

సరోజ చివాల్న లేచి కూర్చుంది అప్రయత్నంగా తన చెంపలు తాకి చూచుకుంది. పమిట సర్దుకుంది

'ఏమిటే, నిజంగానే కలవచ్చిందా ... ఇంకా రాత్రి కానే కాలేదు '

'కల కాదు లేవే ఏదో అలా కలవరించి వుంటాను. మనసేం బాగోలేదు '

'ఏమిటో లే ఆ మూడు ముళ్ళు పడితేగాని, ఈ కలవరింతలు, కలలు పోవు '

సరోజ కాసేపు అలా ఆలోచిస్తూ కూర్చుంది

(ఇంకా ఉంది)




## శేషు. నర్సాపురం

★ ఆంధ్రలో ఏ ప్రాంతంలో వారు తెలుగు భాషను బాగా మాట్లాడుతారు?

● తూ గో జి (నేనక్కడిదాన్నే!)

## డి. ఎల్. డి. చోడవరం

★ మళ్లీ అల్లూరి సీతారామరాజు పుడితే!

● ఈ నల్ల దొరల నుంచి మనకి ఏదైనా విముక్తి మార్గం చూపెడాడు

## ఎస్. వి. ఆర్. గుడివాడ

★ మీరే ప్రశ్నలకు సమాధానా లివ్వడం- ఈ దేశాన్ని అశ్రిత పక్ష పాతం చెద పురుగు పట్టి పీడిస్తూందనడానికి ఒక మచ్చుతునక అని నా అభిప్రాయం

● ఈ దేశంలో ఇష్టం వచ్చినట్టు వాగే స్వేచ్ఛకూడా వుందనడానికి- మరొక నిదర్శనం - కాదా?!

## సి. హెచ్. ఆర్ కొవ్వూరు

★ కె రా గారూ ఏ పేపరులో చూసినా మహిళలు మెచ్చిన చిత్రం అంటున్నారు కారణం?

● వారు చూడక పోతే డబ్బులు రావని- చూడమని సజెస్టు చేస్తున్నారంతే?

## ఎస్. వి. ఆర్. గుడివాడ

★ ప్రతి వ్యక్తి జీవిత చరిత్రలోనూ ఒక స్త్రీ పాత్ర గణనీయంగా వుంటుందంటారు అలాగే ఆరుద్ర గారి విషయంలో ఆ స్త్రీ మీరేనని మీ ఫొటో చూడగానే అనుకున్నాను యామ్ ఐ కరెక్ట్?

● ఎస్ యు ఆర్ కొలంబస్!

## పి. ఎస్. ఆర్. ఎమ్. గుంటూరు

★ ఆడవారంతా మగవారిపై తిరగబడితే?

● దేశం బాగుపడుతుంది

★ బంధుత్వం, స్నేహం వీటిలో ఏది గొప్పది?

● దేనికది గొప్పదే కాని స్నేహం బంధుత్వం కన్నా గొప్పదని పిస్తుంది- దీనిలో స్వార్థం వుండదు కనుక

★ ఒక రచయితగానీ రచయిత్రి గాని పది కాలాల పాటు నిలబడాలంటే ఏది ముఖ్యం?

● స్వంతంగా రాయడం ముఖ్యం, నిజాయితీగా వుండడం ముఖ్యం

★ దేనికి ఉపయోగపడని నేటి సాహిత్యంపై మీ అభిప్రాయం ఏమిటి?

● పత్రికలు పోటీలు పడి అమ్మడానికి ఉపయోగ పడేది సాహిత్యం కాదు రచన ఇది అందరికీ ఉపయోగపడాలనీ, శాశ్వతంగా నిలబడాలనీ రూలు లేదు

## ఎన్. హెచ్. పి. స్టూ ఆర్ట్స్ పురం

★ నాకు పదమూడో ఏటి నుంచి రాయాలనే అభిలాష వ్రాస్తూనే వున్నాను తిరిగి వస్తూనే వుండేవి నిరుత్సాహపడుతున్న సమయంలో రాస్తూంటే పాతి కేళ్లకైనా పెద్ద రచయిత్రి అవుతారు అనే సమాధానం కొత్త ఉత్సాహం యిచ్చింది నా రచన లిప్పుడు ఫలితా లిచ్చాయి

● చూశావా? తీయగా తీయగా రాగం రాయగా రాయగా రచన- అనేది నిజం

## జి ఎల్ రాజమండ్రి

★ ఒకే యింటి పేరు ఒకే గోత్రం కల ఒక అమ్మాయి అబ్బాయి ప్రేమించుకున్నారు పెద్దలు అంగీకరించడం లేదు కారణం అన్నా చెల్లెలు వరస అవుతారని

● సగోత్ర వివాహాలు- అంతగా చెయ్యరు- ఏదో తరంలో వీరి- వారి చుట్టాలు చాలా దగ్గర బంధుత్వం వుందేమోనని కాని అసలు సంబంధమే లేని- సగోత్ర కుటుంబాలు వుంటూ వుండవచ్చు పెద్దలు వద్దనడం మూఢ నమ్మకం కాదు - ముందు జాగ్రత్త మేనరికాల్లాగే యివీ శాస్త్ర దృష్ట్యా అంత మంచివి కావని ఆధునికులూ అంటున్నారు పెళ్లంటే- యిద్దరు వ్యక్తుల కలయికే కాదు భావి సంతతి కూడా అన్న సంగతి మనం మరిచి పోకూడదు ఓపిక వుంటే- తరాలు వెనక్కి చుట్టరికాలు తవ్వమనండి

## ఎన్. ఎస్. బాపట్ల

★ ఈ మధ్య 'ఒక సినిమా' చూశాను. దానిలో డైలాగులు వగైరాలకు నేను చాలా సిగ్గుగా అసహ్యంగా ఫీలయ్యాను

● ఇలాంటివి చూసినప్పుడు అంతా కలిసి ఛైర్మన్, ఫిల్మ్ సర్టిఫికేషన్ బోర్డు, బొంబాయికి -తిన్నగా ఉత్తరం రాయాలి రాజీవ్‌గాంధీకి రాయాలి అరవగా అరవగా - ఎవరో ఒకరు వినక పోరు. స్త్రీలలో చైతన్యం లేకనే -స్త్రీలు మెచ్చిన చిత్రాలంటూ సిగ్గు లేకుండా ప్రకటనలు చేస్తున్నారు మహిళలు యిలాంటి చెత్త చిత్రాలని పోషించుతున్నారని బహిరంగంగా వారంటుంటే -కనీసం 'మేం కాదు' అని పత్రికాముఖంగానేనా ఎందుకు నిరసన ప్రదర్శించరు? ఆలోచించండి ఊరుకుంటే - పొరపాటుగా అర్థం చేసుకుంటున్నారు

## ఎం. ఆర్. అరివీడు

★ "మగవాడిని ఆడది ఏలుతుంది మీరు అనకపోయినా నేను ఒప్పుకుంటున్నాను 'ఆడదాన్ని దెయ్యం ఏలుతుంది' ఒప్పుకుంటారా?

● ఒప్పుకుంటాను -ఆ దెయ్యం - మగాడని!

## డి. ఎస్. పి. కరీంనగరు

★ మీరు రాసిన 'దేవుడు లేని చోట' అనే నవలను చదివాను శంకర్ పాత్ర చాలా బాగుంది మొత్తానికి ఈ నవలలో నిది చిత్ర పరిశ్రమ వారు సినిమా తీసినచో చాలా బాగుంటుంది

● మనం వాళ్లకి చెప్పక్కరలేదు సార్, వాళ్లకి బాగుంటే ఆపలేం! అక్కర్లేనప్పుడు ఒప్పించలేం" అంచేత -చదివి ఆనందించారు- అది చాలు □



# గీటురాయి

### ఇచ్ఛాపురపు రామచంద్రం

"రవీ! ఇంటర్వ్యూకి టైము కావడం లేదూ? అలా ఉన్నావేం? భయపడు తున్నావా?"

రవి ఏమీ అనలేదు మౌనంగా ఉండి పోయాడు

పాపారావతని దగ్గరగా వొచ్చి- ఆప్యాయంగా భుజం మీద చెయ్యి వేశాడు "మొదటిసారి అలాగే ఉంటుంది. అయినా నీకు భయమేమిటి?అపరిమితమయిన తెలివి తేటలు కలవాడివి. నీకి ఇంటర్వ్యూ ఓ లెక్కా?" అంటూ కొడుకుని – గోడవద్ద నున్న అద్దాల బీరువా ముందుకి నడిపించుకు వెళ్ళాడు

"చూడు ఈ బీరువా నిండా నీకు వొచ్చిన ప్రయిజులే ఎన్నెన్ని పుస్తకాలు! మెడల్స్.. సర్టిఫికేట్సు! టెన్త్‌లో డిస్ట్రిక్ట్ ఫస్ట్ ఇంటర్‌లోనూ డిగ్రీలోనూ కాలేజీ ఫస్ట్. నీ కొచ్చిన స్కాలర్‌షిప్పులు ఎవరి కొచ్చి ఉంటాయి? నువ్వు నాకు గర్వ కారణం. నీలాటి కొడుకు ఏ తండ్రి కయినా గర్వకారణమే పరిస్థితులు వక్రించబట్టి కాని – లేకపోతే నిన్ను పై చదువులకే పంపేవాణ్ని నన్ను క్షమించు నీ తెలివి తేటల కన్యాయం చేస్తున్నా నేమో

"లేదు నాన్నా.. లేదు. . నువ్వు అలా బాధ పడొద్దు. " కంగారుగా అన్నాడు రవి

"గుడ్డిలో మెల్లగా- యీ ఉద్యోగం సామాన్యమయినది కాదు నీలాటి తెలివైన వాడికి కుశాగ్ర బుద్ధికి పైకి పోవడానికి చాలా చక్కని అవకాశాలున్నాయి దీనిలో – ప్రస్తుతానికి చిన్న ఉద్యోగంలా అనిపించినా. పైగా లంచం యివ్వక్కర లేదు. రికమెండేషను చేయించ నక్కర లేదు అంతా స్ట్రిక్ట్ ప్యూర్ మెరిట్. ఇటువంటి సువర్ణావకాశాలు అరుదుగా వొస్తాయి ఇది నీకు ఫస్ట్ ఇంటర్వ్యూ. ఏ పరీక్షలో నయినా ఫస్టున వొచ్చే నువ్వు. టెన్త్‌లో . ఇంటర్‌లో .. డిగ్రీలో ఫస్టుగా వొచ్చిన నువ్వు- యీ ఫస్ట్ ఇంటర్వ్యూలోనూ ఫస్టునే వొస్తావు. భయం లేదు "

అంతవరకూ తండ్రీ కొడుకుల మాటలు వింటూ నిలుచున్న సత్యవతమ్మ- చటుక్కున కలగజేసుకుని. "ఔన్నాన్నా మీ నాన్నగారు చెప్పింది అక్షరాలా నిజం నీకి ఉద్యోగం వొచ్చి తీరుతుంది నువ్వు అపర బృహస్పతివే నా బంగారు కొండవి." అంది గర్వంగా

పాపారావు నవ్వారు. "తల్లి దీవెన తప్పదంటారు. రవీ! నీ కుద్యోగం రావడం ఖాయం. ధైర్యంగా వెళ్ళిరా."

అప్పుడే ఆ గదిలోకి అడుగు పెట్టిన వనజ- క్షణంలో నే పరిస్థితి నంతటినీ అర్థం చేసేసుకున్నట్టు.. "నీకు సందేహమూ భయమూ ఏమిటన్నయ్యా? ఇన్‌సల్ట్. ఎప్పుడయినా ఎక్కడయినా ఎందులో నయినా నువ్వే ఫస్ట్ మొనగాళ్ళకి మొనగాడివి నీకి ఉద్యోగం వొచ్చి తీరుతుంది. తిరుగు లేదు నాకు పట్టు చీరా వొస్తుంది సందేహం లేదు అన్నట్టు .. నీకుద్యోగం రావడ మేమిటి, నాకు వొదిన కూడా వొచ్చేస్తుందోచ్." నవ్వుతూ ఒక్కసారాగి . "నాకు తెలుసు, మామయ్య మహా తొందర పడుతున్నాడు నీకుద్యోగం వొస్తే రాధ నిచ్చి పెళ్ళి చేసెయ్యాలని గుడ్‌లక్ . అలా ఉద్యోగం యిలా రాధ చాన్సంటే నీదే అన్నయ్యా "

'ఔను బాబూ . ఇన్నాళ్ళూ మీ మామయ్యకంటికి ఆనేవాళ్ళం కాము మేము, అంతస్తులో తూగలేమని. కాని . ఎప్పుడయితే నువ్వు ప్రతి క్లాసులోనూ ఫస్టునవొస్తూ ప్రయిజులూ స్కాలర్‌షిప్‌లూ పేరూ సంపాదించడం మొదలు పెట్టావో- మీ అత్తయ్య మామయ్యలకి మనమూ మనుషుల్లా అనడం మొదలు పెట్టాము. రాధని నీకిద్దామని ఉందని తెలియ జేశారు ఐతే- పెళ్ళికి ఉద్యోగానికి ముడి పెట్టాడనుకో నీలాటి ప్రతిభాశాలికి ఉద్యోగం రావడ మెంతసేపు?" చిటికె వేశారు పాపారావు, నవ్వుతూ.

"విష్‌యు గుడ్‌లక్ అన్నయ్యా!" అంటూ సాగనంపింది వనజ

రవికి పూర్తిగా అర్ధమయిపోయింది యింట్లో అందరికీ తనమీదా తన తెలివి తేటలమీదా చాలా ఆశలూ నమ్మకాలూ బలంగా ఉన్నాయని ఎందుకో అతని కొక్కసారి భయం వేసింది అయినా సర్దుకుని- దేముడి మీద భారం వేసి అతను ఇంటర్వ్యూకి బయలు దేరాడు

★ ★ ★ ★

"ఓహో!.... రవీ.. . నువ్వు.. . యీ యింటర్వ్యూకి. . నేను కల కనడం లేదుకద?"

శంకర్ అలా పలకరించేసరికి రవి గత్యంతరం లేనట్టు నవ్వుతూ "పరిస్థితు లలాగ వొచ్చాయి " అని గొణిగాడు . తప్పు చేసినట్టు బాధపడుతూ శంకర్ పలకరింపు అతనికి వ్యంగ్యంగా తోచింది శంకర్ నవ్వుతూ- "ఈ యింటర్వ్యూకి నీకు కార్డు రావడం ఒక ఆశ్చర్యమయితే- యీ యింటర్వ్యూకి నువ్వు రావడం అంతకంటె పెద్ద ఆశ్చర్యం. ఊఁ . బాగా ప్రిపేరయ్యావా?" అడిగాడు

"నిజం చెప్పాలంటే అట్టే కష్టపడనే లేదు "

"నీలాటి బ్రిలియంట్ స్టూడెంట్‌కి ప్రిపరేషను దేనికిలే. హైస్కూలు నుంచి- కాలేజీ వదిలేవరకూ- నువ్వెప్పుడు కష్టపడ్డావనీ? పాఠం విన్నట్టే ఉండేవాడివి నేనల్లరి చేస్తూ. పుస్తకం పట్టుకున్నట్టే కనిపించేవాడివి కావు. సినిమాలూ అవీ జోరుగా చూస్తూ. ఐతే ఏం, టెన్త్‌లో... ఇంటర్‌లో .. డిగ్రీలో- ఫస్ట్ రాంక్ నీదేకదా." రవి- త్రుళ్ళిపడ్డాడు శంకర్ తన నెత్తి పొడవడం లేదుకద? అయినా- అసలే వికలంగా ఉన్న తన మనసుని మరింత చిత్రవధ చేయడానికి కాకపోతే- శంకర్ యిక్క డెందుకు దాపరించాలి? తనేమన్నా చెబుదామన్నా- శంకర్ తనకి హైస్కూలు నుంచి క్లాస్‌మేట్. తల్లి పుట్టిల్లు మేనమామ కెరుకే అన్నట్టు శంకర్ ముందు తను నోరెత్తడాని కేమీలేదు. అతనికి- తన గురించి అంతా తెలుసు

"నువ్వు బాగా తయారయ్యావా?" అడిగాడు రవి.

"నిజం చెప్పాలంటే గొడ్డులా కష్టపడ్డాను. ఇక్కడ ఉద్యోగం- లంచం ... రికమండేషను.... కులం – ప్రాతిపదికల మీద కాకుండా కేవలం క్యాండిడేట్ ప్రతిభ చూసే యిస్తారని తెలిసి .. యిక్కడ మెరిట్ తప్ప మరే అడ్డదారి ఉండదని విని ... నా శాయశక్తులా కష్టపడి చదివాను. మొదటి నుంచి నేను కష్టజీవినే కదా!"

ఆ చివరి మాట- రవిలో- గతాన్ని జ్ఞాపకం తెచ్చింది. ఈ శంకరూ మరో విశ్వనాధమూ- రోజుకి పది గంటలో పన్నెండు గంటలో చదివేవారు. తెగ శ్రమపడి చదివేవారు మామూలు పరీక్షల్లో శంకర్ ఫస్టూ, విశ్వనాధం సెకండూ. పబ్లిక్ పరీక్షల్లో మాత్రం తనదే ఫస్టు రాంక్. శంకర్‌కి ఫస్ట్ క్లాసే వొచ్చేది. శంకరూ, విశ్వనాధంలు పడే కష్టాన్ని చూసి- తనూ తన మిత్రులూ వాళ్ళిద్దరినీ "కష్టజీవు"లనే వారు హేళనగా

"కష్టేఫలే " అన్నాడు రవి యధాలాపంగా

"ఇంతవరకూ ఎదురయిన అనుభవం మరోలా ఉంది. ఈ రోజుల్లో కష్టం కంటే అదృష్టమే ఎక్కువ ఫలమిస్తుందేమో "

ఎవరిదో ఇంటర్వ్యూ అయినట్టుంది. హాలులో ఒక్కసారి కలకలం రేగింది ఏం ప్రశ్నలు వేశారు? ఎలా ఉంది ఇంటర్వ్యూ? .. అంటూ అతన్ని చుట్టుముట్టారు నలుగురైదుగురు.

అతను నవ్వేసి- "నేను క్యాండిడేట్‌ని కాను

క్లర్కుని. ఇంటర్వ్యూలు ఐదు నిముషాలలో ప్రారంభం కాబోతున్నాయి పన్నెండు మంది అభ్యర్థులు రెండు పోస్టులు మధ్యాహ్నం రెండు గంటలకి ఫలితాలు చెప్పేస్తారు. ఈ బోర్డుమీద – సెలక్టయిన వారిద్దరి పేర్లు ఉంటాయి. మొదట. . రవికుమార్ . రవికుమార్ ఎవరు?" అంటూ చూశాడు.

"నేనే.' అంటూ ముందు కొచ్చాడు రవి

"ఫస్ట్ నేమ్ మీదే. లోపలికి వెళ్ళండి గుడ్‌లక్."

శంకర్ కూడా గుడ్‌లక్ చెప్పాడు రవికి "ఎప్పుడూ ఫస్టు నీదే." నవ్వాడు.

రవి– లోపలికి వెళ్ళాడు అతను తిరిగి వొచ్చేటప్పటికి పది నిముషాలు పట్టింది

'ఎలా చేశావు?"

"బాగానే చేశాను.' అన్నాడు రవి బలవంతంగా నవ్వుతూ

"నిశ్చయంగా చాలా బాగా చేసి ఉంటావు అసలు నువ్వెలా చేసినా ఫస్టు నీదే ఔతుంది అందుకు సాక్ష్యం– గతమే అన్నట్లు – క్యాండిడేట్లు మొత్తం పన్నెండు మంది కదా ... మొదటి పేరు నీది, చివరి పేరు నాది.'

"దానికే ముందిలే ' తేలిగ్గా అన్నాడు రవి అతని కక్కడి నుంచి, శంకర్ ముందు నుంచి ఎంత తొందరగా తప్పించుకుని వెళ్ళిపోదామా అని ఉంది గిల్టీ ఫీలింగ్ కలుగుతూంది కాని– ఏదో బలహీనత కూడా అతన్నావరిస్తూంది శంకర్ ముందు

"రిజల్ట్ వచ్చేవరకూ ఉంటావా?' ఉండమన్నట్లు అడిగాడు శంకర్.

"లేదు పనుంది రెండు గంటలకి కదా మళ్ళీ వొస్తాను' అని హడావిడి పడుతున్నట్లు వెళ్ళిపోయాడు రవి వెడుతూ–

కష్టపడినా తగిన ఫలితం అందని వాడికి కడుపు మండడం సహజమే శంకర్ ధోరణి అలాగే ఉంది– అనుకున్నాడు మనసులో.

* * *

సాయంత్రం.. నాలుగున్నర ఔతూంది

వరండాలో– పాపారావూ, సత్యవతీ, వనజా కూర్చున్నారు– ఎవరి కోసమో ఎదురు చూస్తున్నట్లు

ఇంక సహనం నశించినట్లు "రవి యింకా రాలేదేం?" అన్నారు పాపారావ్

"వొస్తాడు. ఆఫీసులో అపాయింట్‌మెంట్ కాగితం యివ్వాలి కదా అది తీసుకుని. . ఉద్యోగం వచ్చిన ఆనందంలో నలుగురు ఫ్రెండ్సుకి చెప్పి .." ఏదో చెప్పబోయింది సత్యవతమ్మ

'అదేమి కాదు." అంటూ అడ్డుపడింది వనజ అన్నయ్య– అపాయింట్‌మెంట్ ఆర్డరు పట్టుకుని ఫ్రెండ్స్ దగ్గరకి వెళ్ళడు '

"మరెక్కడికి వెడతాడు?'

"తిన్నగా రాధ దగ్గరకి వెళ్తాడు పెళ్ళాం బెల్లమయితే ప్రియురాలు పంచదార '

"నోరు ముయ్యి అన్నీ ముదర కబుర్లే నీకు' కసిరింది సత్యవతి

అదే క్షణంలో గేటు ముందు– పోస్టుమాన్ ఆగాడు. వనజ పరుగెత్తి అతనిచ్చిన కవరందుకుని వొచ్చింది

"అరె' ఇది అన్నయ్య నుంచే ఓహో తను వొచ్చేసరికి ఆలస్యం ఔతుందని– అంతవరకూ చూసుకుని సంతోషిస్తూ ఉండమని అపాయింట్‌మెంట్ ఆర్డరు పంపించాడు కాబోలు లోకల్ పోస్టులో." అంటూ కవరుని తండ్రి కందించింది

పాపారావు ఆత్రతగా కవరు చింపారు, కళ్ళకి అద్దాలు తగిలించుకుని

కవరులో అపాయింట్‌మెంట్ ఆర్డరు లేదు

'ఏమిటండీ పైకి చదవండి. " అంది సత్యవతమ్మ



# గీటురాయి

వణుకుతున్న కంఠంతో పైకి చదవసాగారు పాపారావు

అమ్మా నాన్నా వనజా!

నన్ను క్షమించండి

నాకు ఉద్యోగం రాలేదు ఆశ్చర్య పోకండి జరగవలసినదే జరిగింది ఇది న్యాయమే సహజమే

ఈ యింటర్వ్యూలో అపజయం ద్వారా నేనొక నిష్ఠురమయిన నిజం గ్రహించాను ఈ అనుభవం నా జీవితానికి పాఠం నేర్పింది

మనిషి తెలివి తేటలకు నేటి వ్రాత పరీక్షలూ- మార్కుల విధానమూ ఏ మాత్రమూ కొలబద్దలు కావు ఇది నేనింత కచ్చితంగా ఎలా చెప్ప గలుగుతున్నానంటే- టెన్త్‌లో నేనేమి శ్రమపడి చదవలేదు. ఐనా నాకు కంప్యూటర్ కటాక్షం లభించింది కంప్యూటర్ చల్లని చూపుతో నేను జిల్లాకి ప్రథముడినై పోయాను

ఇంటర్‌లో ఆశ్చర్యకరంగా పేపర్లు తెలిసి పోయాయి ముందుగా. నాకూ మరొకడికి దానితో ఫస్ట్ రాంక్ వొచ్చేసింది కాలేజిలో ఇక డిగ్రీలో- స్లిప్పులు పుస్తకాలు లెక్చరర్ల సహాయం యివన్నీ కలసి వొచ్చి- ఫస్ట్ రాంక్ తెచ్చేసుకున్నాను అంటే- నా మార్కులు నిజంగా నాకు రావలసిన మార్కులు కావు నా అదృష్టానికి వొచ్చిన మార్కులవి నా మార్కులు నావికావు!

ఇంటర్వ్యూలో -

నన్ను కరుణించడానికి కంప్యూటర్ లేదు

ప్రశ్నలు- ముందుగా లీకవలేదు

స్లిప్పులకి, సహాయాలకి విలువ లేదు వ్రాత పరీక్షలలో మొత్తం మూడుసార్లు నన్ను వరించిన అదృష్టానికి- యీ యింటర్వ్యూలో నాకెలా సహాయపడాలో అగమ్యగోచరమై పోయింది పాపం

ఇది- ఇంటర్వ్యూ పకడ్బందీగా అభ్యర్థి ప్రతిభని వెలికి తీయదలచుకున్న మౌఖిక పరీక్ష నిజమయిన తెలివి తేటలను నిగ్గు తేల్చే పరీక్ష ముగ్గురు మేధావులు నన్ను నా తెలివిని నిష్కర్షగా శోధించారు

తేలినదేమిటంటే- నేనూ- నేనూ, మీరందరూ భ్రమపడుతున్నట్లు తెలివయిన వాడిని కానని ప్రతిభకే తప్ప అదృష్టానికి ఆవగింజంత అవకాశం లేని యింటర్వ్యూలో బయటపడిన - చేదు నిజమేమిటంటే- నేను తెలివయిన వాడిని కానని కష్టపడి కృషి చేసేవారికే తప్ప అదృష్టంమీద ఆధారపడే వారి కెల్లవేళలా విజయం చేకూరదని అందుకే నాకుద్యోగం రాలేదు

నేను- మీ అంచనాలని తల్లక్రిందులు చేశాను

మీ అందరి ఆశలనూ నాశనం చేశాను ఏం?

అందుకే సిగ్గుతో మీకు ముఖం చూపలేక మీ ముందు తలెత్తుకు తిరగలేక

పాపారావు యిక చదవలేక పోయారు

'రవీ! నాన్నా!' బాధగా అరిచారు □

# సాగర్ స్కిమ్ మిల్క్‌తో ఆతిధ్యం

మీ యింటికెవరైనా రాగానే, గడపతొక్కి లోపలికి రాగానే. మీ అతిధులకి మీరు చేసే సత్కారం ఏమిటి? ఓ చిరునవ్వు, ఓ కప్పు టీ—అవునా? మరి పరంపరాగతంగా వస్తూన్నదది—మీ సంప్రదాయం, సంస్కృతి, ఆదరణ-వేటి చక్కని పరిణామ స్వరూపం.

మరి వాళ్లొచ్చేసరికల్లా మీ యింట్లో పాలు అయిపోయాయనుకోండి. మీకెలాగో యిబ్బందిగా అనిపించదూ? ఇక అప్పుడి కప్పుడు ఉన్న పళంగా పాలు రమ్మంటే ఎలా వస్తాయి గనక?

సాగర్ స్కిమ్ మిల్క్ పౌడర్, మరి మీ అమ్మగారి, అమ్మమ్మగారి నుంచీ తరతరాలుగా వస్తూన్న ఆ చక్కని సంప్రదాయాన్ని నిలబెడుతుందిక. అది గూడా పొదుపుగా, త్వరగా, తేలికగా. ఇక తీపి పదార్థాలూ, పుడ్డింగులూ అవీ చేసుకోవడానికి యిదెంతో బాగుంటుంది.

ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో




ASP/SMP/5/84 R

## సాగర్
### స్కిమ్ మిల్క్ పౌడర్

పాలలోని మంచిదనాన్నంతా యిస్తుంది, కొవ్వు పదార్థాలు లేకుండానే.



మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కోపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001. గుజరాత్.








డాక్టర్ ముదిగొండ. శివప్రసాద్

(గతసంచిక తరువాయి)

మైసూరులో వింతలు విశేషాలు చూచిన తర్వాత ఇరువురు బెంగుళూరుకు వచ్చారు భవభూతికి ఇప్పుడొక తృప్తి కలిగింది నేటివరకు అనాథగా నున్న సుదారాణి కూతురికి తను సహాయం చేయగలుగుతున్నా నన్న భావనే అతని కెంతో ఊరట కలిగించింది బెంగుళూరు వచ్చాక గిరిజను వెంట బెట్టుకొని, భవభూతి గురుపాదస్వామి వద్ద కెళ్ళాడు. గురుపాదస్వామి నృత్యాలయంలో చాల మంది విద్యార్థినీ విద్యార్థులు ఉన్నారు వారంతా కేవలం భరత నాట్యమే కాకుండా, కూచిపూడి, కథాకళి వంటి ఎన్నో శాస్త్రీయ నృత్యాలు అక్కడ నేర్చుకుంటున్నారు క్లాసు పూర్తి కాగానే విశ్రాంతి సమయంలో భవభూతి గురుపాదస్వామిని దర్శించుకున్నాడు ఉంగరాల జుత్తు, సిల్కు లాల్చి, పంచె, చేతికి వ్రేలాడుతున్న ఒక సన్నటి బంగారు గొలుసు గల్గి గురుపాదస్వామి అచ్చం నాట్యాచార్యునిలాగే ఉన్నాడు కాని ఎందుకనో ఆయన ముఖంలో నాట్యవేదానికి పీఠాధిపతులుగా ఉన్న ప్రాచీన మహర్షుల ముఖంలో ఉండే దివ్యకళ మాత్రం లోపించింది అప్పటికి నాట్యాలయంలో స్త్రీలు పురుషులు వివిధ వయస్సుల వారున్నారు వారంతా స్వేచ్ఛగా మాట్లాడుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ ఒకరి నొకరు రాచుకుంటూ, తిరుగుతున్నారు నిర్ణీతమైన సమయంలో గురుపాదస్వామి డ్రాయింగు రూంలోకి వచ్చి భవభూతిని పలకరించాడు భవభూతి తన్ను తాను పరిచయం చేసుకొన్నాడు గురుపాదస్వామి భవభూతి వంక చూచి 'అవును' మీ పేరు ప్రఖ్యాతులు విని యున్నాను లోగడ మీరొకసారి బెంగుళూరు కూడ వచ్చారట గదా' రవీంద్ర కళాక్షేత్రంలో జరిగిన సాహిత్య గోష్ఠిలో మీరు పాల్గొన్నారని విన్నాను మీతో వ్యక్తిగత పరిచయం లేకపోయినా మీ పేరు ప్రఖ్యాతులు విని యున్నాను "

"కృతజ్ఞుణ్ణి మీకు నాపై గల అభిమానం వల్ల అలా అంటున్నారు. కాని నేనేమి పెద్ద పేరు ప్రఖ్యాతులు గల రచయితనేమీ కాదు."

'ఎందుకు కాదు మీరు ప్రతిభకు క్షీరసాగరమధనం అని డ్యాన్సు బాలే వ్రాసిచ్చారు గదా. దానిని గూర్చి వినియున్నాను చూచే అవకాశం లభించ లేదు. కాని చూచినవారంతా చాలా బాగుందన్నారు"

"అవునండి! రచయితలకు మీ బోటి కళాకారులే ఆలంబన. బళ్ళారి రాఘవ, పీసపాటి నరసింహమూర్తి వంటి మహాపురుషులే జన్మించక పోతే ధర్మవరం వారు, తిరుపతి కవులు ఎన్ని నాటకాలు వ్రాసి మాత్రం ఏం ప్రయోజనం ఇంతకూ నేను వచ్చిన పని చెప్తాను ఈ పాప పేరు గిరిజ. నా కుమార్తె. ఈమె తల్లి చిన్నపుడే చనిపోయింది నేనే గారాబంగా కాన్వెంటులో ఉంచి పెంచాను ఈమెకు మీరు నాట్యశాస్త్రం నేర్పించాలి ఏదో సరదాగ నేర్పడం కాదు. దాన్ని ఆమె జీవనోపాధిగా ఉంచుకొని ప్రొఫెషనల్‌గా తన జీవితాన్ని తీర్చి దిద్దుకోవాలను కొంటున్నది ఇంత చిన్న వయస్సులో ఆ అమ్మాయికి అలాంటి ఊహ ఉండడం ఆశ్చర్యం మీ రాశీర్వదిస్తే తప్పకుండా అది నెరవేరుతుంది "

'అవును' ఈ నాట్యం నేర్చుకునే వారందరు గూడ కళారాధన దృష్టిలో ఉంచుకొనే నేర్చుకోరు కొందరి కిదొక హాబీ మరి కొందరి కిదొక స్టేటస్ సింబల్ నా పాప నృత్యం నేర్చుకుంటున్నది అని నలుగురికి చెప్పుకుంటే అదొక సాంఘిక గౌరవంగా భావిస్తారు, ఇంకొంత మంది డ్యాన్సు నేర్చుకుంటే లావు తగ్గుతుందని వస్తారు వాళ్ళ దృష్టిలో ఇదొక ఎక్సర్‌సైజు అలాంటి వాళ్ళ వల్ల జరిగేది. కళకు ఒరిగేది ఏమి లేదు

'అలా కాదండి' నాకెందుకో అమెచ్యూర్ ఆర్టిస్టులంటే పెద్ద గౌరవం లేదు వృత్తి కళాకారులంటేనే గౌరవం వేరే ఉద్యోగం చేసుకొంటు సరదాగా నాటకమో, నృత్యమో ప్రదర్శన ఇచ్చే వారి వల్ల కళకు రావలసినంత ఎదుగుదల రాదని నా భావం, వారా కళను నమ్ముకోవాలి దానితో జీవించాలి దానిలో తనం కావాలి అప్పుడు మాత్రమే వారు కళా తపస్వులు కాగల్గుతారు "

గురుపాదస్వామి గిరిజ వంక తేరిపార చూచారు ఆమె భయంగా అటూ ఇటూ లేడిలా చూస్తూ మౌనంగా వీరి సంభాషణ వింటూ కూర్చుంది. విశాలమైన ఆమె కన్నులు, సంపెంగపూవు వంటి ఆమె నాసిక, ధనుస్సుల వంటి ఆమె కనుబొమ్మలు, శ్రీకారము తీర్చిదిద్దినట్లున్న ఆమె చెవులు చూచి గురుపాదస్వామి గొప్ప అంతర్జాతీయ నర్తకి కాగల్గుతుంది అందుకు కావలసిన ఆంగిక సౌష్ఠవం ఆమెలో ఉంది అని ఆమెను పలకరించాడు ఆ మాట ఈ మాట మాట్లాడించాడు తర్వాత తన వెంట నాట్య మందిరంలోకి తీసుకొని

**జరిగిన కథ–16:** సుదారాణి తన కథను భవభూతికి చెప్పి గిరిజ తన కూతురని చెప్తుంది సుధారాణి ప్రతిభ కథను భవభూతికి చెపుతుంది మాధురి పటేల్ వివాహ సందర్భంగా నృత్యం చేస్తున్న ప్రతిభ పందిట్లో తానే వధువయినట్లు ఊహించుకుంది నృత్యానంతరం కనిపించిన భవభూతి ఆమెకు తన పెళ్ళి కుమారునిగా కనబడ్డాడు భవభూతి, ప్రతిభ వివాహం చేసుకుంటారనే పుకారు బయలుదేరుతుంది తన గూర్చి భవభూతి అభిప్రాయమేమని ప్రతిభ భవభూతిని అడుగుతుంది ప్రతిభ స్త్రీ రూపంలో ఉన్న నటరాజస్వామి అయితే తానొక భక్తుడిని మాత్రమే అని భవభూతి చెపుతాడు అది విన్న ప్రతిభ చివాలున లేచి వెళ్ళిపోతుంది భవభూతి ప్రతిభ దగ్గరకు ఇక వెళ్ళకూడదని అనుకుంటాడు భవభూతికి, ప్రతిభకి అక్రమ సంబంధం ఉందని ప్రచారం చేస్తుంది ఆరంగేట్రాల ఆండాళ్ భవభూతి గిరిజ తన కూతురని గిరిజ ఉండే స్కూలు వాళ్ళతో చెప్పి ఆ అమ్మాయిని తనతో పంపించమని అడుగుతాడు ప్రిన్సిపాల్ అంగీకరిస్తాడు గిరిజకు గురుపాదస్వామి వద్ద నాట్యం చెప్పించాలనుకుంటాడు భవభూతి

వెళ్ళేరు అక్కడ ఉన్న అనేకమైన బొమ్మలు ప్రపంచ ప్రఖ్యాతి పొందిన సుప్రసిద్ధ కళాకారుల చిత్రాలు ఒక్కొక్కటి చూపించాడు

"నా వద్ద చాలా గ్రంథాలున్నాయి. అవి నాకు సంప్రదాయికంగా గురు ముఖంగా ఎంతో కాలం నుండి వస్తూ వచ్చినవి. వాటి నాధారంగా చేసుకొని నేను ఒక్కొక్క శ్లోకానికి ఒక్కొక్క అభినయ చిత్రాన్ని గీయించాను అలా కొన్ని వేల భంగిమలు నా వద్ద ఉన్నాయి ఇవన్ని సామాన్యంగా నేనెవరికి చూపించను కాని మీవంటి కవిశేఖరులు తప్పక దర్శింపవలసినవే." అన్నాడు గురుపాదస్వామి పాప వెనుకనే వస్తున్న భవభూతిని చూచి. గిరిజ గజ్జెల వద్దకు వచ్చేసరికళ్ళా ఒక్కసారి ఆగింది. జలకణాల కోసం నిరీక్షిస్తున్న చాతకంలా ఆమె పుట్టినప్పటి నుండి 'గజ్జెల కోసమే ఎదురు చూస్తున్నదా అన్నట్లు ఆప్యాయంగా వాటిని చేతులతో తాకింది. సన్నగా గలగల మోగించింది ఆ నాదం వింటున్నపుడామె ఏదో పారవశ్యాన్ని పొందింది గురుపాదస్వామి నాట్య మందిరంలో అవైపు నుండి ఈ వైపుకు నడిపించారు. ఆమె నడకను, చేతులను, కాళ్ళను నిశితంగా పరిశీలించాడు. ఆ తర్వాత ఎంతో సంతృప్తి అతని ముఖంలో కనిపించింది నా సర్వశక్తులు ధారపోసి ఈ పాపను గొప్ప కళాకారిణిని చేస్తాను. భవభూతి కూతురి మీద ఇలా అకస్మాత్తుగా అపారమైన ప్రేమ కల్గడానికి ప్రత్యేకంగా ఏమి ఆస్కారం లేదు అది గిరిజ అదృష్టమో లేక అరంగేట్రాల ఆండాళ్ లాగ ఈయన గూడ వచ్చిన తల్లిదండ్రుల కోసం ఇలాంటి మాటలు అంటూ ఉంటాడా? భవభూతి వెంటనే పోల్చుకోలేక పోయాడు. పాపకు గురుదక్షిణ ఎంతివ్వాలో చెప్పండి అన్నాడు భవభూతి

'మంచిది అలాగే చెప్తాను .. అయిదేళ్ళు కానివ్వండి "

'అప్పుడొకసారి చెపితే నేను ఇచ్చుకోలేనేమో!"

'మీరు ఇచ్చుకోలేనిది.. ఇచ్చుకో కూడనిది నేను అడగను లెండి అంతగా ఇవ్వలేని పరిస్థితి వస్తే డబ్బుతో బాకీ చెల్లగొట్టుకో నక్కరలేదు. క్షీరసాగర మదనంల్లాంటి "బాలే" ఒకటి వ్రాసివ్వవచ్చు కదా" అని గురుపాదస్వామి నవ్వాడు. భవభూతి తాను వచ్చిన పని అయినందుకు సంతోషించాడు. ఆ తర్వాత అవి ఇవి పిచ్చాపాటి కాసేపు ముచ్చటించుకున్నారు కళ అంటే ఏమిటి? కళ ప్రకృతి సిద్ధమా? లేక అనుకరణమా? కళా ప్రయోజనం ఏమిటి? శాస్త్రీయ



అంశాలను గూర్చి చర్చ జరిగింది గురుపాదస్వామి దృష్టిలో నాట్య కళకే గాదు సమస్త కళలకూ ప్రయోజనం ఆనందమే పాఠకుడు రసానందాన్ని పొందడంతో కళయొక్క ప్రయోజనం సిద్ధించినట్లే లెక్క అయితే భవభూతి ఈ వాదనతో అంగికరించలేదు. ఏ కళకైనా సరే ఆనందాన్ని ఇవ్వడం అనేటటువంటిది పరమ ప్రయోజనంగా అంగికరించినప్పటికి అనుషంగికంగా, గౌణంగా కళ మానవాళికి ఏదో ఒక సందేశాన్ని, ఉపదేశాన్ని అందించాలి. అది లేకపోయినట్లయితే కళా ప్రయోజనం పూర్తిగా సిద్ధించినట్లు కాదు. ఆ వాదనను బలపరుస్తూ ఆయన ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులు చెప్పిన ఎన్నో వాక్యాలను ఉదాహరించాడు అలా ఇద్దరి మధ్య శాస్త్ర చర్చ కొంచెం సేపు సాగింది

"భవభూతిగారు! మిలాంటి మహా విద్వాంసులు హైదరాబాదులో ఉండడం ద్వార ఆ నగరం ఎంతో అదృష్టాన్ని పొందింది. మిరు బెంగుళూరు వచ్చి నా దగ్గర ఉండిపోండి మి సహాయం నాకుంటే నేను ప్రపంచమంతా మరొకసారి పర్యటన పెట్టుకొని అద్భుతమైన భారతీయ కళా ప్రదర్శన లిస్తాను" అన్నాడు గురుపాదస్వామి. ఆయన ముఖంలో అమాయకత్వం లేకపోయినా నిజాయితీ మాత్రం ఉందని భవభూతి గుర్తించాడు కావాలనే భవభూతి తన సంభాషణను ప్రతిభ వైపు మరలించాడు. 'ప్రతిభ గారు క్షీరసాగర మథనం అనే నృత్య రూపకం వ్రాసి పెట్టవలసిందిగా నన్నడిగారు ఆమె గొప్ప కళాకారిణి ఈ ప్రదర్శనను వారు విదేశాలలో కూడ ఇవ్వాలను కుంటున్నారు ఆమె నా రచనకు ప్రాణం పోస్తుంది. భారతీయ కళావైభవమంతా ఆమె అణువణువులోను రూపు కట్టుకొని వుంది" ఈ మాటలంటూ భవభూతి గురుపాదస్వామి ముఖ కవళికలు గమనించ సాగాడు గురుపాదస్వామి గొప్ప నాట్యాచార్యుడు ఎలాంటి భావాన్నైనా నిగ్రహించుకోగల సర్వ సమర్థుడు అందువల్ల ఆంగికంగా, సాత్వికంగా అతనిలో ఏమి పరిణామాలు కనిపించక పోయినా అతని కనుపాపల వెనుక లోలోపల మనసు పొరలలో ఏవో కదలికలను భవభూతి గుర్తించ గల్గాడు

'తెలుగు వారి అందచందాలు, కళలు, ఆమెలో రంగరించి పోసినట్లు అమరాయి ముఖ్యంగా ఆమె తల్లి కళాసౌందర్యాలన్నీ ఆమె పుణికి పుచ్చుకొన్నట్లుంది!"

"ఆమె తల్లి ఎవరు?" గురుపాదస్వామి సంభ్రమంతో ప్రశ్నించాడు

"అదే ఆనందవల్లి ద్రాక్షారామంలోని ఒకనాటి ప్రముఖ నర్తకి' భవభూతి చాల సామాన్యంగా అన్నాడు

' 'మికీ విషయం ఎవరు చెప్పారు?' గురుపాదస్వామి నివ్వెరపోయి ప్రశ్నించాడు

"అదేమిటి! హైదరాబాదులో అందరికి తెలిసిన విషయమే ప్రతిభయే హైదరాబాదులో తాను ఆనందవల్లి బిడ్డనని చెప్పుకున్నది మి రామెకు సమస్త విద్యలు నేర్పారట అటు తల్లికి ఇటు గురువుగారికి తన జీవితమంతా ఋణపడి వుంటానని ప్రతిభగారు చేతులు మోడ్చి నాబోటి వారితో అప్పుడప్పుడు చెప్పుకుంటూ వుంటారు." గురుపాదస్వామి భవభూతి చెప్తున్నదంతా వింటున్నాడు అతనిలో ఏదో ఆవేదన, సంచలనం కనిపించాయి.

"అంతేకాదు. ఆమె వద్ద మి ఫోటో కూడ వుంది. తాను రంగప్రవేశం చేసేప్పుడు ముందుగా ఆ చిత్రాన్ని కళ్ళ కద్దుకొని పుష్పాలతో అలంకరించి మరి ప్రదర్శన ప్రారంభించడం నేను చూశాను' భవభూతి చెప్పిన ఈ మాటలు గురుపాదస్వామిలో స్పష్టంగా పరిణామాన్ని తీసుకొని వచ్చింది. ఉన్నట్లుండి అదోలా అయిపోయాడు. అవతల శిష్యులు, శిష్యురాండ్రు వచ్చి ఏవేవో ప్రశ్నిస్తున్నారు కాని వాటికి తగిన సమాధానాలివ్వడం లేదు "మంచిది భవభూతిగారు! మిరు పాపను తీసుకొని వెళ్ళండి. ప్రతి రోజు సాయంత్రం స్కూలు వదిలి పెట్టగానే అక్కడ నుండి ఇక్కడికి వచ్చే ఏర్పాటు చేయించండి అలా వారికి వీలుగాని పక్షంలో పాప నా దగ్గరే ఉంటుంది ఉదయం స్కూలుకు వెళ్ళి సాయంత్రం తిరిగి వచ్చే ఏర్పాటు నేను చేస్తాను"

కృతజ్ఞుణ్ణి. నేటి నుండి ఈమెను మి కప్పగిస్తున్నాను మిరే తల్లిగ, తండ్రిగ, గురువుగ ఈమెను తీర్చిదిద్దండి." గురుపాదస్వామి అంగికరించాడు

భవభూతి పాపను తీసుకొని నాట్యాలయం నుండి బయటికి నడిచాడు

వెంటనే గురుపాదస్వామి వస్తున్నాడు 'ప్రతిభ నాగూర్చి ఇంకేమైనా చెప్పిందా?" గురుపాదస్వామి ప్రశ్నించాడు

'నాతో ఇంకేం చెప్పలేదండి కాని ఆమె మాత్రం ఎప్పుడు మిమ్మల్ని స్మరిస్తుందండి! మీ ఋణం తానీ జన్మలో తీర్చుకోలేను అనే కృతజ్ఞతాభావం

ఆమె కన్నుల్లో నాకెప్పుడూ కన్పిస్తుంది"

ఈ మాటు మాత్రం గురుపాదస్వామి నవ్వినట్లు కనిపించలేదు తన మీద ఆమెకు కోపం ఉందన్న విషయం తనకు తెలుసు అలాంటప్పుడు భవభూతి

మాటలు కేవలం లాంఛనప్రాయమైనవి కావచ్చు లేదా భవభూతిగాని, ప్రతిభగాని ఇద్దరిలో ఒకరు అబద్ధమాడుతుండవచ్చు.

అనందవల్లిని మీ రెప్పుడైనా చూచారా?" గురుపాదస్వామి ప్రశ్నించాడు

లేదండి! కాని నేను ద్రాక్షారామం, అన్నవరం, కాకినాడ వెళ్ళినప్పుడు ఆమెను గూర్చి చాల వినివున్నాను ఆమె జీవితాన్ని ఇప్పటికీ అక్కడ కథలుగా, గాథలుగా చెప్పుకొంటూవుంటారు'

'ప్రతిభకు ఒక సోదరి ఉండేదన్న విషయం మీకు తెలుసా?"

గురుపాదస్వామి మాటలకు భవభూతి దిగ్భ్రాంతుడైనాడు తన ఉద్రేకం తనలోనే అణుచుకొని పైకి మాత్రం మామూలుగా "అవును! అలా నేను నూచ. విన్నాను. పూర్తి వివరాలు తెలియవు."

అవును నాక్కూడా తెలియదు. కాని ఆనందవల్లికి ఇద్దరాడ పిల్లలు పుట్టారని. ప్రతిభతో పాటు మరొకామె కూడ ఎక్కడో ఉండ వుండాలని లేదా చనిపోయి వుండాలని నేను విన్నాను గురుపాదస్వామి ఏదో ఆలోచిస్తూ ఈ మాటలన్నాడు.

"కావచ్చు! నాకా వివరాలు పూర్తిగా తెలియవు అయినా ఆమె నాకెంత చెప్పిందో అంతవరకే విన్నాను. కాని అంతకు మించి ఎక్కువగా ఆమె వ్యక్తిగత జీవితాన్ని గూర్చి తెలుసుకోవడానికి ప్రయత్నించ లేదు'

"అవునవును అంతే! మీ కంతగా అవసరం ఏముంటుంది?" అన్నాడు గురుపాదస్వామి

భవభూతి గిరిజతో సహా బయటికి వచ్చాడు ఆమెను కాన్వెంటులో దింపి తన తిరుగు ప్రయాణానికి సన్నాహాలు చేసుకొన్నాడు అతడు ఎంత తామరాకు మీద నీటి బిందువులా ఉండాలని ప్రయత్నిస్తున్నప్పటికి గురుపాదస్వామి మాటలు విన్న తర్వాత అతనిలో తెలియకుండానే- ఏదో తీవ్రమైన ఆందోళన ప్రారంభమైనది ప్రతిభకు మరొక సోదరి కూడ వుందా? ఉంటే ఆమె ఎవరు? ఎక్కడ ఉంది ఇది పారిజాతమ్మ కూడ తనతో చెప్పలేదే? అంటే ఆమెకు కూడ తెలియని బ్రహ్మభేద్యమైన రహస్యమా? ఈ విషయం పూర్తిగా తెలుసుకోవాలనే కోరికతో అతని మనస్సు గుబగుబ లాడింది. ప్రతిభ కథ ఇప్పుడొక కొత్త మలుపు తిరిగింది ఉద్వేగంతో, ఉత్సాహంతో భవభూతి హైదరాబాదు బండి ఎక్కాడు

(ఇంకా ఉంది)

## అక్క మొగుడుతో అక్రమ సంబంధం!

గుడియాతం అనే వూరుకు చెందిన ఏడుగురు పిల్లల తల్లి రామాయి తన అక్క మొగుడుతో రహస్య సంబంధం పెట్టుకుందట! దానికి అప్పుడప్పుడు అక్క వూరుకు యీమె వెళ్ళేదట. ఈ విషయం గ్రహించిన భర్త నిలదీసే సరికి ఆమె వొప్పుకున్నదట పైగా అదేం తప్పుకాదే! అని కూడా వాదించిందట దాంతో ఆవేశపరుడై ఆమె భర్త ఆమెను బండరాయితో తల పగులకొట్టి చంపేసి తాను పారిపోయాడట.

## ఎత్తు ఎగరడంలో ప్రపంచ రికార్డు!

ఆఫ్రికాకు చెందిన క్లిస్ప్రింగర్ అనే వో రకం లేడి నిట్టనిలువుగా 25 అడుగుల ఎత్తు ఎగుర గలదట. ప్రపంచంలో యింత రికార్డు మరే జంతువూ చూపలేదట.

## అరుదైన పెద్ద బల్లులు!

ఇండొనీషియాలో బల్లి రూపం గల వో పెద్ద శాల్తీ వున్నదట. దీనిపేరు కొమొడో డ్రాగన్ అట దీని పొడవు పది అడుగులట ఈ జాతి బల్లులు చాలా అరుదుగా వున్నాయట. ఈ జాతిని కాపాడ్డానికి ఆ దేశం ఆదేశం యిచ్చిందట.

## నరరూప రాక్షసుల నవీన పోకడలు!

బెంగుళూరుకు చెందిన కులమపాలయం అనే గ్రామంలో భాగ్యమ్మ అనే ఆమెను ఆమె భర్త, అత్తగారూ కలసి ఆమె తెచ్చిన కట్నం చాలలేదని నానాహింసలూ పెట్టేవారట. వారు పెట్టే చిత్రహింసలను ఆమె మౌనంగా భరిస్తూ వుండడంతో వారికి మరింత ఆవేశం వచ్చిందట తత్ఫలితంగా వారు ఆమె మర్మాంగంలో ఆసిడ్ పోశారట



## మార్కెట్టుకి వెళ్ళిన భార్య మాయం!

దక్షిణ ఆర్కాటు వందవాసికి చెందిన మురుగేశన్‌కు, 19 ఏళ్ళ ఇందిర అనే అమ్మాయికి వో నెల క్రితం పెళ్ళయిందట. అనక ఏదో రోగం చికిత్సకు ఆమెను ఆమె భర్త మద్రాసు తీసుకు వెళ్ళాడట. అక్కడ చెట్‌పట్‌లో తమ చుట్టాలింట్లో దిగారట. ఆ రోజు మార్కెట్టుకని వంటరిగా వెళ్ళిన ఇందిర తిరిగి రానే లేదట. పోలీసులు వారం రోజులు గాలించినా ఆమె జాడ తెలియనే లేదట

## భార్య ప్రియుడ్ని ఏట్లో ముంచిన భర్త!

గుడియాతం తాలూకా రామాలై గ్రామంలో 28 ఏళ్ళ వడివేలు తన స్నేహితుడు 29 ఏళ్ళ సంపత్ అనే అతని భార్యతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడట. సంపత్ తన స్నేహితుడు రాజి అనే అతనితో యీ విషయం మాట్లాడి, ఇద్దరూ కలసి వో పథకం వేశారట. తత్ఫలితంగా వారు వడివేలును ఏటి వొడ్డుకు పిలచి అతన్ని ఏట్లో ముంచేసి చంపేశారట. అతని సైకిలు కూడా ఆ ఏట్లోనే పడేశారట.

## వరునికి మంగళసూత్రం!

తమిళనాడు మధురలోని వో స్కూల్లో వుపాధ్యాయినిగా పని చేస్తున్న ప్రేమలత అనే ఆమెకు, మద్రాసు స్పెన్సర్ కంపెనీ కాంప్లెక్స్‌లో వున్న కెనరా బ్యాంకులో పని చేస్తున్న జ్ఞానశేఖర్ అనే అతనికి దిండిగల్లులో వివాహం మహోత్సవంగా జరిగిందట. మాంగల్యధారణ అయ్యాక పెళ్ళికూతురు తనకు పెళ్ళయినట్టు మెడలో వో పసుపుతాడు పడిందని చెప్తూ, "మరి మీకు పెళ్ళి అయినట్టు మీకేం మార్పుకానీ చేర్పుగానీ జరిగింది" అని పెళ్ళి కుమారుని అరవంలో ప్రశ్నిస్తే అతను ఏం చెయ్యమంటావు అనడిగాడట. దానికామె నేను మీకు మంగళసూత్రం కడతాను భార్యకు భర్త, భర్తకు భార్య తాళి కట్టుకుంటే యిద్దరూ సహజీవనంలో సమానులే అని ఆ పెళ్ళి పందిరిలోనే చిన్న ప్రయివేట్ క్లాసు తీసుకున్నదట.

అగ్నోరణికి అచ్చెరు వొందిన ఆ పెళ్ళి కొడుకు "అయితే కానియ్" అని తలొంచాడట ఆమె అంతపనీ చేసిందట– వరుడు జ్ఞానశేఖర్ కదా!

## తొండంతో జన్మించిన శిశువు!

తంజావూరుకు చెందిన పర్వతాంబాళ్ అనే వో గర్భిణి 12 సెంటి మీటర్ల పొడవు ముక్కు కల పిల్లవాణ్ణి కన్నదట. ఈ ముక్కు దాదాపు ఏనుగు తొండంలా కనుపించి, యీ బాలుడు వినాయకుని అవతార మెత్తాడని జనం విరగబడి చూడసాగారట 8 గంటల్లో అతను చనిపోయాట్ట

## ఏడు కాన్పులు – పదిహేను మంది పిల్లలు!

వామక్కలో వో తమిళ ఇల్లాలు యిప్పటికి ఆరు కాన్పులలో కవలలను కని, ఏడో కాన్పులో ముగ్గురు పిల్లలను కని, బహు సంతానవతియై ప్రభుత్వాన్ని హడలు గొట్టిందట. □








# ఈ కళ్లను గుర్తుపట్టగలరా?

## పది సంవత్సరాల సాంఘిక భద్రతా సర్టిఫికెట్

ఇవి ముందు చూపున్న కళ్ళు.

జీవితాన్ని భద్రపరుచుకున్న మనిషికళ్ళు.

సాంఘిక భద్రతాపథకంలో ఇతను భాగస్వామి.

ఇటు భీమా సౌకర్యం అటు మంచివడ్డీ దక్కే పథకంలో ఇతను చేరాడు. ఈ పథకంలో అయిదువేల రూపాయలకు కొన్న సర్టిఫికెట్ పదేళ్లలో పదిహేనువేలు తెచ్చి పెడుతుంది. పదేళ్ళపాటు చెల్లుబాటులో ఉండే భద్రతాసర్టిఫికెటు తీసుకున్నవారు ప్రమాదవశాత్తూ మరణిస్తే వారసులకు మొత్తం సొమ్ము లభిస్తుంది.

రూ.500ల నుంచి రూ. 5 వేల వరకు ఈ సర్టిఫికెట్లు దొరుకుతాయి.

*కొనడం ఎలా!*

మీరు 18–45 సం.ల మధ్య వయస్కులై ఉంటే తిన్నగా పోస్టాఫీసుకు వెళ్ళి సర్టిఫికెట్ మీరే కొనుక్కోవచ్చు. మీ పుట్టిన తేదీ, మీ ఆరోగ్యం గురించి రుజువులు అవసరంలేదు.

**కమీషనర్ స్మాల్ సేవింగ్స్**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్

వివరాలకు:– దగ్గరలోని పోస్టాఫీసులు లేక స్మాల్ సేవింగ్స్ ఏజంట్లు, కలెక్టరేట్‌లోని స్పెషల్ తహసిల్దారులను సంప్రదించండి.

జాతీయ పొదుపు సంస్థ

## రేపుని చూసే కళ్ళు బంగారు భవితకు వాకిళ్ళు

SRUJANA/SS/862

"ప్రకాశరావుగారంటె మిరేనాండి"

తిన్నగా తన సీటు దగ్గరి కొచ్చి అడిగిన ముసలాయన్ని ఎగాదిగా చూసి అవునన్నట్లు తల 'ఊంచి ఏం కావాలన్నట్లు చూశాడు ప్రకాశరావు

నితో కొంచెం మాట్లాడాలి బాబూ అలా బయటికొస్తే "

ఫైలు మూసేసి "పదండి" అంటూ లేచాడు.

ఇద్దరూ వెళ్ళి లంచ్‌రూమ్‌లో కూర్చున్నారు.

'మాది నర్సాపురం బాబూ మి గురించి భీమవరం స్వామినాయుడుగారు చెప్పేరు. ఎప్పట్నుంచో రావాలనుకుంటూనే రాలేక పోయాను. నా కిద్దరబ్బాయిలూ ఇద్దరమ్మాయిలూ బాబూ. పెళ్ళికున్న అమ్మాయితప్ప అంతా స్థిరపడి-పోయారు పెళ్లైన సంబంధం చూసి దానిక్కూడా నాలుగక్షింతలు వెయ్యాలని తాపత్రయంబాబూ. ఒక ఎకరం పొలం పది పన్నెండువేలు రొక్కమూ ఇద్వాసుప వుంది పిల్ల ఒంటి మీద పదికాసుల బంగారం వుంటుందనుకో పెళ్లైన సంబంధం అని స్వామినాయుడుగారు పదే పదే చెప్పడంతో ఆశపడి వచ్చాను మి అభిప్రాయం ఎమిటో చెబితే మి పెద్దలతో మాట్లాడతాను."

ఎంతో ఆశగా అపేక్షగా చూస్తూ చెబుతోంటె ప్రకాశరావు కేమిటో గా అన్పించింది ఆయన చెప్పిన కట్న వివరాలు అతడ్ని పిచ్చివాణ్ని చేస్తున్నాయి.

మాట్లాడవేం నాయనా, ఓహో పెట్టుపోతుల గురించెమి అనలేదనా, ఈ 'కాలానికి తగ్గట్టు చిన్న మోటారు సైకలు కొనిస్తాంలేబాబూ పెట్టుపోతల దగ్గర ఎలాంటి లోటుపాట్లూ రానివ్వంబాబూ. అమ్మాయి మా కనిష్ఠ సంతానం'

తన చెవుల్ని నమ్మలేక పిచ్చిగా చూశాడు కళ్లల్లో నీళ్ళు తిరిగాయి తలొంచుకుని గొణుక్కున్నట్టుగా అన్నాడు 'క్షమించాలి నాకు పెళ్ళై మూడు నెలలయ్యిందండి '

'అలాగా! నీరసంగా అని కుర్చీ వెనక్కివాలారు.

ఆయన ముఖంలో కన్పించిన ఆశాభంగానికి మరింత క్రుంగి పోయాడు ప్రకాశరావు ఒక్క నాలుగు నెలలముందు వచ్చివుంటె యాభైవేల కట్నం ఒకటి రెండూకాదు యాభైవేల కట్నం వచ్చేదనుకునేసరికి తన సొమ్ము నెవరో బలవంతంగా లాక్కొని పోయినట్టు బాధపడ్డాడు అప్పుడు తన పెళ్ళి జరక్కుండా వాయిదా పడివుంటె ఎంతబాగుండేదో అని మధనపడ్డాడు.

"వెళ్ళాం వెళ్ళాం అని తాత్సారం చేసేసరికి పుణ్యకాలం కాస్తాగడిచి పోయింది ఏం చేస్తాంలే




నాయనా ఎక్కడరాసి పెట్టివుంటే అక్కడ అవుతుంది. ఎంత ప్రాప్తమైతే అంతే దక్కుతుంద ' అంటూ గొణుక్కుంటూ వెళ్ళిపోయాడాయన.

మెదడు మొద్దుబారిపోయినట్టైపోగా శిలలా కూర్చుండిపోయాడు చాలాసేపు.

తన విలువేమిటో తెలుసుకోలేక కేవలం ఇరవైవేలకి తలూపేసి సావిత్రి మెడలో తాళికట్టే-శాడు. నీ విలువ ఇది అని ఆ ముసలాయన చెప్పేవరకూ గ్రహించలేక పోయాడు తొందరపడి సువర్ణావకాశాన్ని చేజార్చుకున్నాడు వుత్తిడి అనుకుని ఇత్తడి చేబట్టాడు నిజంగా తనెంత

దురదృష్టవంతుడు!

నిట్టూరుస్తూ లేచి వెళ్ళి తన సీట్లో కూలబడ్డాడు. తప్ప పనిమీద దృష్టి నిలపలేక పోయాడు లంచ్‌బ్రేక్‌వరకూ అన్యమనస్కంగానే గడిపేశాడు ఆపైన ఆఫీసులో కూర్చోవడం సాధ్యం కాదనిపించి తలపోటుగా వుందన్చెప్పి పర్మిషన్ తీసుకుని ఆఫీసులోంచి బయట పడ్డాడు.

సైకిల్ స్టాండులోంచి సైకిలు తీసుకొంటూంటే ఒక కొత్త లూనా వచ్చి అతడి ప్రక్కనాగింది దానిమీద స్టైలుగా కూర్చుని సిగరెట్టు త్రాగుతోన్న రాంబాబుని చూసేసరికి మతిపోయినంత పనయ్యింది ప్రకాశరావుకి.

"ఏం గురూ" అంటూ పలకరించాడతడు

వెర్రినవ్వు నవ్వి "స్కీములో తీశావా?' అనడిగాడు ప్రకాశరావు

"లేదు గురూ, మొన్న పండక్కి మా మావగారిచ్చారు"

"అదృష్టవంతుడివి" అన్నేదు అందామనుకుని మ్రింగేసి వస్తానంటూ కదిలాడు డొక్కుసైకిల్ని ఈడ్చుకుంటూ

మొన్నటి పండక్కి– పెళ్ళయ్యాక వచ్చిన తొలిపండక్కి ముష్టి రెండొందలు చేతిలోపెట్టి ఎంతో గొప్ప బహుమతిచ్చేస్తున్నట్టు ఫోజుకొట్టిన మావగారి ముఖం గుర్తొచ్చిందతడికి

ప్చ్ . దేనికైనా ప్రాప్తం వుండాల్నే రికార్డు అసిస్టెంట్ రాంబాబుకి వాళ్ళ మావగారు మోపెడ్ కొనిచ్చాడు. సీనియర్ యల్డీసీ అయిన తనకి. !

అసలీ మావగార్లకి బుద్ధివుండదు. అల్లుడి హోదాకి గౌరవానికి తగ్గట్టు బహుమతులివ్వాలన్న ఇంగితజ్ఞానం వుండదు గట్టిగా అడిగితే బీదార్పులరుస్తారు. అంత గతిలేనివాళ్ళు ఆడపిల్ల-ల్నెందుకు కంటారో అర్థంకాదు. వట్టి నేస్టీ ఫెలోస్ !



ఇంతక్రితంవచ్చిన నర్సాపురం సంబంధం చేసుకునివుంటే ఏ స్కూటర్మీదో సిల్వర్‌ప్లస్‌మీదో యూమ్మంటూ పూలరంగళ్ళా తిరుగుతూండేవాడు! ప్చ్– పాతసైకిల్తో కుస్తీ పట్టాల్సొస్తోందిప్పుడు'

సైకిలు గోడకాన్చి ఇంట్లోకి నడిచాడు

"అప్పుడే వచ్చేశారేమిటండి. ఒంట్లో బావుండ-లేదా?" ఆదుర్దాగా అడిగిందతడి భార్య సావిత్రి

"నీలాటిదాన్ని కట్టుకున్నాక ఒంట్లో బాగుండటం కూడానా అంతా నా ఖర్మ!" నుదురు కొట్టుకుని గదిలోకెళ్ళిపోయి ముసుగుతన్ని పడుకున్నాడు ప్రకాశరావు.

భర్త ధోరణి చిత్రంగా అన్పించిందామెకి తలపోటుగా వుంది విసుకున్నారేమోనని సర్ది చెప్పుకుని అమృతాంజనం సీసాతీసుకుని గదిలో కెళ్ళింది.

"కొంచెం అమృతాంజనం రాస్తానుండండి "

లాలనగానే అంది కాని ఖస్సుమని లేచాడతడు. "నాకేం అక్కర్లేదు నా కళ్ళముందు నుంచి ఫో అవతలికి. ఎక్కడో దరిద్రగొట్టు మొఖానివి దొరికేవు. "

సావిత్రి కళ్ళల్లో కన్నీటి అల భళ్ళున పగిలింది గబగబా వెళ్ళిపోయిందక్కడ్నుంచి

మరి నాలుగురోజుల్దాకా ప్రకాశరావు చిర్రుబుర్రు లాడుతూనే వున్నాడు. వూరికే అందరిమీదా పడికరిచేస్తూనే వున్నాడు.

బంగారంలాంటి కొడుక్కి కోడలు మందు-పెట్టినందుకే ఇలా అయిపోయాడని నానా శాపనార్థాలూ పెట్టింది ప్రకాశరావుతల్లి శాంతమ్మ ఆవిడపేరు శాంతమ్మగాని దాని అర్థం అవసరం ఆవిడకి బొత్తిగా తెలీదు

రోగం సగం చంపితే ఆవిడ నోరు మిగతా సగమూ చంపేసిందనీ అందుకే ఆవిడ భర్తకి నలభైఏళ్ళనే నూరేళ్ళూ నిండిపోయాయని కిట్టనివాళ్ళు అంటూంటారు

ఆవిడకి కొడుకుమీద ప్రేమకన్నా కోడలిమీద, ద్వేషం ఎక్కువ ఎక్కడ కోడలు కొడుకుని వల్లో వేసుకుని తననీ కూతుర్నీ వీధిలోకి గెంటేస్తుందోనని ఆవిడభయం అంచేత కాస్తదానికి కూడా కోడలిమీద విరుచుకుపడుతూంటుంది.

ఇక ఆవిడ కూతురూ ప్రకాశరావు చెల్లెలూ అయిన రాజేశ్వరి తల్లికన్నా రెండాకు లెక్కువే చదివిందని చెప్పాలి వదినగదిలా మెదిలాం పెద్ద పెడుతుంది షోకులూ టక్కులు మాటాలూ అంటూ మూతి ముప్ఫై వంకర్లు తిప్పుతూంటుంది కాని తనో సినీతారలా అలంకరించుకుంటుంది పెదిమలకి చెప్పకుండానే ఆవిడ చీరలూ గాజులూ నగలూ సింగారించేసుకుంటుంది తనని తన అందాన్ని చూసి ఏ సినీ హీరోయో పెళ్ళాడేస్తాడని కలలు కంటూ సావిత్రి వద్దించడంతో తల్లికి వంటల సాయ తూంటుంది తీయని కలలు నవలలు చదవటం ఆమె హాబీ.

"ఈ మాయదారి సంగతేం తెలియదు సన్నాసితో ఏమైనాయనా రోజు రోజుకి చిక్కి సగమై పోతున్నావ్. ఇంగో ఈ తాయెత్తు కట్టుకో నాయనా గాలిధూళి దిష్టి గిష్టి అన్నీ పారిపోతాయి. అంది శాంతమ్మ.

అయిష్టంగానే అందుకుని కట్టుకున్నాడు ప్రకాశరావు.

'నీకింకేం భయంలేదురా నిశ్చింతగా వుండు

అతడు మౌనం వహించాడుతప్ప తన గుండెల్ని తొలిచేస్తున్న బాధని బయట పెట్టలేకపోయాడు

"ఒరేయ్ అబ్బాయ్. చిన్నప్పుడు నీతో చదువుకున్నాడే శ్రీశైలంగాడు– వాడేరా హోటెల్లో బిల్లులో ఏవో రాస్తాడు. వాడికి పెళ్ళికుదిరింది. ట్రా పాతికవేలు కట్నం ఇస్తున్నార్రా సర్కారుద్యోగం చేస్తున్న నీకు ఇరవైవేలివ్వడానికి ఏడ్చిపోయాడు మీ మావగారు !"

తల్లి మాటలకి కడుపులోంచి దుఃఖం తన్నుకొచ్చింది ప్రకాశరావుకి. "అవునమ్మా. మనం మోసపోయాం ఘోరంగా మోసపోయాం" అని ఏడ్చేశాడు

"ఏం జరిగిందిరా నాయనా " ఆదుర్దాగా అడిగింది

నర్సాపురం సంబంధం గురించీ రాంబాబుకి అత్తగారిచ్చిన మోటారుసైకిలు గురించి చెప్పి "మావగారిచ్చిన కట్నం పెళ్ళి ఖర్చుకే చాల్లేదుకదా" అన్నాడు.

"అవున్రా నాయనా ఆ ముసలాయన ఏదో తవ్వి తలనెత్తేస్తానని మాయమాటల్చెప్పేసరికి పడిపోయాంరా లేకపోతే నీకు ఇరవైవేలు కట్నం ఇచ్చి వూరుకుంటారా? నువ్వేం ఇదవ్వకురా అబ్బాయ్. నువ్వు చలాయించి అడిగితే ఇంకో పదివేలు వచ్చినట్టు ఇస్తాడ్రా మీ మావగారూ నీ మొహంచూసి కాదురా కూతురి కాపురం గురించిస్తాడు వెళ్ళి గట్టిగా అడగరా"

ప్రకాశరావు మొఖంలో చిరుకాంతి ప్రవేశించింది . ఏదో కొత్తదారి కన్పించినందుకు సంబరపడ్డాడు.

"నేనెళ్ళి అడిగితే బాగుండదే "

"పోనీ నీ పెళ్ళాన్ని వుత్తరం రాయమన్రా"

"సరే, ఒకసారి ఏసరి చూద్దాం '

వుత్సాహంగా లేచి బట్టలేసుకుని పోస్టాఫీసు

కెళ్ళాడు

ఆ సాయంత్రం సావిత్రితో చాలా సరదాగా ప్రేమగా ప్రవర్తించాడతడు. ఎన్నడూలేనిది పువ్వులు కూడా కొనుకొచ్చాడు

భర్తలో హఠాత్తుగా వచ్చిన మార్పుకామె ఆశ్చర్యపోయింది అలాఅని అతణ్ని నమ్మడానికామె మనస్సు అనుభవమూ ఒప్పుకోలేదు కూడాను

రాత్రి పనిముగించుకుని గదిలో కొచ్చిందామె. ఎలకరింపుగా నవ్వేడతడు

'ఏవిటివాళ చాలా వుత్సాహంగా వున్నారు . ."

ఏమిటో చెప్పుకో చూద్దాం'

మి మనసులో ఏముందో నాకెలా తెలుస్తుంది? మిమ్మల్ని చూస్తుంటే మాత్రం కోతికి కొబ్బరికాయ దొరికినట్టుగా వున్నారన్పిస్తోంది"

గతుక్కుమన్నాడు ప్రకాశరావు. పేలవంగా నవ్వేడు ఆమె చాలా తెలివైనదని తెలుసు తన ఆలోచనని కూడా పసిగట్టేసిందేమోనని కలవరపడ్డాడు అనవసరంగా ఎక్కువగా ఆనందిస్తున్నట్టు నటించి ఔలాత్తపడ్డానే అని చింతించాడు. ఇప్పుడు తన ఆలోచనని బయటపెట్టి ఆమె తండ్రికి వుత్తరం రాయమంటే చస్తే రాయదనీ పైపెచ్చు ధర్మబోధ చేస్తుందనీ భయపడ్డాడు.

మరేమి మాట్లాడకుండా సిగరెట్టుని బూడిద చేస్తూ పరధ్యానంగా కూర్చుండి పోయిన అతడి వంక వింతగా చూసింది సావిత్రి అతడేమైనా జవాబిస్తాడేమోనని చూసి చూసి ఏదో వారపత్రిక తిరగేసి నిద్రపోయింది.

తనే స్వయంగా వుత్తరం రాస్తే ఎలా వుంటుందన్పించింది అంతలోనే కట్నం గురించి గాకుండా వేరే అవసరార్థం అడిగినట్టుగా శాంపిల్ దోసెగా అడిగితే బావుంటుందన్పించింది.

వెంటనే కవర్ని బయటికి తీసి సావిత్రి రాసినట్టుగా మావగారికి వుత్తరం రాశాడు. అర్జంటుగా ప్రమోషన్ పరీక్షల నిమిత్తం అయిదొందల రూపాయలు కావల్సొచ్చింది గనుక సర్దమని రాశాడందులో.

చిరునామా కూడా రాసేసి నాలిక తడితో అంటించి పాంటుజేబులో దాచేడు. కాసిని మంచినీళ్ళు త్రాగి పడుకోబోతూ భార్యవంక చూశాడు

సావిత్రి అందమైనదే చక్కనే తెలివి తేటలు కూడా

# సావిత్రి

వున్నాయి ఒక్క మాటలో చెప్పాలంటే వుత్తమగృహిణి కుండాల్సిన లక్షణాలన్నిట్ని పుణికి పుచ్చుకుంది. కాని ఆ ఒక్క లోపమూ– అది కట్నం తక్కువ లేకుండా తన హోదాకి గౌరవానికి తగినట్టుగా ఏ యాభైవేలో తెచ్చివుంటే పువ్వుల్లో పెట్టి పూజించే వాడుకాదూ?

ప్చ్.... నిట్టూరుస్తూ పడుకుని హాయిగా నిద్రపోయాడు

మర్నాడు తల్లి అడిగింది రహస్యంగా "ఉత్తరం రాయించేవురా"

"లేదమ్మా. ముందునేనే చిన్న బాణం వేస్తున్నాను తర్వాత దానిచేత పాశుపతాస్త్రం వేయిస్తాను"

"ఇప్పుడు నా కొడుకు వన్పించేవురా" అభినందిస్తూ అంది.

నాలుగో రోజున డబ్బు తీసుకుని బావమరిది తిన్నగా ఆఫీసు కొచ్చాడు డబ్బు చూసి వుక్కిరిబిక్కిరయ్యాడు ప్రకాశరావు. సావిత్రికి చెబుతాడేమోనని భయపడుతూనే ఇంటి కెళ్దామంటూ ఆహ్వానించాడు. వేరే పని మీద విజయవాడ వెళ్తున్నాననీ ఇంకో సారొస్తాననీ చెప్పి వెళ్ళిపోయాడతడు.

తృప్తిగా నిట్టూర్చాడు ప్రకాశరావు. చాన్నాళ్ళ తర్వాత బార్‌కెళ్ళి రెండు పెగ్గులు కొట్టి బిర్యానీ తిన్నాడు.

పెళ్ళి కాకముందు అప్పుడప్పుడూ పార్టీల ఖర్చు మీద మందు కొట్టేవాడు. పెళ్ళయ్యాక ఇంట్లో ఖర్చు పెరగటమూ ఆఫీసులో సీటు మారటం వల్ల పైరాబడి తగ్గి పోవటమూ జరగటంతో అతడి నాలిక ఈ మధ్యన తడారిపోయిందని చెప్పాలి.

కట్నం పేరుతో మావగారి దగ్గరింకో పాతికో ఇరవయ్యో వేలు గుంజితే జల్సాగా గడిపెయ్యొచ్చని కలలు కంటూ ఇంటికెళ్ళాడు.

"త్రాగేరా?" బాధగా కళ్ళ నీళ్ళు నింపుకుని అడిగింది సావిత్రి.

బుస్సున కోపం పొంగి వచ్చిందతడికి "నాసొమ్ము నాఇష్టం. నీ అబ్బ ఇచ్చిన మూటేమి తగలెయ్యటం లేదులే" అంటూ విరుచుకు పడబోయే నిగ్రహించుకున్నాడు ఆమెని మంచి చేసుకోవాల్సిన అవసరం గుర్తురావటమే దానిక్కారణం

తలొంచుకున్నాడు 'సారి . పార్టీలో ఫ్రండ్స్ బలవంతం చేస్తేనూ '

మరివారం రోజులు ప్రశాంతంగా గడిచాయి ప్రకాశరావు జేబు బరువుదిగిపోయింది

"చూడు సావిత్రీ. వుద్యోగుల జీవితాలూ గొర్రెతోకా కూడా ఎదుగూ బొదుగూ లేనివే పెరిగే ధరలకి జీతాలకీ పొంతన వుండదు మనపిల్లలకి పెద్ద చదువులు చెప్పించాలన్నా స్వంతంగా ఇల్లు కట్టుకోవాలన్నా కేవలం జీతం రాళ్ళతో సాధ్యంకాదు అంచేత నీ సహాయం లభిస్తే సైడ్ బిజినెస్ చేద్దామనుకుంటున్నాను" అన్నాడో రోజును భార్యతో ప్రకాశరావు.

విప్పారిత నేత్రాలతో చూస్తూ "నా సహాయమంటే.. .' అనాగింది

'ఏం లేదు ఈ రోజుల్లో కట్నాల రేట్లు గురించి తెలీని వాళ్ళెవరూ లేరు కదా ఆఫ్టాల్ టెన్త్ ఫెయిలైన నిరుద్యోగి కూడా ఇరవై వేలు డిమాండ్ చేస్తున్న రోజులివి డిగ్రీ, చక్కని వుద్యోగం అన్నీ వున్న నాకు యాభై వేలు కళ్ళు మూసుకునిస్తారు కాని నేను ఇరవై వేలకే ఒప్పుకున్నాను బేరసారాల్లేకుండా ఎంచేత? నువ్వు నాకు బాగా నచ్చేవు గనుక అంచేత మన బిజినెస్ కోసం మీ నాన్నగార్నడిగి పాతిక వేలు తేవాలి సావిత్రీ ఇలా అడగాల్సొచ్చినందుకు నాకూ సిగ్గుగానే వుంది కాని ఇంత కంటే గత్యంతరం లేదు .'

అరుణిమ దిద్దుకున్న ఆమె నేత్రద్వయం నిప్పులు కురిపిస్తూ చూశాయి భయకంపితుడై భీతిగా చూశాడతడు

"మీకిచ్చిన కట్నం చాల్లేదంటారు .

అహ అదికాదు బిజినెస్ కోసం . '

'అప్పో సప్పో చేసుకోవాలి. ఇంకో దారి చూసుకోవాలి అంతేగాని కట్నం తక్కువిచ్చారు గనుక ఇప్పుడివ్వండంటే ఏవిటర్థం?"

"మన బాగు కోరే వాళ్ళకి బాగానే అర్థమవుతుంది. బాగానే వుంటుంది కూడా "

"ఇచ్చే వాళ్ళూ తమ బాగు చూసుకోవాలి కదా"

"అంటే ఏవిటంటావ్. మీ వాళ్ళు చిల్లు కానీ ఇవ్వలేరంటావ్ నేనడగటం అన్యాయమంటావ్



'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.

–సంపాదకుడు.

అంతేనా?' గట్టిగా అరిచాడు.

కించిత్తు విస్మయంగా చూసి అంది " ఆ కట్నం ఇవ్వడానికి మానాన్న గారెంత ఇదయ్యింది మీకు తెలీదు. తెలిసుంటే అలా మాట్లాడరు?

'ఇరవై వేలివ్వడానికి తల్లక్రిందులై పోయే వాళ్ళు మా సంబంధానికెందుకు రావాలి?"

"మీ రొప్పుకున్నారు గనుక"

దిమ్మెరపోయాడు. మాటలు దొరక్క తినేసేలా చూశాడు.

"పెళ్ళిలో కట్నం దగ్గరా లాంఛనాల దగ్గరా బహుమతుల దగ్గరా గిచి గిచి బేరమాడి పుచ్చుకుని కూడా తృప్తిపడక పెళ్ళయ్యాక ఇంకా కట్నాలు తెమ్మని ఆడపిల్లల్ని హింసించే వాళ్ళనీ మావగారి సొమ్ము తింటూ జల్సాగా గడిపేద్దామనుకునే వాళ్ళనీ చాలా మందిని చూశాను"

అవాక్కైపోయాడు ప్రకాశరావు ఆమె నింకెలా తన దారికి తెచ్చుకోవాలో తెలీక తల పట్టుక్కూర్చు న్నాడు.

ఆమె కళ్ళల్లో కదిలిన ఈసడింపుకి గుండెలు పట్టేసినట్టు బాధ పడ్డాడు మావగార్నడిగిన అయిదొందల సంగతి ఆమెకి తెలిసిపోయి వుంటే మరెంత అసహ్యంగా చూసేదో తలచుకునేసరికి ఒళ్ళు జలదరించింది.

సరిగ్గా అప్పుడే మెరుపు లాంటి ఆలోచనొచ్చింది గుర్తీ అదే ట్రిక్ప్లే చేస్తే?

హుషారుగా ఈల వేశాడు.

కాని సంపాదన లేని వాడికి కట్నంగా వేలు కుమ్మరిస్తున్న ఈ రోజుల్లో తన భర్త కిచ్చిన కట్నం చాలా తక్కువనీ, నలుగుర్తో చెప్పుకోడానికి చిన్నతనంగా కూడా వుందనీ, ఇంట్లో ఫ్రిజ్ గాడ్రెజ్ బీరువా మిక్సీ లాటి వేమీ లేవనీ అంచేత అధమపక్షం ఇరవై వేలైనా వెంటనే ఇమ్మనీ లేకపోతే తన కాపురం నిలువదనీ సావిత్రి రాసినట్టుగా వుత్తరం రాశాడు మావగారికి.

ఉత్తరం పోష్టు చేసిన ఉత్తర క్షణం నుంచి ఏదో తెలీని భయంతో వుత్కంఠతో వుక్కిరిబిక్కిరై పోయాడతడు.

మూడో రోజున ఆఫీసయ్యాక ఇంటికెళ్ళి సైకిలు దిగుతూ యధాలాపంగా గుమ్మం వైపు చూసిన ప్రకాశరావు వులిక్కిపడ్డాడు. గుమ్మానికివతలున్న చెప్పుల జతని చూసేసరికి ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి.

జారి పోతున్న ధైర్యాన్ని హడగట్టుకుంటూ అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికెళ్ళాడు.

పెళ్ళి ఓ ప్రక్కన ఒదిగి నిలబడి వుంది. మావగారు ఎర్రగా కందిన మొహంతో నిలదీస్తున్నట్టు చూశారతడ్ని. చెమ్మగిల్లిన కళ్ళు తుడుచుకోకుండానే కోపంగా అసహ్యంగా చూసింది సావిత్రి.

బిక్క చచ్చిపోయాడు ప్రకాశరావు. దొరికిపోయిన నేరస్తుళ్ళా ఎవరి వంకా చూళ్ళేక ఎటూ వెళ్ళ లేక ఏమీ చెయ్యలేక తలొంచుకుని నిలబడిపోయాడు.

"రండి అల్లుడు గారూ–"

మావగారి పిలుపులోని మన్నింపుకి ప్రాణం లేచి రాగా ఆశగా చూశాడు అయిష్టంగానే అటు నడిచాడు

సావిత్రి విసురుగా అతడి ప్రక్క నుంచి లోపలి కెళ్ళిపోయింది

"కూర్చో ఎవరో సావిత్రి పేరుతో వుత్తరం రాశారయ్యా. ఏం ఇదైపోతొందో బిడ్డ అని పరుగెత్తు కొస్తే సావిత్రి తనసలు వుత్తరాలే రాయలేదంటొంది"

'ఉత్తరమా? ఎవ్వరాశారంటారు?" అమాయకంగా మొఖం పెట్టాడు. తనకా వుత్తరంతో సంబంధం లేదంటూ దబాయిద్దామనుకొంటొంటే మెల్లగా అన్నారు 'పది రోజుల క్రితం వచ్చిన ఉత్తరాన్నీ ఈ వుత్తరాన్నీ ఒక్కరే రాశారు.'

గతుక్కుమన్నాడు తేలు కుట్టిన దొంగలా మిన్నకుండిపోయాడు

'అల్లుడుగారూ – మీరు చిన్నవారు. ఎంతో భవిష్యత్తు వున్న వారు. మనరెక్కలు బాగుండాలి మనం బాగా సంపాదించుకోవాలి అనుకోవాలప్ప పూరికే ఇతరుల సొమ్ము నాశించడం మంచి పద్ధతి కాదు ఆశకి అంతం లేదు. వున్నదాంట్లోనే తృప్తిని చూడాలప్ప లేని దాని కోసం అంగలారిస్తే వున్నది పోతుంది లేని దుఃఖం వస్తుంది నలుగుర్లో చులకనవుతాం నగుబాట్లు మిగుల్తాయి. నా సంగతి మీకు తెలుసు. ఏదో పిల్లల్ని అద్దం పెట్టుకుని బ్రతికేస్తున్నవాడ్ని. పెళ్ళి ఖర్చుకి కట్నం సొమ్ముకి సర్దుకోలేక ఎంత సతమతమయ్యానో ఎందరి కాళ్ళు పట్టుకున్నానో ఆ భగవంతుడికే తెలుసు కలిగి వుంటే కూతురుకి పెట్టుకోవాలనే చూస్తాడు ఎలాటి తండ్రైనా సరే మీకిచ్చిన కట్నం తక్కువే కాదనను. కాని మా కదే శక్తికి మించిన పని. మీరలాటి తేడాలేం పెట్టుకోకండి. దేవుడు మీకు తప్పకుండా మేలు చేస్తాడు సావిత్రి కసలే అభిమానం జాస్తి మీరేమైనా అంటే చాలా బాధ పడుతుంది ' కళ్ళనీళ్ళు కుక్కుకుని అల్లుడి చేతులు పట్టుకుని అర్థించారాయన

"అబ్బే. అలాటిదేం లేదండి ఆ గొడవలన్నీ ఎప్పుడో మర్చిపోయాను " అన్నాడు

మావగారెళ్ళేక మీ నాన్న దగ్గర డబ్బు వసూలు చెయ్యకపోగా నా పరువు తీస్తావా అంటూ రంకె వేశాడు భార్య మీద ప్రకాశరావు!

★ ★ ★ ★

ప్రక్కింట్లో అద్దెకుంటున్న ప్రియ సావిత్రి స్నేహితురాలు ఇద్దరి అభిరుచులూ అభిప్రాయాలూ చాలా వరకూ ఒకటే కావడంతో అతితక్కువ కాలంలో ప్రాణస్నేహితులయ్యారు.

ప్రియకి సావిత్రి చక్కగా పాడుతుందని తెలుసు. ఆమె విషాద గీతం పాడితే కన్నీరు పొంగి వస్తుందనీ తెలుసు ఏలూర్లో వుంటొన్న ఆమె అన్నగారి కోసం 'పుష్పవిలాపం' పాడమనీ రికార్డు చేస్తాననీ అడిగింది ప్రియ ఒంటరిగా పాడి రికార్డింగ్ చేసుకొంటాననిచెప్పి టేప్ రికార్డర్ తీసుకునొచ్చింది సావిత్రి.

గది తలుపులు దగ్గరికి వేసి రికార్డర్ ఆన్ చేసి గొంతు విప్పింది నాలుగు చరణాలయ్యాయో లేదో విసురుగా తలుపులు తోసుకునొచ్చాడు ప్రకాశరావు. ఈ మధ్య త్రాగుడెక్కువవడంతో మనిషి రూపంలోనూ ప్రవర్తనలోనూ కూడా చాలా మార్పొచ్చింది

గబుక్కున లేచి నిలబడింది సావిత్రి.

"ఏం చేస్తున్నావే పనిపాటా లేదేంటే. కష్టపడి తెస్తొంటె తేరగా తిని కూర్చుంటున్నావుటే

"అతడి సంభాషణ పూర్తవ్వ లేదు కానామె నిష్క్రమించింది. ఎదురుగా వుంటే విచక్షణా రహితంగా ప్రవర్తిస్తాడని తెలుసు అందుకే

తిరువనంతపురంలోని వివేకానందహాలులో తెలుగు సాంస్కృతిక సంఘం ఆధ్వర్యంలో ఇటీవల దసరా సందర్భంగా జరిగిన కార్యక్రమాలలో శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ రచించిన 'త్రిజాకీ యమదర్శనము' అను నాటక ప్రదర్శన జరిగింది ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో శ్రీయుతులు పి. బి. వి రామ్మూర్తి, ఎం. వై. ఎస్. ప్రసాద్ (దర్శకులు), కె మల్లిఖార్జునరావు, పి. భాస్కరరావు, జి. ఎ. చారి (అలంకరణ), బి. వెంకటరమణ, ఎం. ఆర్. ఎం బాబు, కె సుబ్రహ్మణ్యం, పి. ఎస్. ఆర్ శాస్త్రి, కె. అరవింద్, ఎం. ఎస్ నాయుడు, వి. సత్యనారాయణ, జి. వి చారి, సి రవీంద్రనాథ్, సి హెచ్. శ్రీనివాసశాస్త్రి గార్లను చూడవచ్చు.



చిన్నగా స్నేహితురాలింటి కెళ్ళింది

సమాధానమైనా ఇవ్వకుండా అమె అలా నిర్లక్ష్యంగా వెళ్ళిపోయే సరికి అసహనంతో రెచ్చిపోయాడు కుర్చీని దభీమని తన్నేడు

ఛీ – వెధవ ఇల్లు వెధవ పెళ్ళాం వెధవ సంబంధం

చెడామడా తిట్టేస్తోంటే ఏమైందిరా నాయనా అంటూ వచ్చిందతడి తల్లి ఆమె వెంట దూడలా వచ్చింది కూతురు

ఆ దిక్కు మాలిన సంబంధం చేసుకున్నందుకు ఎన్ని కష్టాలొచ్చి పడ్డాయిరా నాయనా నిన్నిలా చూస్తోంటే కడుపు తరుక్కుపోతోందనుకో ముక్కు చీదింది శాంతమ్మ

నీది మరీ చాదస్తమే అమ్మా అన్నయ్యింకో పెళ్ళి చేసుకుంటేసరి తేలిగ్గా అనేసింది రాజేశ్వరి ఆమె అబిమాన రచయిత్రి నవలల్లో ప్రతి హీరోకి ఇద్దరు హీరోయిన్లుంటారు మరి

అదీ నిజమేరోయ్ మొన్న పంతులుగారు చెప్పేర్రా ఈ మధ్యనే ఇద్దరు పిల్లలున్న రెండో పెళ్ళి వాడికి ముప్పై వేలు కట్నం ఇప్పించాట్ట

కాని ప్రభుత్వోద్యోగం చేస్తున్న వాళ్ళు రెండు పెళ్ళిళ్ళు చేసుకో కూడదే

"పెళ్ళాం వుండగా చేసుకో కూడదు గానీ పెళ్ళాం చస్తే ఎందుకు చేసుకోకూడదురా

గుంట్రాయిలా వుంది తనెందుకు చస్తుందే? కూతురు అనుమానం వెలిబుచ్చింది

మనల్నిచంపుకు తింటుంది గాని అదీ చావదే అందుకని మనమే దాన్ని చంపేద్దాం గుట్టు చప్పుడు కాకుండా ఎలుకల మందో నల్లుల మందో పెట్టేద్దాం దెబ్బకి పీడ విరగడైపోతుంది

ఎలుకల మందుకి మనుషలు చావరంటమ్మా అందుకే కిరసనాయిలు పోసి చంపేస్తున్నార్ట అందరూనూ

అదే మంచిది స్టౌకి చీరంటుకుందని చెప్పి తప్పించుకోవచ్చు ఒక్కదెబ్బకి రెండు పిట్టలు నవ్వుకున్నాడతడు

అది చాలా తెలివైందిరోయ్ మనం చాలా జాగ్రత్తగా వ్యవహరించాల్రా

హనుమంతుడి ముందా కుప్పిగంతులు?

అలాగని అజాగ్రత్తగా వుంటే మొదటికే మోసం వస్తుందిరా వీలైన రోజున కానిచ్చేద్దాం ఈలోగా మిగతా ఏర్పాట్లవీ చూడరా అన్నట్టి న్నాల్రోజులూ సావిత్రితో బాగా వుండల్రా అబ్బాయ్ ఇరుగుపొరుగు వాళ్ళంతా గొడవలన్నీ సమసిపోయాయనుకోవాలి ముఖ్యంగా ప్రియకేమీ అనుమానం రానివ్వకూడదు సుమా

ఓ అలాగే

ఈసారి నీ పెళ్ళితో బాటు గంతకు తగ్గ బొంతని చూసి దీనిక్కూడా నాలుగక్షింతలు వేసెయ్యాల్రా అబ్బాయ్

చూద్దాంలే

గాలివాన తగ్గివుంటుందనుకు నొచ్చింది సావిత్రి అంతా గదిలో చేరి మాట్లాడుకొంటోంటే గూడు పుఠాణి చేస్తున్నట్టుగా అన్పించిందామెకి ప్రశ్నార్థకంగా చూసే సరికంతా బెదరినట్టుగా చెదరిపోయాడు

# సమాజం

మనిషి ఎదురయితే
గుర్తింపుగా పలకరింపు
మనిషికి అవసరమయితే
తెలియనట్టుగా ఈసడింపు
మనిషి కలిమికి
కలుగుతుంది స్నేహం
మనిషి లేమికి
ఎదురవుతుంది అసహ్యం
ఈ సమాజంలో మనిషి
ధోరణి అనూహ్యం

–సి ఎ. సర్వేశ్వరశర్మ

# సావిత్రి

గదిలో కెళ్ళింది ఏదో పెద్ద పనున్న వాళ్ళా హడావిడిగా వెళ్ళిపోయాడు ప్రకాశరావు

సాలో చనగా అతడెళ్ళిన వైపే చూస్తున్న దల్లా టక్ మని శబ్దం రావడంతో టేప్‌రికార్డర్ వంక చూసింది అమె నుదురు ముడిపడింది అంటే ఇందాకట్నుంచీ టేప్‌రికార్డర్ రికార్డు చేస్తూనే వుందా?

తలుపులు దగ్గరికేసి రివైండ్ చేసి ఆన్ చేసింది

* * * * *

చనువుగా ఇంట్లో కొచ్చిన పోలీసు ఇన్స్‌పెక్టర్‌ని చూసి ఇంటిల్లపాదీ గాబరా పడిపోయారు ఆడవాళ్ళు తలుపు చాటున దాక్కోగా ప్రకాశరావు అతడి ముందు కెళ్ళాడు పాలిపోయిన ముఖంతో

నమస్తే

నమస్తే మీతో చిన్న పనుండి వచ్చాను మీతో నే కాదులెండి మీ ఇంట్లో వాళ్ళందరితోనూ పనుంది ఒక్కసారి రమ్మనండి

దేనిగురించో

చెబుదామనే పిలవ మన్నాను

ఆ మాటలకి మరింత కంగారుపడుతూ తల్లినీ చెల్లినీ భార్యనీ పిలిచాడు వణకుతూ వచ్చి నిలబడ్డారు వాళ్ళు

మీ ఇంట్లో వరకట్నం గురించి గొడవలు జరుగుతున్నాయని మాకు సమాచారం అందింది

అబ్బే అదెవరో కిట్టని వాళ్ళు చెప్పుంటారు సార్ ఎప్పుడో జరిగిన పెళ్ళికి ఇప్పుడు కట్నం గొడవెవరు పెడతార్సార్ నవ్వబోయాడు గాని అది విరిగి పోయింది

అవునండీ మీరేదో పొరబడి వుంటారు మావారు మా అత్తగారూ నన్నెంతో బాగా చూసుకుంటు న్నారు కట్నం కాదుగదా బహుమతుల గురించి కూడా మావారెప్పుడూ అడిగిన పాపాన పోలేదు సావిత్రి అంది

ఇన్స్‌పెక్టర్ అమె వంక జాలిగా చూసి అన్నాడు నిజమా? వీరంతా అంత మంచివాళ్ళా?

అవున్సార్ అని ప్రకాశరావూ అవునుబాబూ అని శాంతమ్మా రకిమని జవాబిచ్చారు

మీరెలాటివాళ్ళో మీ కోడల్ని ఏం చెయ్యాలను కున్నారో టేప్‌రికార్డర్ చేత చెప్పించ మన్నారా? జేబులోంచి చిన్న టేప్ రికార్డర్ తీస్తూ అన్నాడు

ప్రకాశరావూ అతడి తల్లీ మొఖా మొఖాలు చూసుకున్నారు భయంతో నిలు వెల్లా కంపించి పోతూ అతడి వంక చూశాను

మా సీక్రెట్ పోలీసులు – ఈ మధ్య కొత్తగా పెళ్ళైన వాళ్ళమీదా వారి సంసారాల మీదా ఓ కన్నేస్తున్నాం లెండి– మీ సంభాషణంతా రికార్డు చేశారు అలాటిహత్యాప్రయత్నాలకి ఆరేళ్ళు జైలు శిక్ష పడుతుంది ఇకహత్య చేస్తే మరణ శిక్ష తప్పదు ఆడవాళ్ళని కనికరించే రోజులు పోయాయి ఈ మధ్యనే గుంటూరు జిల్లా అదనపు సెషన్స్ జడ్జి వరకట్నం హత్యకేసులో అత్తగారికీ భర్తకీ మరణ శిక్ష విధించారు ఇప్పుడు నేను మిమ్మల్ని అరెస్టు చేసి తీసుకెళ్ళి ఈ టేప్ రికార్డర్‌తో సహా కోర్టుకప్పజెబుతాను

వొల్లుమన్నారు ఆడవాళ్ళు శాంతమ్మ వెళ్ళి అతడి కాళ్ళ మీద పడింది అది చూసి ప్రకాశరావు కూడా ఆమె ననుసరించాడు

నాదేం తప్పు లేదు బాబూ బంగారం లాంటి పిల్లని చంపేద్దామన్నది వీడే అని తల్లి ఆరోపిస్తే కాదార్ మా అమ్మే మళ్ళీ కట్నం వస్తుందని చంపేద్దామంది అని తిరిగి ఆరోపిం చాడు కొడుకు

నాకేం తెలీదండి నన్ను జైలు పాలు చెయ్యకండి అని వెక్కి వెక్కి ఏడ్చేసింది రాజేశ్వరి

మీ అందరికీ కూడా హత్యా ప్రయత్నంలో పాత్రవుందని ఈ టేప్ రికార్డర్ చెబుతోందిమరి ఓ సారి విందామా?

వద్దొద్దంటూ బ్రతిమాలి లెంపలేసుకున్నారు కన్నీళ్ళతో అతడి కాళ్ళు కడిగారు

ఇంకెప్పుడూ ఇలాటి వెర్రిమొర్రి వేషాలెయ్యకుండా బుద్ధిగా వుంటామని వుత్తరం రాసివ్వండి మాకేమాత్రం అనుమానమొచ్చినా ఇది కోర్టులో మీరు జైల్లో అన్నాడు టేప్ రికార్డర్‌ని చూపిస్తూ

ఇంకెప్పుడూ అలా చెయ్యమనీ సావిత్రి నెంతో ప్రేమగా చూసుకుంటామనీ ఆమెకేం కష్టం గలిగినా దానికి తామె బాధ్యత వహిస్తామనీ రాసిచ్చారు ముగ్గురూకలిసి

నువ్వు వెర్రి గొర్రెవిగనుక వీళ్ళనెంతో మంచివారను కుంటున్నావు గాని వీళ్ళు మనుష్యుల్లోని మృగాలు ఇక మనుష్యుల్లాగా ప్రవర్తించొచ్చు ఎప్పుడైనా కొమ్ము విసిర్తే నాకు చెప్పు దుష్ట శిక్షణ చేస్తాను అంటూ రివిగా వెళ్ళి పోయాడు

హమ్మయ్య ఏం చేస్తాడో అని హడలి చచ్చాను ఏడుకొండలి వాడి దయ వల్ల గండం గడిచింది అంది సావిత్రి

అవునన్నట్టు తలూపారంతా తమ గొడవలు బయటి కెవరు పొక్కించారో వాళ్ళిలా రికార్డు చేశారో ఎంతాలోచించినా ముగ్గుర్లో ఎవ్వరికీ విసమంతైనా అర్థం కాలేదు అయినా నోరు మెదప లేదు ఏ గొడలకి రికార్డు న్నాయో ఎవరికి తెలుసు?- బలుసాకు తినడానికైనా బ్రతికుండా లంటే బుద్ధిగా వుండక తప్పదని లెంప లేసుకున్నారు

థాంక్స్ ప్రియ నా ప్లాన్‌ని సమర్థించిన నీకూ మీ అన్నయ్య నటనకి నా జోహార్లు మనస్సులో అనుకుంది సావిత్రి □

# హైదరాబాదు నోట్‌బుక్

## రాష్ట్రావతరణోత్సవం –

ఈసారి ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవం ఎదు రోజులది ఒక రోజుకు కుదించినా మహోత్సాహావేశాలతో జరిగింది ఉత్సవానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు ఉత్సవాన్ని ప్రారంభిస్తూ ఆరున్నర కోట్ల ఆంధ్రులు తమ ఆత్మగౌరవాన్ని సంస్కృతి వైభవాన్ని సంరక్షించుకోడానికి తమను పునరంకితం చేసుకోవాలని కోరారు పొట్టి శ్రీరాములు గారి ఆత్మార్పణంతో స్వామి రామానందతీర్థ బూర్గుల రామకృష్ణరావు గార్ల వంటి వారి అనన్య కృషితో భాషాప్రయుక్త ప్రత్యేక రాష్ట్రాన్ని పొందగలిగామంటూ వారికి జోహార్లర్పించారు ఆంధ్రప్రదేశ్ ప్రజలు రాష్ట్రాన్ని ఆదర్శ రాష్ట్రంగా రూపొందించాలని తెలుగుదేశం ప్రభుత్వం తలపెట్టిన సంక్షేమ పథకాలకు ప్రజలు హృదయపూర్వకంగా సహకరించాలని కోరారు ఉత్సవ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన సంఘ సంక్షేమ సాంస్కృతిక శాఖల మంత్రి శ్రీమతి కె ప్రతిభాభారతి ప్రసంగిస్తూ ఈ సంవత్సరం తెలుగు భాషా సంస్కృతులను ప్రోత్సహించడానికి తెలుగు విజ్ఞాన పీఠానికి నాలుగు కోట్లు కేటాయించామని తెలుపుతూ తెలుగుదేశం ప్రభుత్వం తలపెట్టిన వివిధ సంక్షేమ పథకాలను వివరించారు ఈ ఉత్సవ కార్యక్రమాన్ని తెలుగు విజ్ఞానపీఠం రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక శాఖ సంయుక్తంగా రవీంద్రభారతిలో ఏర్పాటు చేసింది కుమారి బి విజయశ్రీ మా తెలుగు తల్లికి మల్లెపూదండ గేయంతో కార్యక్రమం ప్రారంభమైంది శ్రీ కమల నాద బృందం దేశభక్తి గేయాల అనంతరం శ్రీ టి నారాయణ బృంద నాదస్వరం వదప తెలుగు విజ్ఞాన పీఠం స్పెషల్ ఆఫీసర్ డాక్టర్ తూమాటి దొణప్ప స్వాగతం పలికారు తెలుగు విజ్ఞాన పీఠంలో ఇంతకు ముందున్న అకాడమీలు లీనమయ్యాయని ఆ అకాడమీల కార్యక్రమాలను విజ్ఞాన పీఠం కొనసాగించడమే కాక నూతన ప్రణాళికలు కూడ చేపట్టిందని అయా అకాడమీల సిబ్బంది బాగోగులను శ్రద్ధగా చూస్తున్నదని అలాంటప్పుడు విజ్ఞాన పీఠం ఏమీ చేయడం లేదని గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నదని కొన్ని పత్రికలు విమర్శించడం సరికాదని డాక్టర్ దొణప్ప అన్నారు ఈ ఉత్సవం సందర్భంలో ఈ సారి కళాకారులను ముఖ్యంగా జానపద కళాకారులను సన్మానిస్తున్నామని ఇది సన్మాన కార్యక్రమానికి నాంది అని ఏటా జరుగుతుందని అన్నారు తర్వాత ముఖ్యమంత్రి ప్రముఖ కళాకారులను కాశ్మీర్ శాలువులతోను వెయినూట పదారు రూపాయల బహుమతితోను సన్మానించారు ముఖ్యమంత్రి సన్మానిస్తున్నప్పుడు వారి జీవిత విశేషాలను ప్రకటించారు ఈ జీవిత విశేషాలను ఒక చిన్న పుస్తకంగాను ప్రకటించారు ముఖ్యమంత్రి సన్మానించిన కళాకారులు వీరు – శ్రీయుతులు అల్లాబకష్(నటులు హరిశ్చంద్ర పాత్రలో విఖ్యాతులు) ఉస్మాన్ సిద్దిక (ప్రముఖ కళాకారులు) నేమనూరి కృష్ణమూర్తి (సంగిత విద్వాంసులు) కేతా గణపతి (చిత్రకారులు) గణపతి స్థపతి(శిల్పాచార్యులు) శ్రీరంగం గోపాలరత్నం (సంగిత విద్వాంసురాలు) దుగ్గిరాల జగదంబ (నర్తకి–రాలేదు) శ్రీపాద పినాకపాణి (సంగిత విద్వాంసులు– ప్రముఖ వైద్యులు) ఆవేటి పూర్ణిమ (రంగస్థల నటి) పెంచలయ్య (వీధి నాటకం) పైడిరాజు (ప్రముఖ చిత్రకారులు), సరిదె మాణిక్యమ్మ (రంగస్థల నటి) రాజసులోచన (సుప్రసిద్ధ చలనచిత్ర నటి నర్తకి) ఎ ఆర్ రాజు (ప్రముఖ చిత్రకారులు) ఎ టి రెడ్డి (ప్రముఖ చిత్రకారులు) కల్లూరి వెంకటరామయ్య (నటులు) దుగ్గిరాల జగదంబ (సుప్రసిద్ధ కూచిపూడి నర్తకి) తోట వెంకటేశ్వరరావు (చిత్రకళా దర్శకులు) తోట వెంకాయమ్మ (సుప్రసిద్ధ తోలుబొమ్మలాట నిపుణ) కొండపల్లి శేషగిరిరావు (ప్రముఖ చిత్రకారులు) ముక్కా సత్తెయ్య (ప్రముఖ బుర్రకథ నిపుణులు) జైహింద్ సత్యం(ప్రముఖ ఛాయా చిత్రకారులు) మిశ్రా సుబ్రహ్మణ్యశాస్త్రి (ప్రముఖ రంగస్థల నటులు–స్త్రీ పాత్రధారులు) ముఖ్యమంత్రి కళాకారులను సన్మానిస్తున్నప్పుడు వారిని గురించి చలోక్తులు విసిరారు ప్రశంసలు చేశారు రాజసులోచన ముఖ్యమంత్రికి పాదాభివందనం చేశారు ముఖ్యమంత్రి ఆమె గొప్ప నటే కాక ప్రజాసేవాపరాయణ అని రాయలసీమ కరువు కోస్తా తుపాను సహాయ కార్యక్రమాలలో తమ బృందంతో పాటు తిరిగారని వెలుగెత్తి చాటారు అనంతరం ముఖ్యమంత్రి కవులను కవయిత్రులను సన్మానించారు వారు అనాటి కవి సమ్మేళనంలో పాల్గొన్న వారు డాక్టర్ దాశరథి ముఖ్యమంత్రిని గాఢంగా ఆలింగనం చేసుకొన్నారు డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మను ముఖ్యమంత్రి మా పెద్దాడబడుచు అనగా ఆమె మా పెద్దన్నయ్య అని ముఖ్యమంత్రిని ప్రశంసించారు విజ్ఞాన పీఠం ప్రత్యేకాధికారి డాక్టర్ దొణప్ప ప్యాంటు షర్టులతో రావడం మాది ముఖ్యమంత్రి ఉద్యోగ నిర్వహణలో ప్యాంటు సరేగాని ఇలాటి సాంస్కృతిక కార్యక్రమాలలో పంచకట్టు శోభ కలిగిస్తుందని చలోక్తి విసరగా రవీంద్రభారతి నవ్వులతో ప్రతిధ్వనించింది కవి సమ్మేళనంలో పాల్గొన్న వారు వీరు – శ్రీయుతులు కొలకలూరి ఇనాక్ నాగభైరవ కోటేశ్వరరావు జ్ఞానానంద కవి పేర్వారం జగన్నాథం దాశరథి అంతటి నరసింహం నారాయణరెడ్డి వాసా ప్రభావతి జె బాపురెడ్డి బోయి భీమన్న కొసరాజు రాఘవయ్యచౌదరి పి రామచంద్ర బేతవోలు రామబ్రహ్మం ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ లక్ష్మీరమణ ఆరివిరాల విశ్వం ముదిగొండ వీరభద్రమూర్తి దివాకర్ల వెంకటావధాని గుంటూరి శేషేంద్రశర్మ ఉత్పల సత్యనారాయణాచార్య (వర్ణ క్రమంలో) రామబ్రహ్మం గారి కవిత చాల నవ్వులు కురిపించింది ముఖ్యమంత్రి విందువు కనుల చెవుల విందువు – అని కొత్త ప్రయోగం చేశారు నాకు వెంటనే సిబ్బుల ప్రకటనలలోని ఈ సబ్బు మురికికి శత్రువు బట్టలకు మిత్రువు అన్న నినాదం జ్ఞాపకం వచ్చింది మధ్యాహ్నం లాల్‌బహదూర్ స్టేడియంలో సాంస్కృతిక కార్యక్రమం నియమించింది ముఖ్యమంత్రి పోలీసు వందనం స్వీకరించడం పోలీసు కవాతు పోలీసు పతకాల ఏహూకరణ ముఖ్యమంత్రి సందేశం పోలీసు దళాల గుర్రపు స్వారీల విన్యాసాలు జరిగాయి

## ఉపశ్రుతి –

ఏం కవిగారూ అంకితోత్సవం బాగా జరుగలేదా చెంపకు చేయి అంటించి కూర్చున్నారేం – అనడిగాను ఒక పుస్తకం అంకితోత్సవం జరిపిన ఒక విశ్వయత్ని పక్కగా జరిగింది కనుకనే అలా కూర్చున్నాను తోట రచయిత్రిని తూలనాడారుట ఈయన ఆవిడ చాచి లెంపకాయ కొట్టింది ఐదు వేళ్లూ కవిగారి కపోలంపై అంకితమయ్యాయి అది ఆ భంగిమ – అన్నారు పక్కన ఉన్న అభిమాని ఒకరు

–తిరుమల రామచంద్ర



ప్రాంత కళా పరిషత్ హైదరాబాదువారు ఏర్పాటు చేసిన అఖిల భారత చిత్ర కళా ప్రదర్శనం గౌరవనీయులు శ్రీ శంకరదయాళశర్మ ప్రారంభోత్సవం చేశారు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ ఆర్ రాజు పరిషత్ అధ్యక్షులు శ్రీ మూలం రాజాగారు చిత్రంలో చూడవచ్చు

## గడియారం వేంకట శేషశాస్త్రి అవార్డు

నిర్మాణాత్మక సాహిత్యకృషికి అంకితమైన "రచన సాహిత్యవేదిక–కడప" ఏర్పాటు చేసిన– మహాకవి. స్వర్గీయ గడియారం వేంకటశేషశాస్త్రి అవార్డు–1985 సంవత్సరమునకు గాను – శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య గారి గ్రంథం "శతరూప" కు లభించినది.

ఈ ఏటి అవార్డు నిర్ణయంలో–శతావధాని శ్రీ భూతపురి సుబ్రహ్మణ్య శర్మ, డా. చల్లా రాధాకృష్ణశర్మ, డా. జి.వి. సుబ్రహ్మణ్యం గారలు న్యాయనిర్ణేతలుగా సహకరించారు.

## వెంకట్ అవార్డు కార్టూన్ల పోటీ

యువ వ్యంగ్య చిత్రకారుడు "వెంకట్" పేరిట రొక్కం అవార్డుల బహూకరణకై వ్యంగ్య చిత్రలేఖనంలో 7వ పోటీని సాధన సమితి (హైదరాబాదు) ప్రకటిస్తున్నది. రూ. 516ల మొత్తాన్ని కనీసం ముగ్గురు విజేతలకు పంచుతారు.

ప్రవేశరుసుం లేదు. ప్రతి పోటీదారు రెండు కార్టూన్లు పంపవచ్చు. అవి ఎగ్జిబిషన్‌లో ప్రదర్శించటానికి అనువుగా 9x12 అంగుళాల సైజులో వుండాలి. ఎగ్జిబిషన్ ప్యాస్ పోర్టు సైజు ఫోటో కూడా పంపవచ్చు.

ఎంట్రీలతో పాటు అవి సొంత కల్పనలనీ, వాటిని ఏ పోటీకీ, పత్రికకూ పంపలేదనీ, నిర్వాహకుల నిర్ణయాలకు బద్ధులమై వుండగలమనీ ప్రకటిస్తూ పోటీదారులు హామీ పత్రాలు పంపాలి.

## అవీ – ఇవీ – అన్నీ

ఎంట్రీలను 1985 డిశంబరు 16వ తేదీ వరకు "కార్యదర్శి, సాధన సమితి, 1–1–336/20 వివేక్‌నగర్, చిక్కడ్‌పల్లి, హైదరాబాదు – 500020, చిరునామాకు పంపాలి.

## ఎఱ్ఱన పీఠము

### సిద్ధాంత వ్యాసాల పోటీ 1986

ఎఱ్ఱన పీఠము (ఒంగోలు) వారు 'నాచన సోమన – ఎఱ్ఱనల హరివంశ రచనము– తులనాత్మక పరిశీలన' అనే అంశంపై అరఠావు సైజులో 150 పేజీలకి మించని సిద్ధాంత వ్యాసాలని ఆహ్వానిస్తున్నారు. ఉత్తమ వ్యాసానికి రు. 3000/–బహుమతి లభిస్తుంది. పోటీలో పాల్గొనేవారు మూడు వ్రాతప్రతులని శ్రీ ధారా రామనాధ శాస్త్రి, కార్యదర్శి, ఎఱ్ఱన పీఠము, మామిడిపాలెం, ఒంగోలు – 523002 అన్న చిరునామాకి 1986 జనవరి 31వ తేదీలోగా అందేలా రిజిస్టర్డ్ పోస్టులో పంపగోరుతున్నారు.

## ఉచిత హిప్నాటిజం ప్రదర్శనలు

హిప్నాటిజం పట్ల ఉన్న అపోహలు తొలగించి దాని శాస్త్రీయతను, ఉపయోగాలను సామాన్య ప్రజలకు తెలియచేసేందుకు, బాణామతి, చేతబడి, మొదలగు మూఢనమ్మకాలు తొలగించేందుకు రెండు నెలల పాటు ఉచిత హిప్నాటిజం ప్రదర్శనలు ఆంధ్రప్రదేశ్ అంతటా ఇవ్వటానికి ఆం. ప్ర. అకాడెమి ఆఫ్ హిప్నాటిజం సంస్థ నిర్ణయించింది. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల వారు ఈ అవకాశాన్ని ఉపయోగించు కోవచ్చును. ప్రదర్శనలు ఏర్పాటు చేయగోరే వారు శ్రీ టి. ఎస్. రావ్, హిప్నాటిస్టు, పోలకంపాడు, తాడేపల్లి పోస్టు, గుంటూరు జిల్లా, 522501కి రాయవచ్చు.

## విజ్ఞప్తి

విజయనగరం జిల్లాలో గల ఔత్సాహిక రచయిత రచయిత్రులను ప్రోత్సహించే సదుద్దేశ్యంతో– సమాలోచనం అనే సాహిత్య పాఠశాలను ప్రారంభించదలిచాం. దయచేసి కధ, కవిత, నవల ఏది వ్రాసిన వారైనా సరే, క్రొత్త, పాత రచయి(త్రు)త లైనాసరే– తమ యొక్క వివరములు, చిరునామా– ఈ క్రింది అడ్రసుకు వెంటనే పంపి సహకరించ వలసిందిగా ప్రార్ధన.

–కె. కె. రఘునందన
కన్వీనర్–సమాలోచనం
4–3–10 కొత్త అగ్రహారం
విజయనగరం–531201

## వీర సావర్కార్ 'హిందూ-పద్-పాదషాహి' గ్రంథావిష్కరణ

నెల్లూరు సాహిత్య సదస్సు యాజమాన్యాన శ్రీమతి దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయములో సెప్టెంబర్ 22 న స్వాతంత్ర వీర సావర్కారుచే ఆంగ్లములో రచింపబడి కళా ప్రపూర్ణ మరుపూరు కోదండరామరెడ్డిగారిచే ఆంధ్రీకరింపబడిన 'హింధూ-పద్-పాదషాహి' అను గ్రంథ ఆవిష్కరణ సభ జరిగినది. తొలుత 'సాగరా' అను వీర సావర్కరుచే రచింపబడి లతామంగేష్కరుచే పాడబడిన టేపు రికార్డు గీతముతో సభ ప్రారంభమైనది. ఈ సభకు అదనపు జిల్లా జడ్జి శ్రీ ఎ. వెంగళరెడ్డి అధ్యక్షత వహించి, గ్రంథమును ఆవిష్కరించారు. ఈ గ్రంథమును ప్రచురించిన స్వాతంత్ర వీర సావర్కరు సాహిత్య సమితి వారికి రిటైర్డు డిప్యూటి కలెక్టరు శ్రీ చక్కరాల రమణయ్య అనువాదకులను నూతన వస్త్రములతోను, నూటపదహార్లతోను సత్కరించారు. వి. ఆర్. కాలేజి చారిత్రోపన్యాసకులు శ్రీ సి. వి. రామచంద్రరావు గ్రంథ అనుశీలనము గావించారు. శ్రీ డాక్టరు మరుపూరు సమాధానము చెప్తూ ప్రారంభములో తమకు బహుకరించిన 116/–లను సావర్కరు సాహిత్య సమితికి ఇచ్చారు. సావర్కరు సాహసోపేత జీవితము, ఆయన హిందూ జాతికి చేసిన సేవలను వివరించారు. సదస్సు వ్యవస్థాపకులు శ్రీ గోసుకొండ వెంకట సుబ్బయ్య వందన సమర్పణతో సభ ముగిసినది. □

ఇటీవల మహాత్మాగాంధి జయంతి సందర్భంగా బొంబాయి తెలుగు ఫెడరేషన్ నిర్వహిస్తున్న కాకతీయ రాత్రి విద్యాలయం మూడవ వార్షికోత్సవం సందర్భంగా వేదికపై శ్రీయుతులు శైవరాములు, డా. వి. ఎస్. రావు (ఫెడరేషన్ ఛైర్మన్), దశరథ మధుకాంత్, గంగూరాంతాండె (కౌన్సిలర్), సుదర్శన్ (బొంబాయి ప్రాంతీయ మహాసభ విద్యా ఛైర్మన్) పద్మశ్రీ ఆరడి వెంకటరావు, డా. వీరనాధ్‌బోగా, పి. చంద్రంలను చూడవచ్చు.



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna
Phones Business 61247, 61248, Editorial 75667

సరికొత్త

# అమృతాంజన్

## స్ట్రాంగ్

## పెయిన్ బామ్







మొండి నొప్పులకు మీకు చాలా ఘాటైన,
శక్తివంతమైన అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్ బామ్ కావాలి.

అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్ బామ్ అతి శక్తివంతమైన, ముఖ్యమైన మూల
పదార్థాలతో సమ్మేళనం చేయబడి భరించలేని
విపరీతమైన తల నొప్పులకు, ఒళ్ళు నొప్పులకు,
కండరాల నొప్పులకు మరియు బెణుకులకు అతి శీఘ్రంగా ఉపశమనాన్నిస్తుంది.

అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్ బామ్ ఎల్లప్పుడూ అందుబాట్లో ఉంచుకోండి.

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
29, NOVEMBER, - 5, DECEMBAR, 85